## సరదాగా....

### గ్రీన్ డాట్

టీచర్ నాలుగో తరగతి పిల్లల్ని ఫీల్డ్‌ట్రిప్పు కని చెప్పి, టైగర్ బ్రిటానియా బిస్కెట్ ఫ్యాక్టరీకి తీసుకెళ్లింది.

బిస్కెట్ల తయారీ, ప్యాకింగ్, లేబులింగ్ వగైరా విషయాలన్నీ విడమరిచి చెప్పారక్కడ. అంతా తెలుసుకున్నాక ఫ్యాక్టరీ నుంచి బయటపడ్డారు. స్కూలుకి తిరిగి వస్తుండగా, బస్సులో టీచర్ విద్యార్థులను ఉద్దేశించి, “పిల్లలూ, బిస్కెట్లు ఎలా తయారుచేస్తారో చూశారుగా! మరి ఆ బిస్కెట్ ప్యాకెట్ కవర్ మీద ఓ గ్రీన్ కలర్ చుక్క ఉంది. దాని అర్థం ఏమిటో తెలుసుకున్నారా? అని అడిగింది. అందరూ తెలియదు తెలియదు అని అరుస్తున్నారు. కానీ వెనుకసీట్లో కూర్చున్న నితేష్ నాకు తెలుసు టీచర్! అంటూ చేయెత్తాడు. ఏమిటో చెప్పు చూద్దాం అన్న టీచర్‌తో, నితేష్ “ఆ చుక్క అర్థం... అర్థం... టైగర్ ఆన్‌లైన్లో ఉంది అని...!”.

టీచర్ అక్కడికక్కడే ఫెయింట్ అయింది.

### ఒక ప్రశ్న?

ఒక ఆదివారం తమ తండ్రులతో కలిసి ఇద్దరు కొడుకులూ చేపల వేటకు వెళ్లారు. గాలం వేశారు. ఎంతసేపటికీ చేపలు పడవే! చూసీ చూసీ విసుగొచ్చింది. ఇలాగయితే చేపలు పడవు కానీ, ప్రవాహం మధ్యలోకి వెళదాం అంటూ చిన్న పడవ ఎక్కి, వలలు తీసుకుని బయలుదేరారు. ప్రవాహం మధ్యలో పడవ ఆపి గాలం వేశారు. మొత్తానికి ఎలాగో కష్టపడి గంట తరువాత తలా ఒక చేప పట్టుకున్నారు. ఇంటికి తిరిగి వెళ్లారు. వీళ్ళ కోసమే ఎదురుచూస్తున్న ఇంటి ఇల్లాలు ఒక పెద్ద గిన్నె తెచ్చి వాళ్ళముందు పెట్టింది. తెచ్చిన చేపలు అందులో పడేశారు తండ్రులూ, కొడుకులూ. తీరా గిన్నెలోకి చూసిన ఇంటి ఇల్లాలు ఖంగుతిన్నది. ఎందుకంటే, ఆ గిన్నెలో మూడే మూడు చేపలు ఉన్నాయి. వెళ్ళినవాళ్ళు తలా ఒక చేప పట్టుకున్నారు కదా! మరి మూడే చేపలు ఎందుకు ఉన్నాయి? ఎవరూ కూడా దారి మధ్యలో చేపను తినలేదు, పారెయ్యలేదు? మరి ఈ మూడు చేపల కథేంటి? వెళ్ళిన వాళ్ళెంతమందీ? ఇదీ ప్రశ్న?

[illegible]

## తీన్ మార్

అమ్మా!! మమ్మల్ని ఆ పక్కింటి శాస్త్రి గారికి దత్తత కివ్వమ్మా!! మేమైనా పూర్తి ఆయుష్షుతో జీవిస్తాము!!

సూపర్ స్పెషాలిటీ ఆసుపత్రి

కొంచెం ఫీజు ఎక్కువైనదనే గానీ.. మీరు పుట్టినప్పుడు ఎంత ఆరోగ్యంగా వున్నారో... ఈ డిశ్చార్జి టైంలో కూడా అంతే ఆరోగ్యంగా వున్నారు సార్!!

జైలుకెళ్ళొస్తే జెట్ లాగ్ లాగా జైల్ లాగ్ వుంటుంది.. మళ్ళీ పగలు నిద్ర అలవాటు చేసుకోవడం కొంచెం కష్టమే!!




8

## ముఖపుస్తకం మజిలీ

మనిషి జీవితాన్ని శాసిస్తోంది సోషల్‌మీడియా. 150 కోట్ల యాక్టివ్ యూజర్లున్న ఈ వేదికపై నిమిషానికి 11 లక్షల లైకులు పుడుతున్నాయి. ప్రేమ, స్నేహం ఒకవైపు, ద్వేషం, కోపం మరోవైపు పెంచుతోందీ 'ముఖపుస్తకం'. ఫిబ్రవరి 4వ తేదీ ఫేస్‌బుక్ డే సందర్భంగా ముఖపుస్తకం ముచ్చట్లు మీ కోసం...

52

### సెల్యులాయిడ్‌పై స్పోర్ట్స్ లైఫ్

చిన్న బడ్జెట్ చిత్రాలు ఓ వైపు, భారీబడ్జెట్, గ్రాఫిక్, సీక్వెల్ చిత్రాలు మరోవైపు అలరిస్తున్నవేళ, అడపాదడపా కోట్లు కొల్లగొడుతున్న కమర్షియల్ వాల్యూస్ నిండిన క్రీడా చిత్రాలు, సందేశాత్మక బయోపిక్స్‌పై ఓ లుక్....

72

### ఇంటర్వ్యూ

అలనాటి సినీస్వర్ణయుగ కాలపు కమెడియన్ చిట్టిబాబు. 56 ఏళ్ళ సినీ కెరీర్‌లో మూడుతరాల నటులతో మమేకమైన 684 చిత్రాల నటుడు. దేవుడిచ్చిన ఈ వేషం పర్మినెంట్ కాదంటున్న చిట్టిబాబు ఇంటర్వ్యూ....

## సీరియల్స్



## కథలు



## ఫీచర్స్



ముఖచిత్రం: లావణ్య త్రిపాఠి
ఫొటో: గోపీకృష్ణ


*రచనలు, కథలు పంపవలసిన చిరునామా*

*నవ్య వీక్లీ, ఆంధ్రజ్యోతి బిల్డింగ్స్, ప్లాట్ నెం.76, అశ్వనీ లేఅవుట్, హుడా హైట్స్, రోడ్ నెం.70, జూబ్లీహిల్స్, హైదరాబాద్-33.* email: navyaweekly@andhrajyothy.com





### పన్లేకపోతే సరి

"డాక్టర్! నేను నూరేళ్లకు పైబడి జీవించాలను కుంటున్నాను, ఏం చెయ్యమంటారు?"
"స్మోకింగ్ అలవాటు ఉందా?"
"లేదు"
"బాగా తింటావా? అదే మితిమీరి తినే అలవాటు ఉందా?"
"అస్సలు లేదు"
"బాగా లేట్‌నైట్ పడుకుంటావా?"
"లేదుగాక లేదు! రాత్రి తొమ్మిది అయిందంటే బెడ్ ఎక్కాల్సిందే, నిద్రపోవాల్సిందే."
"అమ్మాయిలతో అక్కుంబక్కుం ఉందా?"
"ఛీఛీ! అలాంటి అలవాట్లు లేవు."
"అలాంటప్పుడు నీకెందుకయ్యా అన్నేళ్ళు? మరేం పన్లేకపోతే సరి."

### దొందుకి దొందూ

మేనేజ్‌మెంట్ స్కూల్లో చదువుతున్న ఓ అబ్బాయి, అదే స్కూల్లో చదువుతున్న ఓ అందమైన అమ్మాయిని హఠాత్తుగా కౌగలించుకున్నాడు. అతని ప్రవర్తనకు ఆశ్చర్యపోయింది అమ్మాయి. అడిగిందిలా.
"ఏంటిది? ఏం చేస్తున్నావు నువ్వు?"
"డైరెక్ట్ మార్కెటింగ్" అని నవ్వాడు అబ్బాయి. అంతే! ఆ అబ్బాయి చెంప 'ఛెళ్'మంది.
"ఏంటువ్వు? ఎందుకు కొట్టావు?" అడిగాడు అబ్బాయి.
"దీన్నే కస్టమర్ ఫీడ్‌బ్యాక్ అంటారు." అన్నది అమ్మాయి.

### అంతే

కొడుకుకేమో సర్జన్‌గా పెద్ద పేరుప్రతిష్టలు ఉన్నాయి. అతను ఓ రోజు తండ్రికే ఆపరేషన్ చేయాల్సి వచ్చింది. ఆపరేషన్ చేయబోతూ వణకిపోసాగాడు కొడుకు. గమనించాడది తండ్రి. అన్నాడిలా.
"కంగారుపడకు! అధైర్యపడకు! ఒక్కటి గుర్తు పెట్టుకో! నాకేమైనా జరిగిందే అనుకో, మీ అమ్మ నీ భార్యతో పాటు మీ ఇంట్లో ఉంటుంది, అంతే."

### సరిపోతుంది

"డాక్టర్‌గారూ! నేనెప్పుడు కాఫీ తాగినా నా కళ్ళలో ఏదో గుచ్చుకుంటున్న ఫీలింగ్."
"సింపుల్! కప్పులో స్పూన్ తీసి, కాఫీ తాగండి. సరిపోతుంది."

-వైనతేయ

w m w

పుస్తక పఠనం ఎంతటి
బాధనయినా మరపిస్తుంది.

నవ్య

సంపుటి: 13 సంచిక: 49
8-2-2017

మేనేజింగ్ డైరెక్టర్
వేమూరి రాధాకృష్ణ

ఎడిటర్
ఎ.ఎన్.జగన్నాథశర్మ



మొదటి పేజి

# స్వర్ణోత్సవాలు

రాయుడిగారిపెళ్ళి జరిగి రేపటికి యాభై ఏళ్ళు. అలాగే వారు అగ్రహారంలో స్థాపించిన చైతన్యకళాస్రవంతి సంస్థకు కూడా రేపటితో యాభై ఏళ్ళు నిండుతున్నాయి. రెంటికీ కలిపి స్వర్ణోత్సవాలు జరిపేందుకు పెద్దలు సిద్ధమైతే, నా పెళ్ళికి అగ్రహారంలో మీ హడావుడి ఏమిటండీ? సంస్థకు స్వర్ణోత్సవాలు చెయ్యండి, చాలు అన్నారు రాయుడుగారు. యాభై ఏళ్ళ వైవాహికజీవితం అంటే ఆషామాషీ కాదయ్యా! అమ్మగారూ మీరూ ఏ పొరపొచ్చాలూ లేకుండా ఇన్నేళ్ళు గడిపారంటే అది చాలా గొప్ప విషయం. ఆ సంగతి ఈతరానికి చాటి చెప్పండి! లేకపోతే అగ్రహారం బాగుపడేటట్టులేదు అన్నారు పెద్దలు. ఏమైంది? ఆందోళన చెందారు రాయుడుగారు. ఏమైంది అంటే ఏం చెప్పమంటారయ్యా! పిల్లలకి ప్రేమాభిమానాలు లేవు. అగ్రహారంలో ఏ ఒక్క జంటా కలిసి లేదు. అహంతో విర్రవీగుతున్నారు. విడిపోతున్నారు. వాళ్ళని కలపాల్సిన బాధ్యత మీదే అన్నారు పెద్దలు. కచేరీ చాలించి వెళ్ళిపోయారు.

ఆ రాత్రి భార్యతోపాటుగా రాయుడుగారు బాగా ఆలోచించారు. పిల్లలకి ఏమైంది? ఎందుకిలా జరుగుతోంది? పెళ్ళి అంటే ఇద్దరు వ్యక్తులు కలసి కాపురం చెయ్యడం కాదు, రెండు వ్యక్తిత్వాలు పెనవేసుకోవడం. పెనవేసుకున్న రెండు వ్యక్తిత్వాలూ ఒకదాన్ని ఒకటి గౌరవించుకోవడం. ఆ సంగతి ఎందుకు తెలుసుకోరు? తెల్లార్లూ తీవ్రంగా ఆలోచించారు రాయుడుగారు. అందుకు నాలుగు పరిష్కారాలు కనుగొన్నారు. వాటిని భార్యతో పంచుకున్నారు. చెరో రెండూ మర్నాడు తెలిపి, అగ్రహారాన్ని తెరిపిన పెడదాం అనుకున్నారు. తెల్లారిందింతలో. సాయంత్రం ఉత్సవాల్లో భాగంగా రాయుడుగారికీ, వారి శ్రీమతికీ సన్మానం చేశారు పెద్దలు. చెరో రెండు మంచిమాటలు చెప్పమని వేడుకున్నారు. ముందుగా అమ్మగారిని మాట్లాడాల్సిందిగా కోరితే సరే నంటూ లేచి నిల్చున్నారామె. సభికుల్ని నవ్వుతూ చూశారు. అంతా భార్యాభర్తలే! చిన్నవారే! ఒకరంటే ఒకరికి పడనట్టుగా కూర్చుని ఉన్నారు. చూస్తోంటే జాలి వేసింది. సభకు నమస్కరించి, నేరుగా విషయానికి వచ్చారామె.




భార్యాభర్తలంటే ఎప్పుడూ ఒకరిని ఒకరు అంటిపెట్టుకుని, ఒకరి చుట్టూ ఒకరు తిరగాలనే రూలేం లేదు. స్నేహితులకీ, బంధువులకీ కూడా వారు కొంతసమయాన్ని కేటాయించుకోవచ్చు. అంటే ఇద్దరూ కాస్తంత వ్యక్తిగత ఏకాంతాన్ని ఏర్పరచుకోవాలి. అలాగని భాగస్వామిని పట్టించుకోకపోవడం పొరపాటు. ఇటు కుటుంబాన్నీ, అటు వ్యక్తిగత జీవితాన్నీ రెంటినీ సమన్వయం చేసుకోవాలి. చేసుకుంటేనే దానిని కాపురం అంటారు. వారినే భార్యాభర్తలంటారు అన్నారామె. బాగుందంటే బాగుందనుకున్నాయి జంటలు. కొంత తేలిక పడ్డాయి. పెళ్ళి అయిన కొత్తలో భార్యాభర్తలమధ్య చిన్న చిన్న గొడవలు వస్తాయి. అది సహజం. ఆ గొడవల్ని అప్పుడే మరచిపోవాలి. అంతేగాని ఏళ్ళు గడిచినా వాటిని పట్టుకుని ప్రయాణించడం తప్పు అన్నారామె. అవునవును అనుకున్నాయి జంటలు. తప్పు చేసినట్టుగా తలలొంచుకున్నాయి. రాయుడుగారి వంతు వచ్చిందప్పుడు. ఆయన మాట్లాడసాగారు. ప్రతివ్యక్తిలోనూ లోపాలు ఉంటాయి. ప్రతి వ్యక్తితోనూ సమస్యలు ఉంటాయి. భాగస్వామిలో అవి ఉంటే మార్చాలనుకుంటాం. ఆ అనుకోవడంలో మార్పు జరగదు సరికదా, కొత్తసమస్యలు పుట్టుకొస్తాయి. అందుకని ఎదుటివ్యక్తిలో దయచేసి లోపాలు వెతకొద్దు. ప్రత్యేకతలు గుర్తించండి. వీలైతే వారిని ప్రశంసించండి. అది అనుబంధాన్ని పెంచుతుంది అన్నారు రాయుడుగారు. బలేబలే అనుకున్నారంతా. భార్యాభర్తలు ఒకరిని ఒకరు మెచ్చుకోలుగా చూసుకున్నారు.

పెళ్ళయిన కొత్తలో భాగస్వామి సాధించిన ఓ చిన్న విజయాన్నీ, పుట్టినరోజునీ, మరో ప్రత్యేకమైన సందర్భాన్నీ విశేషంగా గుర్తిస్తాం. కాలం గడిచినకొద్దీ వాటిని మరచిపోతాం. అది చాలా తప్పు. దయచేసి ఆ తప్పును సరిదిద్దుకోండి! పెళ్ళయిన కొత్తలో భాగస్వామికి చిన్నచిన్నకానుకలు ఇచ్చి ఎలా సంతోషపెట్టేవారో అలాగే ఇప్పుడూ చెయ్యండి. అనుబంధాన్ని పెంచుకోండి అన్నారు రాయుడుగారు. అలాగే అన్నట్టుగా చూశారు పిల్లలు. ఆనందాన్ని వ్యక్తం చేశారు. అది గమనించి, త్వరలో అగ్రహారం కళకళలాడుతుందనుకున్నారు రాయుడుగారు. సహకరించినందుకు శ్రీమతికి చేతులు జోడించి నమస్కరించారు. స్వర్ణోత్సవాలు ముగిశాయి.




## అంబులెన్స్ సర్వీస్

ఈ భూమ్మీద ప్రతీ ఒక్క ప్రాణికీ జీవించే హక్కుంది. మనిషిగా సాటి ప్రాణుల్ని కాపాడే బాధ్యత కూడా మనమీదే ఉంది. కానీ మనలో ఎంతమంది నోరులేని మూగజీవాల రక్షణ కోసం పాటుపడుతున్నారు. కుక్కల్ని, పిల్లుల్ని, పక్షుల్ని పెంచుకోవడం మాట అటుంచితే మిగిలిన జంతువుల పట్ల మనం చూపించే జాలి, దయ, కరుణ ఏపాటి? ఇదే ఆలోచనతో పనిచేస్తోంది పీపుల్ ఫర్ ఆనిమల్స్ ట్రస్ట్(పీఎఫ్ఏ). జంతువుల సంక్షేమం కోసమే ఏర్పాటైన ఆర్గనైజేషన్ ఇది. రవి దూబే అనే 31 ఏళ్ళ యువకుడు వన్య ప్రాణులు, సాధుజంతువుల కోసం ఈ సంస్థను ఏర్పాటు చేశాడు. హర్యానా, ఫరీదాబాద్ లోని పల్వాల్ చుట్టుపక్కల మొదలుకొని మధుర దాకా పీఎఫ్ఏ ద్వారా జంతువుల కోసం పాటు పడుతున్నాడు. ఏకంగా ఒక ఉద్యమాన్నే లేవదీశాడు. ప్రతీ ప్రాణిని గౌరవించేలా నలు గురిలో చైతన్యం రగిలిస్తున్నాడు.

ఏ జంతువు ప్రమాదంలో పడినా, దానికి ఎలాంటి ఆపద వాటిల్లినా వెంటనే తమ ఆర్గనైజేషన్‌కు తెలియజేయడానికి ఒక హెల్ప్‌లైన్ నంబర్ కూడా పెట్టాడు. వాటికోసం రెండు అంబులెన్స్‌లు ఏర్పాటుచేశాడు. ఒకటి పల్వాల్‌లో ఉంటే,



రెండోది హోదాల్‌లో తిరుగుతుంది. గాయపడ్డా, ట్రాఫిక్‌లో ప్రమాదం జరిగినా హెల్ప్‌లైన్ ద్వారా సమాచారం చేరవేస్తే వెంటనే అంబులెన్స్ వెళ్లి రెస్క్యూ చేస్తుంది.

అంతేకాదు వేసవిలో నీటికొరత దృష్టిలో పెట్టుకుని మూగజీవాల కోసం ఫరీదాబాద్, ఢిల్లీ చుట్టుపక్కల సిమెంట్ నీటితొట్టెలు ఏర్పాటు చేస్తారు. వాటర్ ట్యాంకర్ల ద్వారా ప్రతీ నీటితొట్టె నిండుగా ఉండేలా జాగ్రత్తలు తీసుకుంటారు.

ఈ సంస్థలో పనిచేసే వారందరూ స్వచ్ఛందంగా సేవ చేసేవారే. కాలేజీ కుర్రవాళ్ల దగ్గర నుంచి వృద్ధుల వరకు పనిచేస్తున్నారు. కేవలం జంతువులను కాపాడడం, వాటి దాహార్తి తీర్చడమే కాదు, స్కూళ్ళలో, కాలేజీల్లో వర్క్‌షాప్స్ కండక్ట్ చేస్తోందీ సంస్థ. మనం మాత్రమే కాదు మనతోపాటు సకల చరాచర ప్రాణికోటి కూడా మనగలగాలి అనే కోణంలో చైతన్యం తెస్తున్నారు. భవిష్యత్తులో మొబైల్ అంబులెన్సులు విస్తృతపరిచి, నోరు లేని జీవాలకు ఇంకా మెరుగైన సేవలు అందించడమే లక్ష్యంగా పెట్టుకుంది పీపుల్ ఫర్ ఆనిమల్స్ ట్రస్ట్.

# మెయిల్ బాక్స్

### హృదయాన్ని హత్తుకున్న సలీం కథ

జనవరి 18వ తేదీ సంచికలో సలీంగారి కథ 'జో పాపాలాలీ' చాలా బాగుంది. అంతకు ముందు కూడా సలీమ్‌గారి రచనలు చదివాను. సామాజిక స్పృహ ఉన్న రచయిత. అలాగే వీక్లీ కథలు చాలా బాగా ఉంటాయి. ఎంత బాగా అంటే హృదయానికి హత్తుకునేలా ఉంటాయి. ఉదాహరణకు నవ్య జనవరి 25వ తేదీ సంచికలో 'నిష్కాతుడు' కథ.

-ఆర్.వి.జి.కె.ప్రసాద్, సికింద్రాబాద్

### సినీవాలిలో మేకప్‌చాటు నిజాలు

సినీ పరిశ్రమలో మేకప్‌చాటు నిజాల్ని మొహమాటంలేకుండా నిర్భయంగా సినీవాలి సీరియల్‌లో వివరిస్తున్నారు రచయిత ప్రభాకర్ జైని గారు. ఇంట్లోంచి పారిపోయి సినిమాల్లోచేరి డబ్బులో మునిగితేలాలని, పేరు సంపాదించాలని గాలిలో మేడలుకట్టే ఆడపిల్లలు ఈ సీరియల్ చదివి వాస్తవాలు తెలుసుకోగలుగుతారు. ఇటువంటి రచనలకు సార్థకత, రచయిత శ్రమకు తగ్గ సత్ఫలితం ఇదే.

-పొత్తూరి విజయలక్ష్మి, హైదరాబాద్

### సాఫ్ట్‌వేర్ రచయిత్రికి అభినందన

సాఫ్ట్‌వేర్‌లో సరిగమలు సీరియల్ చాలా బాగుంది. మల్టీనేషనల్, నేషనల్ సాఫ్ట్‌వేర్ కంపెనీల్లో పనిచేసే ఉద్యోగుల ఇతివృత్తంగా మనసుకు హత్తుకునేలా రాస్తున్నారు. రచయిత్రికి అభినందనలు. సంక్రాంతి ముఖచిత్రం అలరించింది. భారత రామాయణాలవలే హరివంశం కూడా అద్భుతంగా పాఠకులను ఆకట్టుకుంటోంది.

-కె.రఘుపతి, సికింద్రాబాద్-10

### ఆలోచించదగిన రివ్యూ

కులమతాలపేరిట ఓట్లు అడగడం చట్టవిరుద్ధం అనే సుప్రీం తీర్పు ప్రస్తావన లేకుండా చాపకింద నీరులా ఆ వ్యవహారాలు సాగిపోతుంటాయి. ఏ ప్రాంతంలో ఏ కులమతాలు ఎక్కువ ఉంటే వారినే అభ్యర్థులుగా పార్టీలు నిలబెడతాయి. ప్రజలు సాధారణంగా తమవారికే ఓటు వేస్తారు. ఈ ప్రహసనం సుప్రీంకోర్టు తీర్పులతో ఆగదు! రివ్యూ ఆలోచించదగినదిగా ఉంది.

సంక్రాంతి వచ్చిందే తుమ్మెదా... వ్యాసం విశేషాలు ఆకట్టుకున్నాయి. చదివించిరి నను గురువులు కథ చదివింపజేసింది. సీరియల్స్ బాగుంటున్నాయి. పాకడమూ ఒక వ్యాయామమే అని తెలిసింది. వదలకుండా చేస్తున్నాం.

-ఎస్.ప్రసాద్, చెన్నై

### వీక్లీ సర్వాంగ సుందరం

వీక్లీని సర్వాంగసుందరంగా తీర్చిదిద్దుతున్న సంపాదకులు జగన్నాథశర్మగారికి అభినందనలు. మొదటిపేజీ నుండి చివరిపేజీలో 'ఇవన్నీ నిజాలే' వరకు సాంస్కృతిక, సాహిత్య, సైంటిఫిక్ విలువలతో కూడిన అంశాలు అందిస్తున్నారు. వీక్లీ విలువ పెంచుతున్నారు. గుండెల్ని కదిలించే సలీం గారి కథ 'జో పాపా లాలీ' వంటి అనేకానేక కథలు చదివే అవకాశం లభిస్తోంది. ఈ ప్రస్థానం ఇలాగే కొనసాగాలి, పత్రిక ఇంకా దేదీప్యం కావాలి.

-డాక్టర్ ప్రణవి, కె.కె.నగర్, చెన్నై-78

## సరదాకథల్లో సునిశిత హాస్యం

ఈ మధ్యకాలంలో కనిపించని సునిశితమైన హాస్య కథలు నవ్యవీక్లీలో చదివి నేనెంతో ఆనందించాను. రచయిత రాంపాగారి సరదాకథలు నన్నెంతగానో ఆకట్టుకుంటున్నాయి. సినిమాల్లో ముదురుహాస్యం, వల్గర్ హాస్య సన్నివేశాలు చూస్తూ విరక్తికలుగుతున్న సమయంలో నవ్య 'సరదా




కథలు' ఆహ్లాదం కలిగిస్తున్నాయి. గాగీ! గీగా! కథ మరింత ఆకట్టుకుంది. కథల్ని కొనసాగించగలరు.

-పి.రామతిలకం, సామర్లకోట

### ఐ లైక్ టీనేజ్ ట్యూన్స్

యువతరం ఆలోచనలు, వారిని ఆ వయసులో అర్థం చేసుకోవడం ఎలా అనే విషయాలను టీనేజ్‌ట్యూన్స్‌లో చాలాచక్కగా వివరిస్తున్నారు. తల్లిదండ్రులు తీసుకోవాల్సిన జాగ్రత్తలు, స్నేహం విలువ, ఎలాంటి స్నేహాలు చేయాలి, టీనేజ్‌లో కలిగే స్పందనలు, మధురానుభూతులు, వయసువచ్చే సమయంలో ఎదుగుతున్న శరీర మార్పులను ఎలా అర్థంచేసుకోవాలి వంటి ఎన్నో అంశాల్ని సవివరంగా చెపుతూ వారం వారం అలరిస్తున్నారు. ఐ లైక్ టీనేజ్ ట్యూన్స్.

టీనేజ్‌ట్యూన్స్ రిథమ్ ఆఫ్ లైఫ్ ఆసక్తికరంగా సాగుతోంది. యువతకు నచ్చే మెచ్చే అంశాలు రాస్తున్నారు. రివ్యూ బాగుంది. రాంపా సరదా కథలు బాగున్నాయి.

-వనజ, హైదరాబాద్

-చంపక్, మాధవనగర్

### కిక్కిచ్చిన కాఫీ

మార్నింగ్ కాఫీ మేకప్ ఝలక్...భర్త క్రెడిట్ కార్డు అవతారం వంటి అంశాలతో కిక్కిచ్చింది. మొదటి పేజీ హృద్యంగా ఉంది. ఇది కథకాదు కథాకర్త ఎన్టీఆర్‌కు మా అభినందనలు. డాక్టర్ దేవులపల్లి వాణిగారి 'కందిలి' కవిత చాలా బావుంది. హరివంశం చదువుతున్నాం. టీనేజ్‌ట్యూన్స్ నచ్చుతున్నాయి. క్రైమ్ కథలు పాలో అవుతున్నాం.

-నేమాన సుభాష్‌చంద్రబోస్, విశాఖపట్నం

# మార్పు తెలియని ఊరు

కాలంతోపాటే మారడం ఒక సూత్రీకరణ. అలా మార్పుచెంది చాలా గ్రామాలు అభివృద్ధిపథంలో ఉంటే, మార్పును అంగీకరించ కుండా అసలు ప్రభుత్వాలతో పనిలేకుండా తమంత తామే పరిపాలన నిర్వహించుకుంటున్న గ్రామం ఒకటుంది. దాని పేరు మలానా. ఆ గ్రామ విశేషాలు మీరూ చదవండి!

హిమాచల్‌ప్రదేశ్‌లోని కులు జిల్లాలో పార్వతీ లోయను ఆనుకుని ఉంది మలానా గ్రామం. దేశం అంతా ఒకదారిలో నడుస్తుంటే మలానా మాత్రం మరోదారిలో నడుస్తోంది. ప్రపంచంలోని తొలి ప్రజాస్వామిక గ్రామాల్లో ఇదొకటి. ఈగ్రామం గురించి ఎన్నోకథలు ప్రాచుర్యంలో ఉన్నాయి. జమదగ్ని మహర్షి తపస్సు కారణంగా శివుడి వరప్రభావం వల్ల ఈ గ్రామం పుట్టిందని అంటారు. అలాగే అలెగ్జాండర్ సైనికుల వారసులు ఈ గ్రామాన్ని నిర్మించారనేది మరో కథనం. అయితే కొందరు దీన్ని అంగీకరించరు.

ఈ గ్రామ పాలన, సామాజిక నిర్మాణం ప్రజాస్వామికంగా ఉంటాయి. గ్రామ కౌన్సిల్‌లో ఉండే 11 మంది సభ్యులు గ్రామపాలనా వ్యవహారాలు చూస్తారు. ఈసభ్యులను తమ దేవత అయిన జంబ్లూకి ప్రతిరూపంగా భావిస్తారు ఆ ఊరివారు. అలాగే మనకు హైకోర్టు, సుప్రీం కోర్టు ఉన్నట్లే వారికి కూడా దిగువ న్యాయస్థానం, ఎగువ న్యాయస్థానం ఉంటాయి. దిగువ కోర్టులో న్యాయం జరగలేదంటే ఎగువ కోర్టుకు వెళ్ళవచ్చు.

ప్రభుత్వ పథకాలపై చాలా గ్రామాలు ఆధారపడి ఉంటాయి కదా, కానీ మలానా గ్రామానికి ప్రభుత్వంతో ఎటువంటి సంబంధం ఉండదు. ప్రభుత్వం ఇచ్చే పథకాలు అక్కడివారికి అవసరం లేదు. పోనీ ప్రభుత్వ ప్రతినిధులు వచ్చి ఏమైనా చెప్పినా వారు వినరు, వినిపించుకోరు. తమకు నచ్చిన రీతిలోనే వాళ్ల జీవిస్తారు. ఆ ఊళ్లో ఒకే ఒక ప్రభుత్వ పాఠశాల ఉంది. ఆ పాఠశాల గురించితప్ప అంతకుమించి ప్రభుత్వం ఇంకే విషయంలో జోక్యం చేసుకున్నా వాళ్లకు నచ్చదు.

## ప్రత్యేకమైన కట్టుబాట్లు

కేవలం అదిమాత్రమే కాదు. ఇంకా చాలా కట్టుబాట్లు ఈ గ్రామంలో ఉన్నాయి. తమ గ్రామానికి చెందని వ్యక్తులు చేసే వంటకాలను వీరు తినరు. తమ గ్రామానికి చెందనివారిని పెళ్ళి చేసుకోరు. పిల్లలకు పేర్లు కూడా ప్రత్యేక పద్ధతిలో పెడతారు. పుట్టిన రోజును బట్టి వారి పేర్లు ఉంటాయి. ఆదివారం పుడితే ఆహ్తా, సోమవారం అయితే సౌనరు, మంగళవారం అయితే మంగల్ ఇలా వారి పేర్లు ఉంటాయి. దాంతో ఒకేపేరుగలవాళ్ల చాలామంది ఉంటారు. వీరి భాష కనషీ. ఈభాషలో ఎక్కువ సంస్కృతపదాలు ఉంటాయి. టిబెటన్ల భాషల ప్రభావం కూడా వీరిపైన ఉంటుంది. ఆ గ్రామస్థులు తప్ప వేరెవరూ ఈభాషను అర్థం చేసుకోలేరు.

ఈ మలానా లోయలో మహిమాన్విత ఔషధాలు ఉంటాయని అందరూ అంటుంటారు. ఓసారి అనారోగ్యానికి గురైన అక్బర్ చక్రవర్తి ఈ గ్రామాన్ని వెదుక్కుంటూ వచ్చి ఇక్కడి ఔషధాలు వాడి వ్యాధి నయం చేసుకున్నాడట. అవన్నీ నిజమో కాదో కూడా తెలుసుకునే అవకాశం లేదు. ఎందుకంటే అక్కడివారు చెప్పరు. సందర్శకులు ఈ గ్రామాన్ని చూడ్డానికి అనుమతి ఉంది. అయినప్పటికీ అక్కడుండే చెట్ల మీద ఎవ్వరినీ చేయి వేయనివ్వరు. ఇలా ప్రతి విషయంలోనూ స్వతంత్రంగా ఉండడం, సొంతవిధానాలు పాటించడం చూసి ఈ గ్రామాన్ని 'ద రిపబ్లిక్ ఆఫ్ మలానా' అని కూడా కొందరు పిలుస్తారు.

నవ్య

పుస్తకం హస్తభూషణం అంటారు కదా! కానీ పుస్తకం నేత్ర భూషణం అని కూడా అంటున్నారు ఇప్పుడు. అవునండీ ఈ పుస్తకం నేత్ర భూషణమే. ఇంకా అర్థం కాలేదా? అదే ఫేస్‌బుక్. పుస్తకం కాని పుస్తకం. దానిపేరు 'ముఖపుస్తకం'. ఇది వచ్చాక అపరిచితులు కూడా ఒకర్నొకరు 'లైక్' చేసుకోవడం మొదలెట్టారు. మంచితో పాటు కొన్ని ఇబ్బందులు కూడా ఎదురయ్యాయి. చెట్టుమీదకాయను, సముద్రంలో ఉప్పునూ...అన్న చందంగా ఎక్కడెక్కడివారినో ఏకంచేస్తున్న మార్క్ జుకర్‌బర్గ్ దీని వ్యవస్థాపకుడు. 2004 ఫిబ్రవరి 4వ తేదీన ఫేస్‌బుక్ ప్రారంభిం చారాయన. ఆరోజే ఫేస్‌బుక్ డే! ఈ సందర్భంగా 'ముఖపుస్తకం' గురించి కొన్ని విషయాలు మీకోసం!!

ఫిబ్రవరి 4న 'ఫేస్‌బుక్ డే' సందర్భంగా...




# ముఖపుస్తకం మజిలీ

ఈనాడు ప్రతినోటా వినిపిస్తున్న మాట ఎఫ్‌బీ. ఎవరి గురించైనా తెలుసుకోవాలంటే చాలు ఫేస్ బుక్ ప్రొఫైల్ వెతుకుతున్నారు. పెళ్ళి సంబంధాల విషయంలోనూ ఇదే పద్ధతి. కంప్యూటర్లోనే కాదు, అరచేతిలో కూడా ఇంటర్నెట్ అందుబాటులో ఉండడంతో ఎఫ్‌బీ వాడకం చాలా వేగంగా పెరుగుతూ, వ్యాపిస్తూ సమాజంలో మమేకమైపోయింది. కత్తికి రెండు వైపులా పదును అన్నట్టుగా ఫేస్‌బుక్ కూడా ఒకవైపు ప్రేమ, స్నేహం, సహాయం పంచుతూ, మరోవైపు ద్వేషం, కోపం, గొడవలు... ఇలా రెంటినీ పంచుతోంది.

ఫేస్‌బుక్‌వల్ల చాలామంది ఒంటరితనం దూరం చేసుకుంటుంటే మరికొంతమంది జీవితాలు నాశనం చేసుకుంటున్నారనేది పరిశీలకుల అభిప్రాయం.

### అకౌంట్‌తో భారీ లాభం!

ఉదయం లేచినప్పటినుంచి రాత్రి నిద్రపోయే వరకు ప్రతిఒక్కరూ ఫేస్‌బుక్‌లోనే గడుపుతున్నారు. చేసే పనులు భాగస్వాములకు కూడా చెప్పడంలేదు గానీ ఫేస్‌బుక్‌లో మాత్రం వెంటనే పోస్ట్ చేస్తున్నారు. వ్యక్తుల జీవితాల్లోకి ఫేస్‌బుక్ అంతగా చొచ్చుకొచ్చేసింది. నిజం చెప్పాలంటే ఫేస్‌బుక్ లేనిదే ఎవరికీ రోజు గడవడంలేదు. ప్రస్తుతం సోషల్ మీడియాలో ఫేస్‌బుక్‌దే ఆధిపత్యం. ప్రపంచ వ్యాప్తంగా కోట్లాదిమంది జీవితాల్లో ప్రస్తుత ప్రధానాంశంగా మారిపోయింది ఎఫ్‌బీ.

మనం ఎంతగా ఫేస్‌బుక్ వాడుతున్నామో అంతకుమించిన ఆదాయం మన ద్వారా ఫేస్‌బుక్ వ్యవస్థాపకుడు మార్క్‌జుకర్‌బర్గ్‌కు లభిస్తోంది. మన ఫేస్‌బుక్ అకౌంట్లే ఆ సంస్థకు పెట్టుబడి. ప్రపంచంలో ఒక్కో ఖాతాదారుడిపై సగటున 1056 రూపాయలు అంటే 16 డాలర్లు సంపాదిస్తుంది ఫేస్‌బుక్. ఫేస్‌బుక్ ఒక్కోఖాతాపై ప్రపంచ వ్యాప్తంగా సగటున చూస్తే 16 డాలర్లు ఆర్జిస్తున్నా అత్యధికంగా కెనడా - అమెరికాల్లోని ఖాతాదారుల నుండే భారీ ఆదాయం గడిస్తోంది ఫేస్‌బుక్. ఐరోపా దేశాలు, ఆసియా పసిఫిక్ సహా మిగతా ప్రపంచ దేశాలు తర్వాతి స్థానాల్లో ఉన్నాయి.

### అన్నీ అబద్ధాలే!

ఒక సర్వే ప్రకారం ముఖపుస్తకం వాడేవారిలో 80 శాతంమంది ఏదో ఒక విషయంలో అబద్ధం చెబుతుంటారనీ, కేవలం ఇరవై శాతం మంది మాత్రమే తమగురించి సోషల్ నెట్‌వర్క్ సైట్స్‌లో నిజాలు చెబుతున్నారనీ వెల్లడైంది. సుమారు రెండు వేల మందికి పైగా బ్రిటీషర్లపై జరిగిన పరిశోధనలో ఇలాంటి ఆసక్తికర అంశాలు వెలుగు చూశాయి.

### స్కామర్స్‌తో జాగ్రత్త!

సెకన్లు సమయం చాలు సమాచారం మొత్తం ప్రపంచవ్యాప్తం కావడానికి! మీటనొక్కితే చాలు సమాచారం ఒకచోట నుంచి ఒక చోటకి పాకిపోతుంది. ఇది సోషల్ మీడియా మాయ. అయితే మంచి విషయం ఒకచోట నుంచి మరొక చోటుకు ఇలా వేగంగా వెళితే పర్వాలేదు. కానీ అదే చెడు విస్తరిస్తే చాలా ప్రమాదం. అయితే సోషల్ మీడియాలో ఇప్పుడు ఎక్కువగా అదే జరుగుతోందట. మంచికన్నా చెడే ఎక్కువ ప్రచారం అవుతోందని భారత్‌లో ఈ సమస్య ఎక్కువగానే ఉందని సర్వేలో తేలింది. ప్రపంచ వ్యాప్తంగా సోషల్ మీడియా ద్వారా విస్తరిస్తున్న ప్రతి ఆరు స్కాముల్లో భారత్‌కు పాత్ర ఉంటుందట. సిమెంటిక్ ఇంటర్నెట్ సెక్యూరిటీ సంస్థ సర్వే ప్రకారం ప్రపంచవ్యాప్తంగా సోషల్ మీడియాను ఇలా చెడుకు ఉపయోగించుకుంటున్న దేశాల్లో భారత్ రెండో స్థానంలో ఉంది. ఇక ఈవిషయంలో ఆసియా మొదటిస్థానంలో ఉంది. చాలామంది సోషల్ సర్కిల్స్‌లో ఫేక్ లింక్స్, ప్రమాదకరమైన సమాచారాన్ని పోస్ట్‌చేసి విస్తరించాలనేది ఈ స్కామర్స్ వ్యూహం. ఇలా చేయడంవల్ల ఆ లింక్స్‌ను యూజర్లు ఓపెన్ చేస్తారు. తద్వారా వారి అకౌంట్లు హ్యాక్‌చేసి స్కామర్లు తమకు కావాల్సిన సమాచారం రాబట్టుకుంటున్నారు. చైనా, అమెరికా తర్వాత స్కామర్ల నుంచి ఎక్కువ ప్రమాదం ఎదుర్కొంటున్న దేశం భారత్ అని ఈ సర్వేలో వెల్లడైంది.




## ప్రొఫైల్‌తో ఇంటర్వ్యూ

ఎన్నో ఉద్యోగాలకు అప్లై చేసి, సెలక్ట్ కాలేక, ఇంటర్వ్యూ వరకూ కూడా వెళ్ళలేని నిరుద్యోగులు చాలామందే ఉన్నారు. అయితే మీ ఫేస్‌బుక్ ప్రొఫైల్ పిక్చర్‌ను ఆకర్షణీయంగా మారుస్తూ ఉంటే ఇంటర్వ్యూకి పిలుస్తారట. ఏంటిది? ప్రొఫైల్ పిక్చర్‌కి జాబ్‌కి ఏంటి సంబంధం అను కుంటున్నారా?

ఫేస్‌బుక్ ప్రొఫైల్‌ను బట్టి 40 శాతం వరకూ ఇంటర్వ్యూకి పిలిచే అవకాశాలు ఉన్నాయని బెల్జియంలోని ఘెంట్ యూనివర్సిటీ పరిశోధన వెల్లడించింది. రిక్రూటర్లు సీవీలో ఇచ్చే తక్కువపాటి సమాచారంతో నిర్ణయం తీసుకోలేరనీ, అందుకే వారు అభ్యర్థుల ఎఫ్‌బీ ప్రొఫైల్‌ను, ఫోటోలను, వారి వ్యక్తిత్వాన్ని అంచనా వేసి ఇంటర్వ్యూకి పిలవాలో వద్దో నిర్ణయం తీసుకుంటారని సర్వేలో తేలింది. ఎఫ్‌బీ అకౌంట్‌లో సీవీలో చేర్చుకున్న పేరునుబట్టి రిక్రూటర్లు సెర్చ్ చేస్తుంటారని అధ్యయనం తెలిపింది.

ఎక్కువమంది వినియోగదారులు తమకు బాగా నచ్చినవాటినే షేర్ చేస్తున్నట్లు తెలియగా ఆడవారితో పోల్చిచూసినపుడు మగవారు తరచు ఎక్కువ అబద్ధాలాడుతున్నట్లు ఆ సర్వే ప్రతినిధులు వెల్లడించారు.

### ఫేస్‌బుక్‌కే దాసోహం

మనదేశంలో సోషల్ మీడియా ఫాలోవర్స్ అంతా ఫేస్‌బుక్‌కే దాసోహం అంటున్నారు. టీఎన్ ఎస్ రీసెర్చ్ కన్సల్టెన్సీ నివేదికలో ఈవిషయం వెల్లడైంది. ప్రతిరోజు దేశవ్యాప్తంగా 51 శాతంమంది యూజర్లు ఫేస్‌బుక్ ఉపయోగిస్తున్నారని ఆ నివేదిక పేర్కొంది. సోషల్ నెట్‌వర్క్ మార్కెట్ అంతా ఫేస్‌బుక్ చుట్టూ తిరుగుతోందని తెలిసింది. అంతే కాదండోయ్ ఇండియాలో మాత్రమేకాదు థాయిలాండ్, తైవాన్, హాంకాంగ్ లాంటి ఆసియా పసిఫిక్ దేశాల్లోనూ ఇదే పరిస్థితి నెలకొంది. థాయ్‌లాండ్‌లో 78 శాతం, తైవాన్‌లో 75 శాతం, హాంకాంగ్‌లో 72 శాతం మంది ఫేస్‌బుక్‌ను లైక్ చేస్తున్నారు. అగ్రరాజ్యమైన అమెరికా ఫేస్‌బుక్ వినియోగంలోనూ టాప్‌వన్‌లోనే ఉంది.

### ఫేస్‌బుక్ రోగానికి కొత్త చికిత్స

సోషల్ మీడియా ప్రపంచాన్ని శాసిస్తోంది. మూడోక్లాస్ పిల్లవాడికి కూడా ఫేస్‌బుక్ వాట్సాప్‌ల గురించి తెలిసిపోయింది. అవి లేనిదే ఐదు నిమిషాలు కూడా గడవని పరిస్థితి వచ్చేసింది. అయితే ఇప్పుడు ఈ ఫేస్‌బుక్ సరదాస్థాయినుంచి అందరికీ తీవ్ర వ్యసనంగా మారిపోయిన సంగతి తెలిసిందే. ఫోటో లేదా పోస్ట్ పెట్టడం, దానికి వచ్చే లైకులు, కామెంట్లు, షేరింగ్‌లు చూసుకుని మురిసిపోవడం ప్రస్తుతం చాలామందికి మామూలైపోయింది. అయితే ఈ మోజులోపడి చాలా మంది గంటలకు గంటలు లైవ్‌వేస్ట్ చేసేస్తున్నారు. ఇండియాలో ఇలా ఫేస్‌బుక్ వ్యసనానికి బానిసలైన వారి సంఖ్య ఓ మోస్తరుగా ఉంటే పాశ్చాత్య దేశాల్లో ఈ జబ్బు ముదిరిపోయినట్టు పరిశీలకుల అధ్యయనంలో తేలింది. ఇలా ప్రపంచవ్యాప్తంగా ముదిరిపోతున్న ఫేస్‌బుక్ ఫోబియాకోసం ఇప్పుడు సరికొత్త చికిత్స అందుబాటులోకి వచ్చింది. ఎఫ్‌బీ మత్తులో జోగుతున్నవారిని ఆ మత్తునుంచి బైటపడేసేందుకు డీ అడిక్షన్ సెంటర్లు వెలుస్తున్నాయి. సాధారణంగా డీ అడిక్షన్ కేంద్రాలంటే డ్రగ్ అడిక్షన్‌కి గురైనవారిని మార్చే కేంద్రాలు. అయితే ఇవి కేవలం వాటికే కాదు ఫేస్‌బుక్, ట్విట్టర్‌లాంటి సోషల్ మీడియాకు అడిక్ట్ అయినవారిలో కూడా మార్పు తెచ్చేందుకు ఉపయోగపడేలా ఏర్పాటు చేశారు. ఇప్పటికే అల్జీరియాలాంటి దేశాల్లో ఇవి ప్రారంభమయ్యాయి. ముందు ముందు ప్రపంచవ్యాప్తంగా కూడా ఇలాంటి సెంటర్లు ప్రారంభం కావచ్చునని పరిశీలకులు అభిప్రాయపడుతున్నారు.

### అలసట నుంచి బైటపడేందుకే

ఆఫీసు సమయంలో కొందరు ఉద్యోగులు అప్పుడప్పుడు ఎఫ్‌బీ తెరిచి పోస్టులు చూస్తుంటారు. అయితే పని అలసట నుంచి దూరమయ్యేం దుకే చాలామంది మధ్యమధ్యలో అలా ఎఫ్‌బీ చూస్తుం టారట. ఇటీవల నిర్వహించిన ఓ సర్వేలో ఈ విషయం వెల్లడైంది. ప్యూ రీసెర్చ్ సెంటర్ ఈ సర్వే నిర్వహించింది. 2003 మంది అమెరికన్లపై చేపట్టిన సర్వేలో మానసిక అలసట నుంచి బైటపడేందుకే పనిమధ్యలో ఫేస్‌బుక్‌లాంటి వెబ్‌సైట్లు చూస్తున్నట్లు 34 శాతంమంది చెప్పారు. 27 శాతం మంది స్నేహితులు, కుటుంబ సభ్యులతో మాట్లాడేందుకే సోషల్ మీడియా ఖాతాలు తెరుస్తున్నట్లు చెప్పారు. కాగా వృత్తిపరమైన అవసరాల కోసం ఉపయోగిస్తామని 24 శాతం మంది సర్వేలో చెప్పారు. అంతేకాక ఉద్యోగంలో మంచి పనితీరు కనబరిచేందుకు సోషల్ మీడియా ఎంతగానో ఉపయోగపడుతుందని 56 శాతంమంది చెప్పారు. అయితే సొంత అవసరాల కోసమే చాలామంది ఉద్యోగులు ఎఫ్‌బీని వాడుతున్నారని ఆఫీసు యాజమాన్యాలు అభిప్రాయపడుతున్నాయి.




### మరికొన్ని..

1. మార్క్ జుకర్‌బర్గ్ 29 సంవత్సరాలకే యంగెస్ట్ బిలియనీర్ హోదా దక్కించుకున్నాడు. ఫేస్‌బుక్ స్థాపించేనాటికి ఆయన వయసు కేవలం 19 సంవత్సరాలు మాత్రమే.
2. ప్రపంచవ్యాప్తంగా 150 కోట్లకు పైగా యాక్టివ్ ఫేస్‌బుక్ యూజర్లు ఉన్నారు. ఫేస్‌బుక్‌లో ప్రతి 10 నిమిషాలకు లక్ష ఫ్రెండ్ రిక్వెస్ట్‌లు పంపబడుతున్నాయి.
3. ఫేస్‌బుక్ పై ప్రతిరోజు ఆరు లక్షల హ్యాకింగ్ దాడులు జరుగుతున్నాయి. నిమిషానికి 10 లక్షల 80 వేల కొత్త లైకులు పుట్టుకొస్తున్నాయి. ఫేస్‌బుక్ ఒక్కనిమిషం ఆగిపోతే 25,000 డాలర్ల నష్టం వాటిల్లుతుంది.
4. ఫేస్‌బుక్‌లో రోజుకు 35 కోట్ల ఫొటోలు అప్‌లోడ్ అవుతున్నాయి. గేమ్స్ ఆడేందుకు ప్రతినెలా యూజర్లు 90 కోట్ల 27 లక్షల గంటలు సమయం వెచ్చిస్తున్నారు.
5. అతి ఎప్పుడూ అనర్థదాయకమే అన్నట్లు ఫేస్‌బుక్ కారణంగా విడాకులు తీసుకునేవారి సంఖ్య రోజు రోజుకూ పెరుగుతోందని అనేక సర్వేలు వెల్లడించాయి.

- సంతోషలక్ష్మి దహగాం

# స్వార్థచింతన

భమిడి వెంకటేశ్వర్లు

**వారం పదిరోజులుగా రాత్రివేళ చటుక్కున మెలకువ రావడం... ఏవో పిచ్చి కలలు. ఎవరెవరో పలకరించటం.. తీరా ఆలోచిస్తే ఏమీ కనిపించకపోవడం, గుర్తురాకపోవడం. అయితే ఓ పెద్దాయనమాత్రం తప్పనిసరిగా కలలో కనిపించడం గుర్తుండటం, ఏవో మాట్లాడటం జరుగుతోంది. ఎప్పుడూ చూసినగుర్తు లేకపోయినా, పరిచయం, సంబంధం ఉన్నట్లుగా ఉంటోంది. ఆశ్చర్యంగా ఉంది. ఎంతో అభిమానం, ఆప్యాయత, ప్రేమ ఆయన మాటల్లో ఉంది. ఎనభైఏళ్ళు దాటిన వ్యక్తి ఆయన! గంగాధరం ఆలోచనల్లో మిగిలిన విశేషాలు.**

తన తండ్రి ఎనభైమూడేళ్ళ వయసులో రెండేళ్ళక్రితం కాలం చేశాడు. ఒకరోజు ఓ పెద్దాయన గుమ్మం దగ్గర నిలబడి "లోపలకు రావచ్చునా" అని అడిగాడు.

అంతే. గంగాధరం ఆశ్చర్యపోయాడు. కళ్ళు చెమర్చాయి. ఆయనే కలలో కనిపిస్తున్న పెద్దాయన!

గంగాధరం సిగ్గుపడుతూ దగ్గరకెళ్ళి చేయి పట్టుకుని, లోపలకు తీసుకొచ్చి సోఫాలో కూర్చోపెట్టి వంటింట్లోకెళ్లాడు.

"మిమ్మల్ని ఎప్పుడూ చూసినట్టుగా లేదు" అంటూ నీళ్ళగ్లాసు అందించాడు.

పెద్దాయన గంగాధరంకేసి తదేకంగా చూస్తూ అన్నాడు. "మీ నాన్న భూషణం, నేను సహోద్యోగులం. రిటైరయ్యాక వాకింగ్‌కి వచ్చినప్పుడు సఫిల్‌గూడలో పార్కుదగ్గర కలిసేవాళ్ళం. పాపం వెళ్ళిపోయాడు. అప్పట్లో నేను కాలిఫోర్నియాలో ఉన్నాను. వచ్చాక తెలిసిందీవిషయం" అంటూ కళ్ళు తుడుచుకుంటూ తనపేరు వెంకట్రామయ్య అని చెప్పాడు

గంగాధరం ఆలోచిస్తున్నాడు.

"చాలా ఏళ్ళక్రితం నువ్వు మీ నాన్న ఇంటికి వచ్చినప్పుడు యాదృచ్ఛికంగా అక్కడ నిన్ను చూశాను" అంటూ కళ్ళజోడు తుడుచుకోసాగాడు వెంకట్రామయ్య.

"మా ఇల్లు మీకెలా తెలుసు" గంగాధరం అడిగాడు.

ఆయనకు నవ్వొచ్చింది. 'మనసుంటే మార్గముంది. నేను సాధారణంగా ఏదీ మరచిపోను. అప్పట్లో ఓ పెన్షన్‌కేసు విచారణకోసం భూషణం నీపేరు, ఆఫీసు, ఇంటి చిరునామా ఇచ్చాడు. అయితే, ఆ కేసు నువ్వు త్వరగానే పరిష్కరించేసినట్లుగాతెలిసి చాలా సంతోషించాను. నీలాంటి ఉద్యోగులుంటే పెన్షనర్లకు సమస్యలుండవు. ఈ మధ్య నువ్వు తరచు కల్లోకొస్తున్నావు. నీ అడ్రసు వెతికి కలుద్దామని వచ్చాను. ఇప్పుడు నాకు భూషణాన్ని చూస్తున్నంత ఆనందంగా ఉంది" అంటూ మరోసారి కళ్ళు తుడుచుకున్నాడాయన. గంగాధరం ఆశ్చర్యపోతున్నాడు.

"అప్పట్లో నేను, భూషణం ఒకే కాలనీలో ఉండేవాళ్ళం. తరచు మీ నాన్నకోసం మీ ఇంటికొచ్చేవాణ్ణి. తరువాత మరోచోట ఓ ఇల్లు కొనడంతో అక్కడికి మారిపోయాను. మీ నాన్న దగ్గరకొచ్చినప్పుడు చూశాను నిన్ను. తరువాత సాయిబాబా గుళ్లో చూశాను. కాని ఎప్పుడూ మాట్లాడే అవకాశం, అవసరం రాలేదు" అన్నాడాయన వివరంగా.

గంగాధరం మరోసారి ఆశ్చర్యపోయాడు. ఆలోచనలు తరుముతూనే ఉన్నాయి గజిబిజిగా.



పాతికేళ్ళక్రితంనాటి మాట. భూషణం మేడ్చల్‌లో ఓ ఇంటిస్థలం కొన్నాడు. కాని ఆ విషయం గంగాధరానికి తెలియదు. తరువాత ఐదారేళ్ళకు తండ్రిని కలిసేందుకు ఇంటికెళ్ళినప్పుడు నలుగురు వ్యక్తులు ఇంట్లో కనిపించారు. అందులో ఈ పెద్దాయన ఒకడు. వారెవరని తల్లిని అడిగాడు. కానీ ఆవిడ జవాబు దాటేసింది. తండ్రిని అడిగాడు. "నీకు ఆ స్థలం కొనేముందే చెప్పాను. కాని నువ్వు సరిగా వినుండవు. మరిచిపోయుంటావు. పైగా బుకాయిస్తావు" అంటూ క్లుప్తంగా చెప్పాడు భూషణం. ఆ తరువాత స్థలం విషయం ఎప్పుడూ ప్రస్తావనకు రాలేదు. గంగాధరం పెద్ద కొడుకేగానీ ఏ విషయమూ అతనికి తెలియదు. చెప్పరు. తమ్ముడు ముకుందమే ఇంటివ్యవహారాలన్నీ భార్య సలహా ప్రకారం నడుపుతాడని చాలా మందికి తెలిసినా, గంగాధరానికి మాత్రం ఆలస్యంగా తెలిసింది.

అ ఇంట్లో తనస్థానం, విలువ ఏమిటో గంగాధరానికి అర్థమైంది. పైగా భూషణం ఇంటియజమానైనా, ముకుందం దంపతుల దయాదాక్షిణ్యాల మీదే బతకడం విచారకరం.

'నాకు బతకాలని లేదు, ఎందుకొచ్చిన బతుకు' ఎన్నోసార్లు గంగాధరం దగ్గర తల్లి బాధపడేదితప్ప అంతకుమించి ఏమీ చెప్పేదికాదు.

"నా దగ్గరుండు" గంగాధరం అనేవాడు.

"విజయవాడనుంచి వచ్చాక పుష్కరంపాటు మీ ఇంట్లోనే ఉన్నాం కదా. ఇల్లు కట్టాక, ముకుందం పెళ్ళయ్యాకేగా ఇక్కడికి మారాం" అంటూ పొడిగానే చెప్పేది తల్లి.

మూడేళ్ళకే ఆవిడ చనిపోయింది.

అప్పటినుంచీ భూషణం బతుకు అధ్వానంగా మారింది. పగలంతా బైటే కాలక్షేపం. రాత్రి నిద్ర సమయానికి ఇల్లు చేరటం, సందులో మడత మంచంమీద నిద్రించటం దినచర్య అయింది. దోమలు, ఈగలు, ఉక్కబోత, తాటాకు విసనకర్ర తోటే అతడికున్న అనుబంధం. తండ్రితో ముకుందం ఏమీ చెప్పడు, మాట్లాడడు. తరచు డబ్బుమాత్రం అడిగేవాడు. నెలనెలా ఐదువేలు దాకా తీసుకుంటాడని రెండుమూడు సార్లు గంగాధరానికి చెప్పాడు భూషణం.

"మేడ్చల్ స్థలం అమ్మేస్తాను. బేరంచూడు" అని మాటల సందర్భంలో వెంకట్రామయ్యకు చెప్పాడు భూషణం.

"అంత అవసరం ఏమొచ్చింది" అని అడిగేవాడాయన.

"చెప్పుకుంటే సిగ్గుచేటు. నాది కుక్కబతుకు" అని భార్య ఎదురుగానే వెంకట్రామయ్యతో భూషణం చెప్పడం విశేషం.

"ఇప్పుడు స్థలం అమ్మిన డబ్బుతో ఏం చేద్దామని" అడిగాడాయన.

"ముకుందం పెద్దకొడుక్కి కంప్యూటరు, మోటార్‌బైకు కొనాలి. వాడికి ఉపనయనం చేయమంటున్నాడు ముకుందం. వాణ్ణి ఇంజనీరింగ్ చదివించాలిట.." చెప్పాడు భూషణం.

"డబ్బంతా ఈ మనవడికే ఖర్చుచేసేస్తే మిగిలిన కొడుకులకేం మిగులుతుంది" ఎదురు ప్రశ్నించాడు వెంకట్రామయ్య,



**గంగాధరానికి ఈ మధ్య తరచు కలలో ఎవరో తనతో మాట్లాడుతున్నట్టుంటోంది. అతన్ని ఎప్పుడో చూసినట్టే అనిపిస్తుంది. కానీ అతనెవరో తెలియదు. కలలో కనిపించిన పెద్ద మనిషి ఆకస్మికంగా ఒకరోజు తన ఇంటి తలుపు తట్టడంతో ఆశ్చర్య పోయాడు గంగాధరం. తరచు నువ్వు కలలోకి వస్తున్నావ్? చెప్పాడు ఆ పెద్దమనిషి. ఆ మాటకు మరింత ఆశ్చర్యపోయాడతను. ఎవరా పెద్ద మనిషి? ఏమిటి వాళ్ళబంధం? వాళ్ళని ఆ బంధంఎక్కడివరకు తీసుకెళ్ళింది?**

"అందుకే స్థలం విషయం గోప్యంగా ఉంచాను".

"మరి గంగాధరానికి కూడా చెప్పవా"

"నిజానికి వాడికేవిషయాలూ చెప్పలేదు. తెలియదు. చెప్పివుంటే, ముకుందం వాడి భార్య ఈపాటికి నన్ను పాడి ఎక్కించేసేవాళ్ళు" భూషణం సిగ్గుపడుతూ చెప్పాడు.

"ఇది అన్యాయం, అధర్మం, తప్పు కదా"

భూషణం జవాబు నోట్లోనే ఉండిపోయింది.

"ఇది మంచి పద్ధతికాదు" వెంకట్రామయ్య సున్నితంగానే మందలించాడు.

"ముకుందం జీతం దాచుకుంటాడు. నా దగ్గర డబ్బుతో ఖర్చులు చేస్తాడు. చివరికి ఇంటి అద్దె కూడా తీసుకుంటాడు." నొచ్చుకుంటూనే చెప్పేవాడు భూషణం.

అప్పుడు ఆ స్థలం వెంకట్రామయ్య కొన్నాడు. కేవలం స్నేహితుడికి సాయపడాలన్న ఉద్దేశంతో. అయితే విషయం తెలిశాక, మిగిలిన పనులు చకచకా చక్కబెట్టుకున్నాడు ముకుందం.

కాలంతోపాటే నడిచాడు భూషణం. ఆ తరువాత కాలంచేశాడు. తండ్రి ఆస్తిని, డబ్బుని ముకుందం తన తెలివితేటలతో సొంతం చేసుకున్నాడు. కొన్ని విషయాలు, నిజాలు ఆలస్యంగా వెలుగుచూస్తాయని మరోసారి అనిపించింది గంగాధరానికి.

●●●

కాలానికి పరుగేకానీ నడక ఉండదు.

ఒకరోజు గంగాధరం ఇంటికొచ్చాడు ముకుందం. డబ్బు సర్దుబాటు చేయమని అడిగాడు. కొడుకుని చదువుకోసం అమెరికా పంపిస్తున్నట్టు చెప్పాడు.

తనని ఎ.టి.ఎం. కార్డుగా ఉపయోగించుకుంటాడు ముకుందం. రెండేళ్ళుగా ఐదారుసార్లు డబ్బు తీసుకెళ్ళాడు. అడగ్గా అడగ్గా తిరిగి ఇచ్చాడు.

"బాగా ఆలోచించావా! నీ దగ్గర ఏమాత్రం డబ్బుంది? ఇది వేలతో అయ్యే వ్యవహారం కాదు కదా. పైగా ఇరవైలక్షల దాకా ఖర్చవుతుందంటున్నావు. బ్యాంకులోను వస్తుంది కదా. స్కాలర్ షిప్పు దొరుకుతుందేమో" అన్నాడు గంగాధరం.

"వాడికి చదువొస్తోంది. ఎలాగైనా చదివించాలి కదా. ఏర్పాట్లన్నీ పూర్తయ్యాయి. చిల్లర ఖర్చులకు ఇప్పుడు ఓ పాతికవేలు కావాలి" అన్నాడు ముకుందం.

గంగాధరం ఆశ్చర్యపోయాడు. "ఇండియాలోనే ఎన్నో కాలేజీలున్నాయి. దానికితోడు ఉద్యోగ అవకాశాలు మెరుగయ్యాయి. పెద్దాణ్ణి ఢిల్లీలో ఎం.టెక్ చదివించావు. ఇప్పుడు వీణ్ణి అమెరికా పంపుతుంటే పెద్దాడు ఏం అనుకోడా! పైగా చిన్నాడు బైటచదువులకు ఇష్టపడడని, దగ్గర్లో కాలేజీలోనే ఇంజనీరింగ్ చదివించావు".

గంగాధరం మాటలకు అడ్డుపడ్డాడు ముకుందం. "అమెరికా చదువుకి ఖర్చుఅయినా తట్టుకోవచ్చు. వారానికి మూడు నాలుగురోజులు పార్ట్‌టైం పనులుచేసి సంపాదించవచ్చు. పెద్దాడికి ఉద్యోగం వచ్చింది. తమ్ముడికి సాయం చేస్తానన్నాడు. ఏదోవిధంగా నేనూ పంపించాలి కదా" ధీమాగా చెప్పాడు.

ముకుందం ముఖంలో భయం, ఆందోళన, విచారం, దిగులు ఏ మాత్రం కనిపించటం లేదు. చాలా ధైర్యంగా ఉన్నాడు. "అవసరమైతే ఇల్లు తాకట్టుపెట్టి అప్పు తీసుకుంటాను" అన్నాడు.

"చదువు పూర్తయ్యేవరకూ మీవాడు రాలేడు. అక్కడే ఉద్యోగం వస్తే అసలురాడు. తరువాత పెళ్ళి! ఈలోగా ఏ అమ్మాయికో గేలం వేస్తే మిమ్మల్ని ఎదిరించైనా పెళ్ళి చేసుకుంటాడు. అమెరికా డాలర్లు, వాతావరణం, సదుపాయాలు మరిగినవాడు అమ్మానాన్నల్ని లెక్క చేస్తాడా? మన బంధువుల్లోనే అయిదారు కేసుల విషయం నీకూ తెలుసు".

"నా కొడుకులు నిప్పులాంటివాళ్ళు. చిల్లర వేషాలు వేయరు. అమ్మాయిలజోలికెళ్ళే రకం కాదు. మేం ఎంత చెప్తే అంత. మా మాటకు విలువ, గౌరవం ఇస్తారు".

"మంచిదే! ఇది హైటెక్ కాలం. పైగా గ్లోబల్ వాతావరణం. గాలి ఎటు మళ్ళుతుందో, ఎక్కడో అమెరికాలో ఉన్నవాళ్లు ఏం చేస్తున్నారో ఎవరు పట్టించుకుంటారు? ఒకవేళ తెలిశాక చేసేదేమీ లేదు" అన్నాడు గంగాధరం.

ముకుందం ఏదో అనబోయాడు.

"మీ వాడికి ఉపనయనం చేయమంటేనే "డబ్బుండద్దా" అన్నావు. యాభైవేలు అవుతాయన్నావు గుర్తుందా. మరిప్పుడు ఇన్ని లక్షలు ఎక్కణ్ణుంచి వచ్చాయి" గుర్తుకురాగానే అడిగాడు గంగాధరం.

ముకుందానికి కోపం వచ్చింది. కోపాన్ని ప్రదర్శిస్తే లాభం ఉండదని తెలిసిన మహా మేధావి. లౌక్యుడూను.

"ఓ ఇరవై వేలు సర్దితే చాలు" అన్నాడు ముకుందం.

ఎప్పటికీ మరిచిపోనివ్వని మరో అనుభవం గుర్తుకొచ్చింది గంగాధరానికి. అప్పట్లో తన రెండో కూతురికి ఎం.సి.ఎ కామన్ పరీక్షల్లో మంచి ర్యాంకు వచ్చింది. ఫీజు కేవలం పన్నెండువేలే! తనదగ్గర డబ్బులేదు. ఆరునెలల క్రితమే పెద్ద కూతురు పెళ్ళిచేశాడు. అప్పుచేస్తే నిద్రపట్టదు. అందుకే తండ్రిని అడుగుదామని వెళ్ళాడు. "వీడికి డబ్బు ఆశ ఎక్కువ" అని తల్లి దగ్గర అంటున్న ముకుందం మాటలు చెవినపడి గంగాధరం బాధ పడ్డాడు.

ఫలితంగా కూతురు ఎం.సి.ఎ చదవలేకపోయింది. సెంట్రల్ యూనివర్సిటీలో ఎం.ఎస్సీ చదివింది. ఆమె ఫ్రెండ్సు ఎం.సి.ఎ చదివి విదేశాల్లో ఉద్యోగాలు చేస్తుంటే, ఆ విషయం తెలిసిన గంగాధరం సిగ్గుతో చచ్చిపోయేవాడు. తన చేతకానితనమో, బలహీనతో కూతురు జీవితాన్ని మరో దారిలోకి తీసుకుపోయింది. "అప్పుచేసి చదివించాల్సిందేమో" అని ఇప్పటికీ బాధపడుతుంటాడు గంగాధరం.

ఇప్పుడు లక్షలుపెట్టి కొడుకుని అమెరికా పంపుతున్నాడు లక్షణంగా. పైగా అప్పుచేస్తాడట. ఎంత ధైర్యం!

గంగాధరాన్ని లోనికి పిలిచింది భార్య. "మీకు డబ్బు ఇవ్వాలని ఉంటే ఇచ్చి పంపండి. అనవసరపు సొల్లుకబుర్లు దేనికీ. మీ నాన్నగారి శవాన్ని ఆసుపత్రి నుంచి తీసుకొచ్చేందుకు డబ్బులేదన్నాడు. తండ్రి ఉంగరాలు దాచేసుకుని, అడిగితే 'ఏమో' అన్నాడు. తీర్థయాత్రలు, విహార యాత్రలు ఎలా చేస్తున్నాట్ట? వాడి జీవితం వడ్డించిన విస్తరి. మీ అన్నదమ్ముల్ని మోసంచేసి, తండ్రి చేత ఇల్లు, ఆస్తి రాయించేసుకున్న ఘనుడు. మరచిపోయారా! వాడు డబ్బు తిరిగి



# మరొకటి చేస్తుందట!

**మొ**న్నటి వరకూ 'ఖైదీ నంబర్ 150'తో హడావుడి హడావుడిగా గడిపేసింది. ఇప్పుడు ఆ సినిమా విడుదల కూడా అయిపోయింది. చేతిలో ఒక్కటంటే ఒక్క సినిమానే ఉంది. అది కూడా అయిపోతే ఇక తెర మీద కనిపించే అదృష్టం కాజల్‌కు ఉండదు. దీన్ని దృష్టిలోపెట్టుకుని ఐటెం సాంగ్ చేయడానికి రెడీ అయిపోతోంది కాజల్. ఇప్పటి వరకూ కాజల్ కెరీర్‌లో ఒకే ఒక్క ఐటెం సాంగ్ చేసింది. దానికి మంచి రెస్పాన్స్ వచ్చింది. దాంతో ఇకమీద స్టార్ హీరోల సినిమాల్లో ఐటెంసాంగ్ చేస్తానంటూ బాహాటంగా చెబుతోంది. కాకపోతే రెమ్యునరేషన్ విషయంలోనే చుక్కలు చూపిస్తోంది. దీనికి తోడు మరో రెండు మూడు కండీషన్లు కూడా ఉన్నాయి. ఇవన్నీ భరించి కాజల్ చేత ఐటెంసాంగ్ చేయించే నిర్మాతలే ఎవరు? అన్నది తేలడం లేదు. ఏదో విధంగా తెరమీద కనిపించాలనుకుంటే ఇలాంటి కండీషన్లు సరికావు అంటున్నారు సినీ జనాలు. మరో పక్క రాయ్‌లక్ష్మీ, హంసనందినిలు తక్కువ రెమ్యునరేషన్‌కి ఎలా కావాలంటే అలా అందాల ప్రదర్శన చేస్తుంటే కోట్లు ఇచ్చి కాజల్‌కి అవకాశం ఇచ్చేది ఎవరు? అన్నదే అందరిలోనూ తలెత్తుతోంది. ఈ విషయంలో కాజల్ కాస్త పట్టువిడుపులు ప్రదర్శిస్తే బాగుంటుందని కొందరు ఆమెకు సలహా కూడా ఇస్తున్నారట!



ఇస్తాడన్న నమ్మకం నాకులేదు. ఇస్తే మంచిది. లేకపోతే మరీ మంచిది. ఇదిగో డబ్బు. వాణ్ణి అంత సేపు కూర్చోపెట్టడం మీ తెలివితక్కువతనం" అంది.

గంగాధరం డబ్బు ఇవ్వగానే తుర్రుమన్నాడు ముకుందం.

●●●

ఆలోచనల నుంచి తేరుకున్నాడు గంగాధరం. తనని వెతుక్కుంటూ రావడంలో వెంకట్రామయ్య ఆంతర్యం ఏమిటో అర్థం కాలేదు.

"ముకుందానికి మీరు డబ్బు ఇచ్చారా? ఇస్తారని నాకు తెలుసు. నా దగ్గరకీ వచ్చాడు. పదివేలు ఇచ్చాను. ఇలా చాలామంది దగ్గర లక్షరూపాయలు సంపాదించాడు. మీకు తెలియని మరో విషయం కొడుకుని దత్తతకు ఇచ్చేశాడని! దత్తత తల్లి వాణ్ణి అమెరికా పంపించింది. మన దగ్గర పొందిన డబ్బు వడ్డీలకు తిప్పుతూ సుఖిస్తున్నాడు" అన్నాడాయన.

గంగాధరం కంగుతిన్నాడు. ముకుందం సంగతి తెలుసు. తెలిసినా కేవలం ఉపకార బుద్ధితో డబ్బు సహాయం చేశాడు. తన కారణంగానే తన కూతురి చదువు ఆగిపోయింది, ఆ దుస్థితి ముకుందానికి రాకూడదనుకున్నాడు. తన మంచితనం మరోసారి మోసపోయింది. దిక్కుమాలిన మనసు, ఎందుకిలా తన చేత ఇటువంటి పనులు చేయిస్తోందో?

"మీకు తెలియని మరోవిషయం ఉంది" చటుక్కున అన్నాడు వెంకట్రామయ్య.

ఆశ్చర్యంతో "ఏమిటి" అని అడిగాడు.

"కొడుక్కి ఉపనయనం చేసేసి అమెరికా పంపేశాడు".

మరోసారి కంగుతిన్నాడు గంగాధరం.

"నువ్వు మా ఇంటికి రావాలి. నేనెంతకాలం ఉంటానో తెలియదు. నా నంబరు ఇదిగో" అంటూ చిరునామా రాసిన కాగితం ఇచ్చాడాయన. పది నిమిషాలకు వెళ్ళిపోయాడు ఆయన.

ఒకరోజు వెంకట్రామయ్య ఇంటికి బయలుదేరాడు గంగాధరం. వాళ్ళింటికెళ్ళే దారిలోనే తండ్రి ఇల్లు కనిపించింది. లోపలకు వెళదామనిపించింది. కానీ మనసు నిరాకరించింది.

వెంకట్రామయ్య మంచంమీద పడుకుని సీలింగ్‌ఫ్యానుకేసి చూస్తున్నాడు. దగ్గరకు వెళ్ళాడు గంగాధరం. "ఎలా ఉన్నారు?" పలకరించాడు.

"చూస్తున్నావుగా" అంటూ కళ్ళు అద్దుకున్నాడు.

"ముకుందం ఇంతదారుణంగా ప్రవర్తిస్తాడనుకోలేదు. భూషణం మొదట్లో చెప్పినప్పుడు అంతగా నమ్మలేదు. ఆవేశంలోనో కోపంలోనో అన్నాడనుకున్నాను. తనచేత పెళ్ళాం ఎటువంటి పనులు చేయిస్తోందో తెలిసింది. ఇటువంటి క్రిమినల్ ఆలోచనలు ఎలా కలుగుతున్నాయో! డబ్బుకోసం ఏదైనా చేస్తారు. ఆ జాబితాలోకి ముకుందం చేరిపోయాడు" వెంకట్రామయ్య చెప్పాడు.

ఇందులో కొత్తదనం ఏంలేదని గంగాధరానికి తెలియకపోతే కదా!

"నాకు ఆరుగురు కొడుకులు. ఎవరూ నా మాట వినరు. నాతో మాట్లాడరు. వాళ్ళకి నేను అవసరంలేదు. నాడబ్బు అక్కర్లేదు. వాళ్ళే విదేశాల్లో స్థిరపడిపోయారు. చివరికి తల్లిని సాగనంపేందుక్కూడా రాలేదు. ఫోను ద్వారానే విషయం తెలుసుకుని ఊరుకున్నారు. నాకు తప్పదు కదా" అంటూ భోరున విలపించాడు.

అక్కడే ఓ పనిపిల్ల ఆయనకు సాయంగా ఉంది. "వంటమనిషి ఉదయం, సాయంత్రం వండి వెళుతుంది. టీపాయిమీద కొన్ని ఫోనునంబర్లతో చిరునామాలున్నాయి. ఫోనుచేస్తే డాక్టరు ఇంటికి వస్తాడు. మందులు తెచ్చేందుకు, ఇతర పనులకు పనిపిల్ల ఉంది. ఈ వయసులో భార్య అవసరం ఎంతో ఉంది. కాని దేవుడు ఆమెను త్వరగా తీసుకుపోయాడు...."

వెంకట్రామయ్య దీనంగా చెబుతున్నాడు.

గంగాధరానికి దుఃఖం ఆగటంలేదు.

"మీ నాన్నమీద కోపం, ద్వేషం ఎప్పుడూ కలగలేదా నీకు?" చటుక్కున అడిగాడు వెంకట్రామయ్య.

గంగాధరానికి నవ్వొచ్చింది.

"ఏమైంది" అడిగాడు.

"దేనికైనా ప్రాప్తం, యోగం ఉండాలండీ. నాకు ఇవ్వాలని నాన్నకు అనిపించలేదేమో. అందుకే తన ఆస్తి, డబ్బు కావలసిన వాళ్ళకు ఇచ్చాడు. ఆయన మనసుతో ఇవ్వాలి కాని అడిగించుకుని పొందడం ఏమిటి? కానీ మా నాన్న డబ్బునుమించిన ఆస్తి నాకు ప్రసాదించాడు. దానికి విలువ కట్టలేను.."

ఈసారి వెంకట్రామయ్య ఆశ్చర్యపోయి "ఏమిటది" అన్నాడు.

"అవును. నాన్న నాకు ఈ శరీరాన్నిచ్చాడు. భగవంతుడు మనసుతో ఆలోచించే సంస్కారం ఇచ్చాడేమో, అందుకే మీలాంటివారి దర్శనభాగ్యం కలుగుతోంది. ఉన్నంతలో సాయంచేసే కుడి చేతిని ఇచ్చేదిశగా పెట్టాడు. ఇదంతా నాన్న భిక్షే అని నా నమ్మకం. ఆయన మనసులో నేను లేకపోయినా, నన్ను స్టెప్నీగా ఉపయోగించుకున్నా బాధపడను. నాకు తృప్తి, మనశ్శాంతి ఉంది.

ముకుందం నన్ను మోసం చేసినా వాడికి అది ముల్లులా గుర్తుకొస్తూనే ఉంటుంది. ఏ పనికి ఏ శిక్ష విధించాలో పైవాడి చిట్టాలో చేరుతూనే ఉంటాయి. ఇతరులను మోసంచేసినా, మనస్సాక్షిని మోసం చేయలేంకదా" గంగాధరం చెబుతున్నాడు.

"నువ్వు ధార్మికంగా ఆలోచిస్తున్నావంటే కారణం, టీవీలో ప్రవచనాలు, ఉపన్యాసాలే. దానితోపాటు నీలో ఆధ్యాత్మిక చింతన ఉంది. ఇది గొప్పవిషయం. అందుకే నువ్వు హాయిగా, ఆనందంగా ఉంటున్నావు" వెంకట్రామయ్య పనిపిల్ల వైపు చూసి ఏదో కళ్ళతో చెప్పాడు.

రెండు నిముషాల్లో తను సూట్‌కేసుతెచ్చి టీపాయిమీద పెట్టింది. "ఇది నీదే, తీసుకో" అన్నాడాయన మూత తీస్తూ.

గంగాధరం కళ్ళు మెరిశాయి ఆశ్చర్యంతో.

"అవును, ఇందులో ఉన్నవి పదిలక్షలు. ఇది పూర్తిగా నీ డబ్బు" అన్నాడు. "నాకేం అర్థం కావటం లేదు" అన్నాడు గంగాధరం.

"మీ నాన్న నాకు మేడ్చల్ స్థలం అమ్మాడు. ఇప్పుడు ఆ స్థలం అమ్మగా పదిలక్షలొచ్చాయి. కాబట్టి భూషణం తరపున నీకిస్తున్న వాటా" అన్నాడు.



"మీ కొడుకులకు ఇవ్వండి" నిశ్చయంగా అన్నాడు.

"పిచ్చివాడా! డాలర్లు సంపాదించేవారికి ఈ రూపాయలు ఎందుకు? ఎటూ వాళ్ళు 'నాకోసం' ఇక్కడికి రారు. అంత అవసరం కూడా లేదు. వస్తారన్న ఆశ, నమ్మకం కూడా లేదు. ఇప్పుడు నువ్వే భగవంతుడిచ్చిన ప్రసాదానివి" అంటూ లేవబోయాడు.

గంగాధరం నోరు పెగలటంలేదు. తండ్రిని ఆయనలో చూస్తున్నాడు.

"ఈ డబ్బు ఎలా ఉపయోగించుకుంటావో నీ ఇష్టం. కాని నా 'అంతిమయాత్ర' నీ చేతుల మీదుగా సాగాలి. విషయం తెలియగానే వచ్చేసేయ్" అంటుండగానే గొంతు ఆగిపోయింది. వెంకట్రామయ్యలో చలనం లేదు. వెంటనే ఫోను ద్వారా భార్యకు, మిగిలిన వారికి సమాచారం చేరవేశాడు గంగాధరం. తదుపరి ఏర్పాట్లూ చేశాడు గంగాధరం.

రోజులు గడుస్తున్నాయి. రాత్రిళ్ళు నిద్రపట్టడంలేదు. ఏవో పీడకలలు. చటుక్కున మెలకువ రావటం, తిరిగి ఎప్పుడో నిద్రపట్టడం. వెంకట్రామయ్య మరణం, ముకుందం పత్తాలేకపోవడం గంగాధరాన్ని తరచు బాధిస్తోంది. తండ్రి కట్టిన ఇంటిమీదకు మళ్ళింది అతని దృష్టి. ఓసారి ముకుందాన్ని కలవాలనిపించింది. ఎంతైనా తమ్ముడు, రక్తసంబంధీకుడు. తెంచుకునే బంధం కాదు. బతికున్నంతవరకూ తప్పదు. "నువ్వు బాకీ చెల్లించక్కర్లేదు. ఫోను చేస్తుండు. లేదా నా ఫోనుకు బదులిస్తుండు. అప్పుడప్పుడైనా ఇంటికిరా" అని చెప్పాలనుకున్నాడు. ఎలాగోలా ఓ రోజు ముకుందం ఇంటికి బయలుదేరాడు గంగాధరం.

తండ్రి ఇంటిముందు నిలబడ్డాడు. కాళ్ళు వణికాయి. లోపల ఎవరో కారు తుడుస్తున్నారు. "ముకుందం కోసం వచ్చాను" అన్నాడు.

ఆ వ్యక్తి ఆశ్చర్యంగా చూశాడు. "అతను ఇక్కడ ఉండటంలేదు. ఈ ఇల్లు అమ్మేశాడు".

ఆ మాటకు కొయ్యబారిపోయాడు గంగాధరం. కిందపడిపోబోతుంటే పట్టుకుని, నెమ్మదిగా లోపలకుతీసుకెళ్ళి మంచినీళ్ళు ఇచ్చాడావ్యక్తి. "అంకుల్, ఎలా ఉంది ఇప్పుడు. డాక్టర్ని పిలవనా" అడిగాడు.

గంగాధరం కొద్దిగా తేరుకున్నాడు. "నాకేమైంది" అడిగాడు. అతను పక్కనే కూర్చుని భుజం రాస్తూ అన్నాడు. "మీరు గంగాధరంగారు కదా. నా పేరు జగదీష్. మీ అమ్మాయి, నేను సత్యసాయిస్కూల్లో చదువుకున్నాం. నేను ఎం.సి.ఎ. చదివి అమెరికా వెళ్ళి పదేళ్ళుండి ఐదేళ్ళ క్రితం ఇండియాకొచ్చాను. చాలాచోట్ల తిరిగి, ప్రస్తుతం ఇక్కడే ఉద్యోగం చేస్తున్నాను. తండ్రిని చూసేందుకు మా ఆవిడ ఊరికెళ్ళింది. తాగండి" అంటూ ఫ్లాస్కులో కాఫీ గ్లాసులో పోసి ఇచ్చాడు జగదీష్.

ఎం.సి.ఎ. అని చెప్పగానే మరోసారి బాధపడ్డాడు గంగాధరం. ఏదో అనబోయాడు. జగదీష్ గ్రహించాడు. "అంకుల్ నాకు తెలుసు. మీరేం ఆలోచిస్తున్నారో. అమెరికా అనగానే డాలర్ల సంపాదనకోసమే! మనసు చంపుకుని బంధుత్వాలు మరచిపోయి, విలువలకు నీళ్ళు వదలడమే! పైకి వంకర కబుర్లు ఎన్ని చెప్పినా మన దేశం ఆచారాలు, పద్ధతులు, సంస్కృతి, సంప్రదాయాలు గొప్పవి. మాకెవరూ అవసరం లేదనుకునేవాళ్ళు, ఎవరినీ పట్టించుకోనివాళ్ళే డాలర్లకోసం ఎగబడతారు. ఎన్నిలక్షలు సంపాదిస్తే ఏం ప్రయోజనం? చివరికి మా అమ్మను కూడా నేను చూడలేకపోయాను. పోయిన అమ్మ బతికొస్తుందా చెప్పండి" అంటూ కళ్ళు తుడుచుకున్నాడు జగదీష్.

"ఈ ఇంటిని ఎప్పుడు కొన్నావు?" అడిగాడు గంగాధరం.

"ఆరునెలల క్రితం ఎనభైలక్షలకు కొన్నాను"

మరోసారి ఆశ్చర్యపోయాడు గంగాధరం.

"ముకుందం ఇప్పుడు ఎక్కడుంటున్నాడో తెలుసా?"

జగదీష్ నవ్వేశాడు. "మీరు కుటుంబంలో పెద్దకొడుకు కాబోలు. అందుకే తేలిగ్గా మోసపోతున్నారు. ముకుందం మహాఘటికుడు. మేధావి. పైకి కనిపించే అమాయకత్వం చాటున ఎన్నో క్రిమినల్ ఆలోచనలున్నాయి. ఏభై లక్షలతో ఇద్దరి కొడుకులకు చెరోప్లాటుకొని మిగిలినవి లక్షణంగా దాచుకున్నాడు" అంటూ ముకుందం అడ్రస్ ఇచ్చాడు జగదీష్.

"వాడినోసారి చూడాలి" అంటూ చిరునామా చదువుకున్నాడు గంగాధరం.

"ముకుందం భార్యతో కలిసి కాలిఫోర్నియా వెళ్ళాడు. మరో మూడునెల్లకు వస్తాడు" చెప్పాడు జగదీష్.

గంగాధరం మరోసారి ఆశ్చర్యపోయాడు.

గంగాధరానికీ, అతడి భార్యకూ బట్టలిచ్చి సత్కరించాడు జగదీష్. "ఈసారి ఆంటీతో రండి. మా ఆవిడ రాగానే ఫోన్ చేస్తాను" అంటూ నమస్కరించాడు.

బట్టలు అందుకుంటుంటే గంగాధరం కళ్ళు చెమర్చాయి. "ఎందుకిలా చేస్తున్నట్టు" అంటూ.

"అంకుల్, ఇది నా ఆనందం కోసమే".

బట్టలమధ్యలో పెట్టిన చెక్కు కనిపించగానే బైటికి తీశాడు గంగాధరం. 'ఏమిటిది, నీకేమైనా పిచ్చా చాదస్తమా" అన్నాడు.

అది లక్ష రూపాయల చెక్కు!

"ఏంలేదు అంకుల్. అమెరికాలో లక్షలు సంపాదించాను. మీలాంటి వారికిలా ఇస్తే ఓ తృప్తి. పైగా మీరు ధార్మికంగా, ఆధ్యాత్మికంగా ఎన్నో కార్యక్రమాలు చేస్తుంటారని విన్నాను. మీడబ్బుతో పాటే దీన్నీ వినియోగించండి. నాకు మిగిలే పుణ్యం ఇదేకదా" జగదీష్‌కి కళ్ళు చెమర్చాయి.

గంగాధరం కళ్ళముందు ముకుందం, జగదీష్ మరోసారి కదిలారు. వెంటనే తన తల్లి దండ్రులు, వెంకట్రామయ్య గుర్తుకొచ్చారు. మనిషి సృష్టించిన డబ్బు మనుషుల ఆలోచనల్ని, పద్ధతుల్ని మార్చేస్తోంది. బంధాలు, విలువలు ఎలా దిగజారిపోతున్నాయో! మాయ, స్వార్థం ముసుగులో మనిషి ఎలా బతికేస్తున్నాడో అనిపించింది.

"అంకుల్, ఇంటిదగ్గర డ్రాప్ చేస్తాను, పదండి" అన్నాడు జగదీష్. అన్యమనస్కంగానే కారులో కూర్చున్నాడు గంగాధరం. చెమర్చినకళ్ళు గుండెను కూడా తడిపేస్తుంటే కారు రోడ్డుమీద పరుగెడుతోంది.

**సెల్: 90002 27993**



డా॥ జి. సతీష్ రెడ్డి
MS. M.Ch. (Ortho) (UK)
Orthopedics & Joint Replacement Specialist
ప్రైమ్ హాస్పిటల్స్, హైదరాబాద్
ఫోన్. 84999 91829 / 040-4959 4959

# మోకాలు మార్పిడి సర్జరీపై అపోహలు వీడండి...! సర్జరీ తర్వాత సాధారణ జీవితం గడపవచ్చు

మోకాళ్ల నొప్పులతో బాధపడుతున్న వారు మోకాలు మార్పిడి శస్త్రచికిత్స చేయించుకున్న తర్వాత అందరిలాగే సాధారణ జీవితం గడపగలుగుతారు. సర్జరీ తర్వాత జీవితం ఎలా ఉంటుందో అని చాలా మందిలో ఎన్నో అపోహలు, మరెన్నో భయాలు ఉన్నాయి. మోకాలు మార్పిడి చేయించుకుంటే నెలల తరబడి విశ్రాంతి అవసరమని, విధులను నిర్వహించలేమని, ఎక్కువకాలం ఇతరులపై ఆధారపడాల్సి వస్తుందని అపోహ పడుతుంటారు. ఈ అపోహల కారణంగా ఎంత తీవ్రమైన నొప్పితో బాధపడుతున్నప్పటికీ మోకాలు మార్పిడికి కొందరు సిద్ధపడడం లేదు. కానీ అవన్నీ అపోహలు మాత్రమే. మోకాలు మార్పిడి శస్త్రచికిత్సలో 95 శాతం సక్సెస్ రేటు నమోదవుతోంది. 1 శాతం కంటే తక్కువగానే దుష్ప్రభావాలు ఉంటాయి. మోకాలు మార్పిడి చేయించుకున్న తర్వాత అందరిలాగే సాధారణ జీవితం గడపవచ్చు. అయితే ఆపరేషన్ జరిగిన తర్వాత కొన్ని రోజుల పాటు మాత్రం వైద్యుల సలహాలు, సూచనలు పాటిస్తూ జీవనశైలిలో మార్పులు చేసుకుంటూ సరైన జాగ్రత్తలు పాటించాలి.

## విశ్రాంతి ఎంత అవసరం...?

ఆపరేషన్ తరువాత రెండుమూడు నెలలు పడుకునే ఉండాలి అనేది అపోహ మాత్రమే. అత్యాధునిక విధానాలలో ఆపరేషన్ నిర్వహించడం ద్వారా సర్జరీ అయిన రోజునే రోగిని నడిపిస్తారు. రెండుమూడు రోజుల్లో రోగి సొంతంగా నడవగలుగుట మెట్లు ఎక్కటంతోపాటు నిత్యదినచర్యలు పాల్గొనగలుగుతాడు. మోకాలు మార్పిడి శస్త్రచికిత్స జరిగిన తర్వాత కొన్ని వారాలపాటు వైద్యుల సలహాలు, సూచనలు పాటిస్తూ జాగ్రత్తలు తీసుకోవాలి. ఆపరేషన్ జరిగిన ఆరువారాల తర్వాత వైద్యులను సంప్రదించి విధులకు హాజరుకావచ్చు.



## ఇంట్లో చేసుకునే పనులు:

మోకాలు మార్పిడి శస్త్రచికిత్స అనంతరం కర్ర, వాకర్స్ సహాయం లేకుండా నడవడానికి సుమారుగా నెల రోజుల సమయం పడుతుంది. నెల రోజులవరకు వాకర్ సహాయంతో సొంతంగా ఇంట్లో చేసుకునే పనులు చేసుకోగలుగుతారు.

## వ్యాయామం చేయొచ్చా...?

మోకాలు మార్పిడి సర్జరీ రెండు నెలల తర్వాత వాకింగ్, సైక్లింగ్, స్విమ్మింగ్ వంటి వ్యాయామాలు చేయవచ్చు. మోకాలుపై అధిక ఒత్తిడిని కలిగించే వ్యాయామాలకు కొన్ని నెలలపాటు దూరంగా ఉండాలి. గోల్ఫ్, బేస్‌లైన్ టెన్నిస్ వంటి ఆటలు కూడా ఆడవచ్చు.

## ప్రయాణాలు చేయవచ్చా...?

ప్రయాణాలు శరీరాన్ని ఒత్తిడికి గురిచేస్తాయి. దూరప్రయాణాలు చేయవలసి వస్తే తప్పనిసరిగా వైద్యులను సంప్రదించాలి. సర్జరీ జరిగిన నెల నుంచి నెలన్నర తర్వాత విమాన ప్రయాణాలు చేయవచ్చు. మోకాలు మార్పిడి చేయించుకున్న వారికి కృత్రిమ కీలు అమర్చుతారు కాబట్టి ఎయిర్‌పోర్టులలో ఉండే మెటల్ డిటెక్టర్లు గుర్తిస్తాయి. కాబట్టి సర్జరీ జరిగినట్లు వైద్యులు ఇచ్చే గుర్తింపు కార్డును విధిగా వెంట తీసుకెళ్ళడం మంచిది.

## డ్రైవింగ్ చేయవచ్చా...?

ఆపరేషన్ జరిగిన నెల రోజుల లోపే కారు వంటి ఫోర్ వీలర్ నడచవచ్చు. 2-3 నెలల తరువాత ద్విచక్రవాహనం నడపాలి. వీటిలో సెల్ఫ్ స్టార్టర్ ఉన్న వాహనాలను నడపడం మంచిది.

## దాంపత్య జీవితం:

మోకాలు మార్పిడి శస్త్రచికిత్స జరిగిన కొన్ని రోజుల తర్వాత సాధారణ దాంపత్య జీవితం గడపవచ్చు.

## గుర్తుంచుకోవాల్సిన విషయాలు:

సర్జరీ జరిగి ఆసుపత్రి నుండి డిశ్చార్జ్ అయిన తర్వాత ఇంటి దగ్గర కొన్ని జాగ్రత్తలు తీసుకోవడం అవసరం. ముఖ్యంగా ఆపరేషన్ జరిగిన ప్రాంతాన్ని శుభ్రంగా ఉంచుకోవాలి. ఆ ప్రాంతంలో వాపు వచ్చినా, ఎర్రగా మారినా, నొప్పి పెరుగుతూ ఉన్నా వెంటనే వైద్యులను సంప్రదించాలి. మందులు క్రమం తప్పకుండా వాడుతూ, వైద్యులు సూచించిన జాగ్రత్తలు పాటించాలి.

## జాగ్రత్తలు తప్పనిసరి :

మోకాలు మార్పిడి శస్త్రచికిత్స అనంతరం మనం ఎంత జాగ్రత్తగా వ్యవహరిస్తే కృత్రిమ మోకాలు అంత ఎక్కువకాలం మన్నికగా ఉంటుంది. సర్జరీ తర్వాత కొన్ని జాగ్రత్తలు పాటించడం చాలా అవసరం. ఆపరేషన్ తర్వాత మోకాలుపై ఎక్కువగా ఒత్తిడి కల్గించే ఆటలకు దూరంగా ఉండాలి. సర్జరీ చేయించుకున్న వారికి మధుమేహం, రక్తపోటు వంటి ఆరోగ్య సమస్యలు ఉంటే వాటిని అదుపులో ఉంచుకోవాలి. ఆపరేషన్ తర్వాత దంతాలకు సంబంధించిన చికిత్సగానీ, శస్త్రచికిత్సగానీ చేయించుకోవాల్సి వస్తే సర్జరీ జరిగిన విషయాన్ని వైద్యులకు తెలియజేయాలి. దాంతో ఇన్‌ఫెక్షన్ రాకుండా జాగ్రత్తలు తీసుకుంటూ వైద్యులు దంతాలకు చికిత్స అందిస్తారు.

# వెట్టి
## (ది వారియర్)

-మధుబాబు




**మరో పది నిమిషాలు వెయిట్ చేశారు రోడ్డుకు దూరంగా పారిపోయిన బాజిరెడ్డి జనం. లారీ వెనకే బయలుదేరిన జీప్‌కారు శబ్దాలు కూడా వినిపించకుండా పోయిన తర్వాత ఒకరి తరువాత ఒకరుగా మళ్ళీ రోడ్డుమీదికి వచ్చారు.**

**'ఏం చేద్దాంరా ఇప్పుడు? ఎటుపోదాం?' అందరూ పోగుపడిన తర్వాత రోడ్డు అంచు మీద చతికిలపడుతూ అడిగాడు వారిలో ఒకతను.**

'కాళ్ళు కొట్టుకుంటూ మనం రాయుడిపల్లి పోయే సరికి తెల్లారిపోతుంది. నడిచినడిచి ఒంట్లో ఉన్న ఓపిక అంతా గుంటలో పెట్టి గంట కొట్టేస్తుంది. తేరుకోవటానికి, తెప్పరిల్లటానికి చాలా టైం పడుతుంది. ఈలోపల వాడు మనకి వాసన కూడా తగలనంత దూరం వెళ్ళిపోతాడు' అన్నాడు మరోమనిషి.

'ఆడెవడోగాని మహా గట్టిపిండం మాదిరిగా ఉన్నాడు. బాజిరెడ్డి సారుకు అదేపనిగా మెంటల్ తెప్పించేస్తున్నాడు' అన్నాడు మూడోమనిషి.

'అరేయ్.. మెంటలంటే గుర్తొచ్చింది. ఇప్పుడు గనుక ఈ జీపుకారోళ్ళు బసవప్ప దగ్గరికి పోయి, ఆడు కళ్ళు తేలేసి ఉండటాన్ని చూస్తే బాజిరెడ్డి సారు పరిస్థితేంటి?' అడిగాడు ఇంకో మనిషి.

'వాళ్ళు ఎవరై ఉంటారు?' ఉన్నట్లుండి తనలో తను అనుకుంటున్నట్టు పైకే అన్నాడు మొదటి వ్యక్తి.

'ఓరినీ... ఇంకా నీ మొద్దుబుర్రకి అర్థం కాలేదా? గువ్వలగుట్ట గ్రానైట్ మైన్స్‌కి చెందిన మనిషి ఆ బసవప్ప. వాళ్ళు కూడా అక్కడివాళ్ళే! సందేహం అనవసరం' అన్నాడు రెండో మనిషి.

'బసవప్పని పిలిపించిన సంగతి బాజిరెడ్డిసారు మనకెవరికీ చెప్పలేదు. అసలు అతను ఈ గుడి దగ్గరికి వస్తాడని కూడా మనకి తెలియదు. ఎక్కడో ఉన్న ఆ మైన్సోళ్లకి ఎలా తెలిసిందో?' అనుమానం వ్యక్తం చేశాడు ఒకడు.

'ఫోను! దెబ్బలు తినకముందు ఈళ్ళలో ఎవడికో బసవప్ప ఫోను చేసి తను ఇక్కడ ఉన్నట్టు చెప్పి ఉంటాడు. ఎంతకీ వెనక్కి రాకపోయేసరికి ఆళ్ళు సరాసరి ఈడకే వచ్చి కూర్చుని ఉంటారు..' అంటూ అదిరి పడినట్టు ఒక్కసారిగా మాటలు ఆపాడు గుంపులోని ఇంకో వ్యక్తి.

'ఏంటిరా? ఏమైంది?' ఆశ్చర్యంగా అడగబోయి తాను కూడా ఆ మాటల్ని మింగేశాడు మరొకతను.

అతనితోపాటు అందరూ కంకరరోడ్డు వైపు చూశారు. పొడవాటి చెట్టుకొమ్మనొకదాన్ని భుజం మీద పెట్టుకుని చిద్విలాసంగా నడుచుకుంటూ వస్తున్నాడు పిచ్చిపూజారి.

'అరేయ్... నోళ్ళు తెరవద్దు ఎవరూ... ఎంత రెచ్చగొట్టినా సమాధానం ఇవ్వొద్దు. ఒళ్ళు దగ్గర పెట్టుకోండి' చిన్నకంఠంతో అందరినీ హెచ్చరించాడు, అప్పటికప్పుడు ఆ గుంపును లీడ్‌చేసే బాధ్యతను తీసుకున్న మనిషి ఒకతను.

'ఏంటర్రా? ఏం చేస్తున్నారు నడిరోడ్డుమీద? ఏమైపోయింది మీ లారీ?' దగ్గరికి వస్తూనే నవ్వు ముఖంతో అడిగాడు పిచ్చిపూజారి.

'రిపేరొచ్చిందయ్యా. వెనక్కి తీసుకుపోవాల్సి వచ్చింది. వచ్చేస్తుంది మళ్ళీ... రాగానే మేము వెళ్ళిపోతాం' వినయంగా చెప్పాడు తనకు తానే లీడర్గా వ్యవహరించదలుచుకున్న మనిషి.

'రిపేరు మీ లారీకి కాదురా.

## జరిగిన కథ

వెట్టి అసలు పేరు విఠల్‌రెడ్డి. కారణాంతరాలవల్ల వెట్టిగా మారతాడు. తన పెత్తనాన్ని సవాలు చేసిన వెట్టిని అంతమొందించాలనుకుంటాడు బాజిరెడ్డి. వెట్టిని చౌడేశ్వరి ఆలయానికి వెళ్ళి రమ్మంటాడు. ఆలయంలో పఠాన్‌తో పాటు బసవప్పను చూస్తాడు వెట్టి. సమయం చూసుకుని అందరినీ చావమోదుతాడు. ఆలయంలో పిచ్చిపూజారి ద్వారా కొన్ని విషయాలు తెలుసుకుంటాడు. పఠాన్‌కి ప్రణవినిచ్చి పెళ్ళి చేయడానికి పిచ్చమ్మి ఒప్పుకుంటుంది. తాంబూలాలు పుచ్చుకుంటారు. గుడిదగ్గర తారసపడిన వ్యక్తిని రాయుడిపల్లిలో దించి, వారి ఇంట ఆతిథ్యం స్వీకరిస్తాడు వెట్టి. ఆ ఇంటి ఇల్లాలి తమ్ముడి ద్వారా ఒకప్పుడు బాజిరెడ్డికి సన్నిహితుడైన వ్యక్తిని కలుసుకుంటాడు. అతని ద్వారా చౌడేశ్వరికి జరిగిన అపచారమేమిటో కొంతవరకు తెలుసుకుంటాడు వెట్టి. ఈలోపు బాజిరెడ్డికి వెట్టి రాయుడిపల్లిలోనే ఉన్న విషయం తెలిసి మనుషులను పంపిస్తాడు. వాళ్ల దారిలో ఉండగానే బసవప్ప మనుషులు వాళ్లను ఆపి, బసవప్ప ఆచూకీ కోసం గొడవపడతారు.

ఆ తర్వాత...

దాన్ని నా మీదికి నడపాలని మహా తపన పడిపోయిన ఆ డ్రైవర్‌గాడికి వచ్చింది. వాడిని పంపించిన మీ బాజిరెడ్డిసారుకు ఇక రాబోతోంది...' నవ్వుతూనే అన్నాడు పూజారి.

'మీరు పెద్దవాళ్ళు... అట్టాంటి మాటలు మంచిగా ఉండవుకదా..' సన్నగా గొణిగాడు సెల్ఫ్‌మేడ్ లీడర్.

'మంచిగా ఉండంది ఎవరికిరా? మీకా నాకా? ఆ బాజిరెడ్డి అంతుచూడటానికి ఆత్రంగా ఎదురుచూస్తున్న తల్లికా? ఎవరికిరా?' కోరగా చూస్తూ అడిగాడు పూజారి.

చేతుల్ని ఉపయోగించలేదుగాని, ఉపయోగించి నోటిని గట్టిగా అదుముకున్నట్టు ఠక్కున మాటలు ఆపేశాడు ఆ మనిషి.

'గబ్బిలాల మాదిరి ఈ చిమ్మచీకట్లో ఇక్కడ తచ్చట్లాడటం అనవసరం. పదండిరా పోదాం..' అంటూ తనంతట తనే సిటీవైపు నడక మొదలుపెట్టాడు.

రెండవసారి చెప్పించుకోకుండానే గబగబా లేచారు రోడ్డుమీద చతికిల పడినవాళ్ళు. పూజారివైపు చూడను కూడా చూడకుండా అతని వెనుకే అడుగులు వేశారు.

'వెళ్ళండిరా.. త్వరగా వెళ్ళండి. గువ్వల గుట్ట గ్రానైట్ మైన్స్ వాళ్ళతో పెట్టుకుంటే ఎలా ఉంటుందో ప్రత్యక్షంగా చూడాలి కదా! పరుగెత్తండి' పకపకా నవ్వుతూ అన్నాడు పూజారి. తన వెంట తీసుకువచ్చిన చెట్టుకొమ్మను ఒకపక్కన పడేసి, తను రోడ్డు అంచుమీద చతికిలపడి కూర్చున్నాడు. ఆరు అడుగుల దూరంలో నుంచి అవతలికిపోతూ రెండు క్షణాల పాటు ఆగి, అతనివైపే చూసింది ఒక పెద్ద పాము. అతను తనను గమనించే లోపుగా పక్కనే ఉన్న పొదల్లోకి పోయి అదృశ్యమైంది.

●●●

'అవసరమైనవాళ్ళకి సరైన వైద్యం అందించటంకోసం కట్టించిన హాస్పిటల్ ఇది. ఇక్కడ వైద్యం అందించటమే ముఖ్యం. డబ్బులు సంపాదించటం అనే కాన్సెప్టుకి చాలా దూరంగా ఉంటుందీ హాస్పిటల్. గుంపుగా లోపలికొచ్చి, రఫ్‌గా మాట్లాడటానికి ప్రయత్నం చేసిన కొత్త మొఖాల వాళ్ళందరికీ నాయకుడి మాదిరిగా కనిపిస్తున్న మనిషికి చెప్పాడు, నైట్ డ్యూటీ చేస్తున్న డాక్టర్ ఒకతను.

'మా బసవప్ప... మా బసవప్పని తెచ్చి ఇక్కడ చేర్పించారని ఈ పిడత మొఖంవాడు చెపుతున్నాడు. ఎక్కడ పెట్టారు మా బసవప్పని?' కరకరలాడుతున్న కంఠంతో అడిగాడు ఆ నాయకుడు.

'మీ బసవప్ప ఒక్కడికే కాదు, ఇంకా ఉన్నారు. అందరి పరిస్థితీ కొంచెం సీరియస్‌గానే ఉన్నది' అల్లంత దూరంలో ఉన్న ఐసీయూవైపు చేయి చూపిస్తూ చెప్పాడు డాక్టరు.

పరుగులాంటి నడకతో అటు పోయారు ఆ జనంలో నలుగురు. రెండే రెండు నిమిషాలు గది బయట ఉన్న గ్లాస్ విండో దగ్గర నిలబడి, వెంటనే వెనక్కి వచ్చేశారు.

'ఆ బాజిరెడ్డికి ఫోను చెయ్యప్పా.. మనోడు మనకి దక్కుతాడని మాకు అనిపించటం లేదు' వస్తూనే చెప్పాడు వారిలో ఒకతను.

'చెయ్యరా.. మీ సారుకి ఫోన్ చెయ్యి. వెంటనే ఇక్కడికి రమ్మని చెప్పు' బాజిరెడ్డి డ్రైవర్‌కి ఆజ్ఞ ఇచ్చాడు నాయకుడు.

'సారూ.. నా ఫోను ఆ రోడ్డుమీద...' మాటల కోసం తడుముకుంటూ నత్తులు కొట్టాడు అతను.

తన దుస్తుల్లో నుంచి ఫోన్ తీసి అతనికి అందించాడు నాయకుడు. 'చెయ్' అంటూ కమాండ్ చేశాడు.

●●●

పీడకల వచ్చి మంచంమీదినించి పడిలేచిన తర్వాత కుదురుగా నిద్రపోలేక పోయాడు బాజిరెడ్డి. పదిక్షణాల పాటు నిద్ర పట్టినట్టే పట్టి, అంతలోనే వచ్చేయటం మొదలుపెట్టింది మెలకువ.

'లాభం లేదురా.. ఇవాళ ఎందుకనో ఒకటే ఇదిగా ఉంది' మంచానికి అటూ ఇటూ కాపలాగా కూర్చున్న వాళ్ళతో చెపుతూ, లేచి కూర్చున్నాడు.

'ఎంతో కాలంగా ఎదురుచూస్తున్న పని చిటికెలో పూర్తి అయిపోతే అలాగే ఉంటుంది సారూ... నిద్ర పట్టదు' తాము కూడా లేచి నిలబడుతూ అన్నారు వాళ్ళు.

'తాగింది సరిపోలేదురా, ఇంకో రెండుగ్లాసులు పుచ్చుకుంటే సరిపోతుంది. దానంతట అదే తన్నుకుంటూ వచ్చేస్తుంది నిద్ర' అంటూ మంచం దిగాడు బాజిరెడ్డి.

మంచం పక్కనే బల్లమీద ఉన్న అతని ఫోను సరిగ్గా అప్పుడే మోగింది. 'ఇంత రాత్రివేళ ఎవరు? నాకు నిద్రపట్టడం లేదని ఊరంతా తెలిసిపోయిందా ఏమిటి? చూడు ఎవరో' చిరాకుగా అన్నాడు అతను.

చేతిని జాచి ఫోను అందుకున్నాడు ఒక మనిషి. 'సంపంగి.. సంపంగి చేస్తున్నది సారూ' అన్నాడు.

'ఇంతకుముందే కదరా తను వచ్చి వెళ్ళింది? ఇంతలోనే చేయటం ఏమిటి? కొంపతీసి ఆ చప్పిమొఖం వాడు తిరిగొచ్చేశాడా?' ఆశ్చర్యంగా అడుగుతూ చేయిజాచాడు బాజిరెడ్డి.

'కనుక్కోండి సారూ. వాడే గనక వచ్చేసి ఉంటే మనోళ్ళకి వెంటనే చెప్పాలి. లేకపోతే రాయుడిపల్లిదాకా పోయి దేబెమొఖాలేసుకుని తిరిగొస్తారు' అంటూ ఫోను అందించాడు ఆ మనిషి.

'ఏంటి సంపంగి?' ఆత్రుత అదుముకోవటానికి ప్రయత్నం చేస్తూ అడిగాడు బాజిరెడ్డి. 'ఆడు వచ్చేశాడా?'

'అయ్యగారూ.. ఆడు రాలేదు. మీకు వెంటనే ఒక మాట చెప్పాలి. అందుకే చేశా' అవతలి నుంచి చాలా చిన్నగా గుసగుసగా వినవచ్చింది సంపంగి గొంతు.

'ఏమిటే అదీ?' ఆత్రుత కాస్తా విసుగ్గా మారిపోతుండగా, విసురుగా అడిగాడు బాజిరెడ్డి.

'జయమ్మగారిని గురించి డాక్టరుకు ఫోను చేశారు. ఆయమ్మ పిచ్చి నయమైపోతోందిట. పొద్దున్నే వచ్చి



చూడమని ఆయమ్మే చెప్పింది'.

ఊపిరి అందక ఉక్కిరిబిక్కిరి అవుతున్నట్టు బరువుగా ఊపిరి తీసుకోవాల్సి వచ్చింది బాజిరెడ్డికి. 'ఏమిటే నువ్వు మాట్లాడేది? దానికి పిచ్చి నయం కావటం ఏమిటే?' అయోమయంగా అడిగాడు.

తలుపు చాటున నిలబడి చాటుమాటుగా తను విన్న వాటినన్నిటినీ వివరంగా వినిపించింది సంపంగి. 'నిద్రపోకుండా బయటికీ లోపలికీ అదే పనిగా తిరుగుతుంటే ఆ ప్రత్యూష నావైపు గుడ్లగూబ మాదిరి చూస్తోంది. ఉంటానయ్యా' అంటూ చటుక్కున ఫోన్ కట్ చేసేసింది.

'ఇదేంటిరా? ఆ పిచ్చిమొఖం దానికి పిచ్చి నయమవడం ఏమిటి? ఎలా సాధ్యం?' ఫోను అలాగే పట్టుకుని తన వారిని అడిగాడు బాజిరెడ్డి.

పిచ్చెక్కి చాలాకాలం అయింది కదయ్యా... ఒక వేళ తగ్గిపోయిందేమో!' తనకేదో తెలిసినట్టు సమాధానం ఇచ్చాడు ఒకడు, పిచ్చిమొఖం ఎవరో తెలిసి ఉండటం వల్ల.

'తగ్గదురా... తగ్గదు కాక తగ్గదు. తగ్గే ఛాన్సే లేదు. తగ్గటం అంటే సామాన్యం కాదు' తల విదిలిస్తూ అన్నాడు బాజిరెడ్డి.

'అదేంటి సారూ... ఎందుకు తగ్గదు? మన డాక్టరు మంచిమంచి మందులు...' అంటూ చటుక్కున మాట మింగేశాడు ఆ మనిషి.

పెదవులు బిగించి బాజిరెడ్డి తల అడ్డం తిప్పటమే అందుకు కారణం. 'అది మందులకు లొంగేది కాదురా. దానికి వేరే చాలా పెద్ద కథ ఉంది. పిచ్చివాగుడు వాగుతూ అది కాటికి పోవాల్సిందే.' అంటూ ఈసారి తను సడన్‌గా ఆపాడు మాటల్ని. అతని చేతిలోనే ఉన్న ఫోను గంయ్ గంయ్‌మనటమే కారణం.

'ఎవడ్రా మళ్ళీ? ఇంతరాత్రివేళ ఏంటిరా? కరకరలాడుతున్న కంఠంతో మహాకోపంగా అడిగాడు.

'సారూ... మీరు అర్జంటుగా హాస్పిటల్ దగ్గరికి రావాలి. బసవప్ప కోసం జనం వచ్చారు' అంటూ మూడుమాటల్లో తన ప్రాబ్లం అతనికి తెలియచేశాడు అతని డ్రైవర్.

కోపం గీపం మటుమాయం అయిపోయింది బాజిరెడ్డి ముఖం మీదినించి, 'ఓరినీ... ఇదేందిరా? ఆళ్ళు రావటం ఏంటి? మీరు వెళ్ళిన పని ఏమైంది?' అని అడిగాడు.

జరిగింది ఏమిటో డ్రైవర్ నోటివెంట వినేసరికి చెమటలు ప్రత్యక్షమయ్యాయి నుదుటిమీద. 'వస్తున్నా... నేను వస్తున్నా. గొడవ చేయొద్దని చెప్పు' అంటూ ఫోన్ మంచంమీదికి విసిరి, తను ఆ గది బయట ఉన్న హాల్లోకి బయలుదేరాడు. ఒకరి మొఖం ఒకరు చూసుకుంటూ, అతని వెనుకే అడుగులు వేశారు కాపలా మనుషులు ఇద్దరూ.

●●●

'నువ్వు గమనించావో లేదో నాకు తెలియదు. చౌడేశ్వరిగుడిలో ఒక వింత ఆచారం ఉంది. పూజలు చేయించటానికి ఎంతమంది వచ్చినా ఆ తల్లి ఎదుటికి కేవలం ఒక్కరంటే ఒక్కరినే రానిస్తారు. ఒకే కుటుంబానికి చెందిన వారైనా సరే ఒకరి తర్వాత మరొకరు వెళ్ళి దర్శనం చేసుకోవాల్సిందే! గుంపుగా పోవటం మాత్రం కుదరదు' అన్నాడు బండోడి నాయన.

'ఈ మాట నాకు మా పంతులుగారి ద్వారా తెలిసింది. మీ ఊరి రవీంద్రన్న పూజ చేయించినప్పుడు నన్ను గుడికి వెలుపలే నిలబెట్టాడు పూజారి' అన్నాడు వెట్టి.

'పూజ చేయించటానికి గుంపుగా లోపలికి వెళితే, వెళ్ళిన వారందరూ పూజ మీద తమ దృష్టి లగ్నం చేయరు. ఏవేవో మాటలు, వెక్కిరింపులు, వేళాకోళాలు, అటూఇటూ చూడటం జరుగుతుంది. అటువంటి అపచారపు పనులు జరగకుండా విధించబడింది ఆ నియమం' అన్నాడు వృద్ధుడు.

'ఆ తల్లిని వెక్కిరించనంతవరకూ ఎటువంటి అపచారము జరగదు కదా! కొంపలు అంటుకుపోతాయన్న భయంతో పెట్టినట్లుంది ఆ నియమం' నిర్భయంగా తన మనసులో మాట బైట పెట్టేశాడు వెట్టి.

'ఇప్పటిది కాదు అది. ఎప్పటి నుంచి ఉన్నదో ఎవరికీ తెలియదు' అంటూ రెండు క్షణాలు ఆగి 'నువ్వు లోపలికి పోయిన తర్వాత ఆ ప్రదేశంలో ఏదైనా విశేషం చూడటం జరిగిందా?' అడిగాడు వృద్ధుడు.

వడ్రంగి టేకుకర్రను చిత్రిక పట్టినట్టు అదేపనిగా తన మనసును తరిచి తరిచి చూసుకున్నాడు వెట్టి.

ఐదు పడగల్ని ధరించి ఉన్నది లోపల కొలువై ఉన్న తల్లి. చిద్విలాసంగా చూస్తూ కూర్చుని ఉంది.

'నేను అడిగింది ఆ తల్లిని గురించి కాదు. గర్భగుడి ముందు భాగంలో, నువ్వు నిలబడిన ప్రదేశంలో' అంటూ ప్రాంప్ట్ చేశాడు బండోడి నాయన.

కనులు చిట్లిస్తూ మరింత తీవ్రంగా ప్రయత్నం చేశాడు వెట్టి. పది క్షణాల తరువాత లీలగా... అతి లీలగా కనిపించీ కనిపించనట్టు అతని కనుల ముందు ప్రత్యక్షమై అంతలోనే మాయమై పోయింది ఒక విషయం.

**నువ్వు గుడిలోపలికి పోయిన తరువాత ఏదయినా విశేషం చూశావా? అని అడిగాడు వృద్ధుడు. గుర్తుచేసుకోవటానికి ప్రయత్నించాడు వెట్టి. ఏదో లీలగా కళ్ళముందు ప్రత్యక్షమై మాయమైంది. గర్భగుడి ముందుభాగంలో, నువ్వు నిలబడిన ప్రదేశంలో ఏమైనా కనిపించిందా? రెట్టించాడా వృద్ధుడు. పదిక్షణాల తరువాత అతడు అడిగేదేమిటో కనిపించింది వెట్టికి. ఇంతకీ వెట్టి కనుల ముందు ప్రత్యక్షమైన ఆ దృశ్యం ఏమిటి? ఏముంది అందులో?**

యస్... పెద్ద నాపరాయివంటి చదునైన శిల... గర్భగుడి ద్వారం పక్కనే గోడకు ఆనించి నిలబెట్టి ఉంది. ఏ కాలం నాటివో తెలియని, ఏవో అక్షరాలు దాని మీద చెక్కబడి ఉన్నాయి.

చౌడేశ్వరికి సంబంధించిన మంత్రమో, దండకమో అయి ఉంటుందని అనుకున్నాడు తను. పెద్దగా పట్టించుకోలేదు.

నొసలు చిట్లిస్తూ తదేకంగా అతని ముఖంలోకి చూస్తున్న వృద్ధుడి పెదవుల మీద ప్రత్యక్షం అయింది చిన్న చిరునవ్వు. 'నాకు నమ్మకం కుదిరింది. ఆ తల్లి నిన్ను ఎంచుకున్న కారణం కూడా తెలిసిపోయింది. నీ చూపు సునిశితం. నీ జ్ఞాపకశక్తి అద్భుతం' ఉన్నట్లుండి ముందుకు వంగి, మునివేళ్ళతో అతని బుగ్గల్ని స్పృశిస్తూ మెచ్చుకున్నాడు.

సిగ్గుపడవలసిన సిచ్యుయేషన్ అది. కాని, పడలేదు వెట్టి. 'అయ్యా.. అవతల నా కోసం వస్తున్న జనం ఈ పాటికి చింతలపల్లిని క్రాస్‌చేసి ఉంటారు. వాళ్ళు వచ్చి నన్ను పట్టుకుంటే లేనిపోని గోల, నా ఆరోగ్యానికి చేటు. దయచేసి మీరు చెప్పదలుచుకున్నది త్వరగా చెప్పండి. ప్లీజ్ అంటూ వేడుకున్నాడు.

'శాసనమప్పా అది. గుడిలో కొలువై ఉన్న ఆ తల్లి మహిమకు సంబంధించిన ఒక హెచ్చరిక' గంభీరంగా అన్నాడు వృద్ధుడు.

'ఎటువంటి హెచ్చరిక?' ఆశ్చర్యంగా అడిగాడు వెట్టి.

'ఎప్పుడైనా, ఎవ్వడైనా, ఏనాడైనా, ఏదైనా ప్రలోభానికి గురై చౌడేశ్వరిమాత ఆత్మశిలకు అపచారం తలపెడితే, వంశక్షయం అవుతుందంటి! మతులు చలించి బిచ్చగాళ్ళ మాదిరి దేశాలు పట్టుకు తిరుగుతారట..'

కారణం తెలియదు గాని, చలిగాలి వీచినట్టు జలదరించింది వెట్టి శరీరం. మరోసారి ఆ గుడిని, రాజగోపురాన్ని, ఆవరణని, ఆవరణ వెలుపల ఉండే రేకుల షెడ్డుతో కలిపి, అక్కడి పుట్టల్ని అన్నిటినీ గబగబా గుర్తుకు తెచ్చుకోవటానికి ప్రయత్నం చేశాడు.

'ప్రయాస పడకప్పా... ఆ శిల నీకు నాకు కనిపించేదికాదు. ధర్మకర్తలకు కూడా అది ఎక్కడ ఉందో తెలియదు, ఒక్క పూజారికి తప్ప' అన్నాడు వృద్ధుడు.

ఆ మాటలు పూర్తిగా అర్థం కాకపోయినా, వేపాకులు నమిలినట్టు చేదుగా తయారైపోయింది వెట్టి నోరు.

పొడవాటి తన కేశాల్ని చీటికిమాటికి సవరించుకుంటూ, విరగబడి నవ్వుతూ, విపరీతమైన కోపంతో పాము మాదిరి బుసలు కొడుతూ, దేశదిమ్మరి మాదిరి తిరిగే పిచ్చమ్మి స్వరూపం కనులముందు ప్రత్యక్షం అవటం ఒక కారణం. ఎప్పుడు ఏమి ముంచుకు



వస్తుందో తెలియని అనారోగ్యాలతో బాధపడు తున్న శివారెడ్డి కనుల ఎదుట ప్రత్యక్షం అవటం రెండవ కారణం. అతనికి గనుక ఏమైనా జరిగితే అంతటితో అంతం అయిపోతుంది ఆ వంశం.

బండోడి నాయన చెబుతున్న మాటలన్నీ వాస్తవ రూపాలు ధరించి తన ఎదుటే కనిపిస్తున్నాయి.

'శాసనంలో చెప్పబడిన ఆ ఆత్మశిలకు శివా రెడ్డి తండ్రి ఏదైనా అపచారం చేసి ఉంటాడా?' ఉండబట్టలేక వెంటనే అడిగాడు.

'శివారెడ్డి తండ్రిగారితో ఆ భ్రష్టుడు బాజిరెడ్డి చేయించాడు. శాసనంలోని అక్షరాలు సామాన్యమై నవి కావప్పా! రాసింది రాసినట్టు జరుగుతోంది. అవునా కాదా?' అడిగాడు వృద్ధుడు.

'అయ్యా... కొంచెం కొంచెంగా చెప్పి నన్ను కన్ ఫ్యూజ్ చేయకండి. జరిగింది ఏమిటో వివరంగా చెప్పండి' మరోసారి వేడుకున్నాడు వెట్టి.

'నా గొంతు ఎండుకు పోతున్నట్టుగా ఉంది. నీళ్ళల్లో కలుపుకుని నేను తీసుకున్న మూలిక సామాన్య మైంది కాదు. పదిహేను నుంచి ఇరవై రెండు అడు గుల పొడవు ఉండే రాజసర్పాలు కాటువేసినా, చిటికెలో ఆ విషాన్ని నిర్వీర్యం చేయగల దమ్ము ఉన్నటు వంటిది. అది నా శరీరంలో ఉత్పత్తి చేసే వేడిమిని తట్టుకోవాలంటే ప్రతిసారీ గంటకి గ్లాసెడు మజ్జిగ తాగుతూ ఉండాలి. అలక్ష్యం చేస్తే నిప్పుల్లో నిల బడినట్టు మాడి మసి అయిపోవడం జరుగు తుంది' అంటూ చెప్పి, 'ఒరేయ్ నాయనా.. ఏడ ఉన్నావురా?' అని బిగ్గరగా పిలిచాడు వృద్ధుడు.

ఇంటికి దూరంగా నిలబడినా, ఒక చెవిని ఇంట్లో జరుగుతున్న సంభాషణ మీదే వేసి ఉంచాడు కాబోలు... 'నాయనా వస్తున్నా' అంటూ ద్వారం దగ్గర ప్రత్యక్షం అయ్యాడు కొడుకు.

'మజ్జిగ... మజ్జిగ కావాలి రా' లోపలికి పోయిన మూలిక తన అలజడి ఆరంభం చేసింది కాబోలు, జీరగా ధ్వనించింది వృద్ధుడి కంఠం.

అతని పక్కనుంచి ఆ గది అవతల ఉన్న గది లోకి వేగంగా పోయాడు బండోడు. మురికిగా కనిపిస్తున్న ఒక సత్తుగ్లాసు నిండా మజ్జిగ నింపుకుని తీసుకు వచ్చాడు. దాహం అధికమైపోతున్న మనిషి మాదిరి ఆత్రంగా తాగేశాడు వృద్ధుడు. తన వెనక ఉన్న గోడను ఆనుకుని కనుల్ని మూసుకున్నాడు.

'వచ్చిన పని కొంతవరకన్నా అయిందా అన్నా?' గది గుమ్మం అవతల నించి చిన్నకంఠంతో అడిగాడు, వెట్టికి బండోడిని పరిచయం చేసిన యువకుడు.

పెదవుల మీద వేలుంచుకుని, తల అడ్డం తిప్పాడు వెట్టి. చెంపలు వేసుకుంటున్నట్టు చేతులు కదిలించి, బండోడి వెనుకే మరోసారి ఇంటికి దూరంగా వెళ్ళిపోయాడు అతను.

●●●

'ఎవరు చేశారు ఈ పని? ఎందుకు చేశారు?' హాస్పిటల్ ముందు కారు దిగిన బాజిరెడ్డిని చూసీ చూడగానే ఎదురు బయలుదేరిన డ్రైవర్‌ని ఆపి, గట్టిగా అడిగాడు అసహనంగా నిలబడి ఉన్న కొత్తమనిషి.

'ఇప్పటిదాకా ఏమీ మాట్లాడకుండా నిలబడి నారు కదా... ఇంతలోనే మీకు ఎందుకు ఆత్రం?' బాజిరెడ్డిని చూసిన ధైర్యమో, క్షణక్షణానికి అధికం అయిపోతున్న విసుగుదలో తెలియదుగానీ, విసు రుగా సమాధానం ఇచ్చాడు డ్రైవర్.

అంతే... అతని మాట పూర్తయిన మరుక్షణం ఫెడీమని పడింది దెబ్బ, అతని నోటిమీద. ఎర్రటి రక్తం వెల్లువలా వెలుపలికి వస్తూ ఉండగా, వెనక్కి తూలి వెల్లకిలా పడిపోయాడు డ్రైవర్.

'మా మనిషిని రప్పించి చావకొట్టించింది చాలక, మాకే ఎదురు సమాధానం చెపుతున్నావా? ఎవ రని అనుకున్నావురా మమ్మల్ని?' పళ్ళు బిగపట్టి పెద్దగా రంకెలుపెడుతూ, కింద పడిపోయిన మని షిని తన్నటానికి పాదాన్ని ఎత్తాడు ఆ మనిషి.

'ఆగండి... దయచేసి ఆగండి. ఇది పబ్లిక్ ప్లేసు కాదు. అనారోగ్యాలతో బాధపడే పేషంట్లు ఉండే ప్రదేశం. దయచేసి ఇక్కడ గలాటా చేయొద్దు' వెంటనే అన్నాడు దూరంగా నిలబడి ఉన్న నైట్ డ్యూటీ డాక్టరు.

'ఎవడ్రా? ఎవడ్రా అదీ? ఏమిటిరా విషయం?' లోపలికి వస్తూనే కిందపడి ఉన్న తన డ్రైవర్‌ని చూసి కోపంగా అరవబోయాడు బాజిరెడ్డి.

'నోరు జాగ్రత్త సారూ... మాటలు మిగలద్దు' చూపుడు వేలు ఎత్తి చూపిస్తూ అతన్ని కూడా హెచ్చరించాడు డ్రైవర్‌ని కొట్టిన మనిషి.

'ఆయనే బాజిరెడ్డిసారు. మీరు ఫోను చేయించింది ఆయనకే' గబగబా పరిచయం చేశాడు డాక్టరు.

'పదిమందీ కూర్చునే చోటులో ఏంటప్పా ఈ గందరగోళం. ఫోను చేయిస్తిరి కదా... వస్తూనే ఉంటిని కదా... నాతో మాట్లాడవచ్చు కదా... ఆ పిచ్చోడిని కొట్టుడు దేనికి?' తన కోపాన్ని అతి బల వంతంగా అదుముకుంటూ అన్నాడు బాజిరెడ్డి.

'మామూలు మాటల్ని దాటి చాలా దూరం వెళ్ళిపోయింది విషయం. చూశావు కదా మా బస వప్పని? ఎందుకని అలా? అసలు గొడవ ఏమిటి?' తన దురుసుతనాన్ని వదులుకోకుండా అదే శృతిలో అడిగాడు ఆ మనిషి.

చిటికె వేస్తే చాలు వేటకుక్కల మంద మీద పడినట్లు తన మీదా, తనతో వచ్చిన కాపలా మనుషుల మీదా కలబడటానికి సిద్ధంగా ఉన్న ఆ మనిషి అనుచరుల్ని చూశాడు బాజిరెడ్డి.

'అసలు జరిగింది ఏమిటంటే-' అంటూ సౌమ్యం గానే మొదలుపెట్టబోయాడు.

'జరిగింది ఏమిటో చెప్పమంటుంటే నంగినంగి కబుర్లు దేనికి? ఎవడు మా బసవప్ప మీద చెయ్యి

# సోయగాల సోనాక్షి

**బాలీవుడ్**లో అడుగుపెట్టినప్పటి సోనాక్షికీ, ఇప్పటి సోనాక్షికీ అస్సలు పోలికే లేదు. ఈ నిజాన్ని బాలీవుడ్‌లో అందరూ ఏకగ్రీవంగా అంగీకరిస్తున్నారు కూడా! మొదట్లో పద్ధతిగా కని పించకపోతే అమ్మ తిడుతుంది...అమ్మ ఊరుకోదు లాంటి చిలకపలుకులు వల్లించిన సోనాక్షి ఆ తరువాత తోటివారిని చూసి పంథాను మార్చుకుంది. ఎక్స్‌పోజింగ్ విషయంలో కూడా హద్దులు చెరిపేసింది. దానికి ప్రత్యక్ష సాక్ష్యం లాక్మే ఫ్యాషన్ వీక్! ఈ ఈవెంట్‌కి వచ్చిన సోనాక్షిని చూసిన వారికి ఒక్కసారిగా మతులు పోయాయట! బొద్దుగా ముద్దుగా ఉండే సోనాక్షి ఇప్పుడు సన్నజాజి తీగలా నాజూగ్గా మారిపోయింది. అంతే కాదు, ఒక వైపు ఆచ్ఛా దన లేని భుజాలు, కాళ్లు చూపించేస్తూ మిగతావారి కన్నా తనేమీ తక్కువ కాదని నిరూపిస్తోంది. కాకపోతే కాస్త లేటుగా కళ్లు తెరవడం వలన అవకాశాల విష యంలో మిగతా వారి కన్నా బాగా వెనకపడి ఉంది.



వేసింది?' మరింత కచ్చగా అడిగాడు ఆ మనిషి.

టక్కున దొరికింది బాజిరెడ్డికి ఒక చక్కటి మార్గం. దొరికిన వెంటనే రెండో ఆలోచన చేయలేదు అతను. 'వాడేనప్పా... రాయుడిపల్లి వెళ్ళిండు. వాడి పేరు.. వాడి పేరు..' అంటూ తడుముకుంటుండగా, 'సారూ, వాడి పేరు వెట్టి... వెట్టి అంటారు వాణ్ణి' అందించాడు కింద నించి లేచిన డ్రైవర్.

'ఆc వాడే... ఎంత ఆపినా ఆగకుండా చావ మోదిండు. గుడి దగ్గరికి వచ్చిన ధర్మాత్ముల్ని దేబి రించి, వాళ్ళ బండిలో ఇక్కడికి తీసుకువచ్చాం' వెంటనే చెప్పాడు బాజిరెడ్డి.

'సారూ... మీ దూరపు చూపుకి నా దండాలు. ఎంత చక్కగా ఇరికించారయ్యా ఆణ్ణి' పక్కకువచ్చి అతనికి మాత్రమే వినిపించేటట్టు గుసగుసలా డాడు డ్రైవర్.

'నువ్వు నోరు మూసుకోరా... మూసుకో' తీవ్రంగా హెచ్చరించి, ఆ కొత్తమనిషివైపు తిరిగాడు బాజిరెడ్డి.

'మీ డ్రైవరోడు ఏంటి అంటున్నాడు?' అడి గాడు ఆ మనిషి.

'కొట్టింది మనం చూడలేదు కదా, లేనిపోని మాటలెందుకు అంటున్నాడు' అన్నాడు బాజిరెడ్డి.

లేదు?' కోరగా చూస్తూ అడిగాడు ఆ మనిషి.

'చెప్పనిచ్చారా? గొంతు చినిగిపోయేటట్టు అరవ టమే సరిపోయె. నిదానం ఏది? మాట వినింది ఎక్కడ?' ఉన్నట్టుండి తనది అప్పర్‌హ్యాండ్ అవబో తున్నట్టు కనిపించేసరికి మరింత ఉత్సాహంగా అన్నాడు బాజిరెడ్డి.

'సరే అన్నా... మేము పోయి ఫోన్లు చేసి..' అంటూ బయలుదేరబోయిన తనవారిని ఆగమని సైగచేశాడు ఆ మనిషి.

'మా బసవప్ప సంగతేమిటి?' బాజిరెడ్డిని అడి గాడు సౌమ్యంగా.

'ఈ చుట్టుపట్ల మూడు జిల్లాల్లో ఈ హాస్పి టల్‌ని మించిన హాస్పిటల్ ఒక్క కర్నూలులోనే ఉంది. అవసరం అయితే అంబులెన్స్‌లో బసవప్పని అక్కడికి పంపిస్తాను. మీరు కాదంటే బెంగుళూరు తరలించమన్నా మేము రెడీ. మీరు ఎలా చెపితే అలాగే' అన్నాడు.

'ఏమంటారు డాక్టరుగారు?' వెయిట్ చేస్తున్న డాక్టర్‌ని అడిగాడు ఆ మనిషి.

'వెయిట్ చేసి చూడాలి. ఇంకో పన్నెండు గంటలు. తెలివి వచ్చిందంటే చాలు... హీ విల్ బీ




'లేనిపోని మాటలేంటి? మా మనుషుల మీదికి వచ్చినట్టు తెలిస్తే చాలు.. విరగదీసి మడత పెట్టేయ టమే..' అంటూ తన వెనక ఉన్న తనవారివైపు చూశాడు ఆ మనిషి.

'ఫోన్లు చెయ్యండి. అనంతపురం, గుగ్గూరు అన్ని చోట్లకి చేసి, మనోళ్ళందర్ని రమ్మని చెప్పండి. మీలో నలుగురు రాయుడిపల్లి ఎటుందో తెలుసుకుని ఆడికిపోండి. ఆ వెట్టిగాడు ఎవరో...' అంటూ సడన్‌గా మాటను ఆపాడు.

ఆగిపోయావేందన్నా?' అడిగాడు ఒక సహచరుడు.

'ఈ పేరు ఎక్కడో విన్నట్టుందిరా! చాలాసార్లు చెవులపడిన జ్ఞాపకం. ఎందుకైనా మంచిది బుంగిడి పగిడయ్యకి కూడా చెయ్యండి ఫోను. ఒకవేళ మనోళ్ళని తప్పించుకు వచ్చినవాడు వాడే అయితే భలే రంజుగా ఉంటది' అన్నాడు ఆ మనిషి.

వాళ్ళ మాటలమీద తనకు ఏమంత ఇంట్రస్టు లేనట్టు పరాకుగా నిలబడినట్లు కనిపిస్తున్న బాజి రెడ్డి వెంటనే అలర్ట్ అయిపోయాడు.

'బసవప్పకి కూడా అదే అనుమానం వచ్చింది. అసలు అతను మా వాళ్ళతో కలిసి వెళ్ళింది అతడు అవునో కాదో తెలుసుకోవటానికే' అన్నాడు గబగబా.

'ఈ మాట మాకు ముందే ఎందుకు చెప్ప

క్వయిట్ ఆల్‌రైట్ చెప్పాడు అతను.

'మీరు దగ్గర ఉండి జాగ్రత్తగా చూసుకోండి. మేము వెళ్ళి ఆ వెట్టోడి వ్యవహారం ఏమిటో తేల్చుకు వస్తాము.' అంటూ తను కూడా బయటికి బయలు దేరాడు, అందరితో కలిసి, ఆ మనిషి.

బిగపట్టి ఉంచిన ఊపిరిని తేలికగా బైటికి వదులుతున్నట్టు నిట్టూర్చి, ముఖంమీద ప్రత్యక్ష మైన చెమటలు తుడుచుకున్నాడు బాజిరెడ్డి.

'భలే ఇరికించారు సారూ.. ఆడి పని అయిపోయి నట్టే! వీళ్ళు మనుషులు కారు సారు... అడవి జంతు వులు. రివాల్వర్లను పెట్టుకుని మరీ వచ్చారు' తను భయపడి పోవటానికి, దెబ్బ తినటానికి కారణం.. తనను అడగక ముందే చెప్పాడు డ్రైవర్.

'అది సరేరా.. ఉన్నట్టుండి ఇప్పుడు ఇంకో కొత్త సమస్య వచ్చిపడింది. బుర్రంతా పాడై పోయింది. నిద్ర చెడిపోయింది' నిలబడిన ప్రదేశంలో నుంచి బయటికి దారి తీస్తూ చిన్నగా అన్నాడు బాజిరెడ్డి.

'ఏంటి సారూ అది?' ఆశ్చర్యంగా అడిగాడు డ్రైవర్.

'సంపంగి ఫోను చేసి చెప్పిందిరా... ఆ పిచ్చి దానికి మెంటల్ తగ్గుముఖం పడుతోందిట. తగ్గిపోతున్న లక్షణాలు కనిపిస్తున్నాయట' అన్నాడు బాజిరెడ్డి.

ఆశ్చర్యంగా చూడటం అయితే చూశాడు గాని, ఆ విషయాన్ని సీరియస్‌గా మాత్రం తీసుకో లేదు డ్రైవర్. 'తగ్గితే ఏంటి? తగ్గకపోతే ఏంటి? తాంబూలాలు పుచ్చేసుకున్నారు. పెళ్ళి ఫిక్స్... పిచ్చిలో ఒప్పుకున్నా, మంచిగా ఉన్నప్పుడు ఒప్పు కున్నా ఒప్పుకున్నట్టే కదా! తేడా ఏముంటుంది?' అని అడిగాడు.

విషయం అదికాదురా చచ్చుమొఖం వాడా.. వేరే ఉంది' చిరాకుగా అన్నాడు బాజిరెడ్డి.

'ఏమిటి అది సారు?' అడిగాడు డ్రైవర్.

చుట్టూ చూశాడు బాజిరెడ్డి. తన వెనుకే ఉన్న కాపలా మనుషులిద్దరికీ చేసైగ చేశాడు.

అప్పటివరకూ తమను దగ్గరగా నిలబడనిచ్చి, ఇప్పుడు దూరంగా పొమ్మని ఆ సైగ చేయటం దేనికో అర్థం కాలేదు వాళ్ళకి.

'మాటల్తో చెపితేతప్ప అర్థం కాదా? పొండిరా అవతలికి' విసురుగా కసురుకున్నాడు డ్రైవర్.

చిన్నముఖాలైపోయినయ్ వాళ్ళిద్దరివీ. తలలు పక్కకు తిప్పుకుని దూరంగా వెళ్ళి నిలుచున్నారు.

'చెప్పండి సారూ.. మనం ఇద్దరమే ఉన్నాం' బాజిరెడ్డికి చెప్పాడు డ్రైవర్.

'కిడ్నీలు కొట్టేసిన శివారెడ్డికి ఉన్నట్టుండి ఆ జబ్బు నయమైపోయిందని ఈ చచ్చుమొఖం డాక్టరు చెప్పి నప్పుడే నాకు అనుమానం వచ్చి ఉండాల్సింది. రాలేదు. ఇప్పుడు ఈ పిచ్చిదానికి కూడా మెంటల్ మాయమవటం.. ఇది మంచి వార్త కాదురా! మన కొంపలు అంటుకునే వార్త!' నుదురు రుద్దు కుంటూ అన్నాడు బాజిరెడ్డి.

'సారూ... వివరంగా చెప్పండి. అర్థం అయ్యే టట్టు చెప్పండి. మీ ఉప్పు తిని బతికేటోళ్ళం. మీ కొంప మీదికి ఏదైనా వస్తే... అది మా మీదికి కూడా వచ్చినట్టే. తలకాయలు అడ్డేసి కాచుకుంటాం' విశ్వాసం ఉట్టిపడే మాటలు మాట్లాడాడు డ్రైవర్.

'శివారెడ్డి తండ్రి బతికి ఉన్నప్పుడు ఒక పెద్ద ప్లాను వేసి పూర్తి చేశానురా! ఆ ప్లాను దెబ్బకి ఆయన అవుటైపోయాడు. ఆ పెళ్ళాం పిచ్చెక్కి రోడ్డున పడింది. ఈ శివారెడ్డి మంచం ఎక్కాడు. మిగిలింది ఆ ఒక్క కట్టెమొఖం సివంగి. దాని మెళ్ళో తాడు కట్టించి ఆ వంశంలో నుంచి ఇవతలికి తీసుకు వచ్చేస్తే, ఎస్టేటు మొత్తం మనదైపోతుందని అనుకున్నాను అప్పుడు' సాలోచనగా అన్నాడు బాజిరెడ్డి.

'అప్పుడేమిటి సారు? ఇప్పుడు కూడా పరిస్థితి అదే కదా.. తేడా ఎక్కడ?' ఆశ్చర్యంగా అడిగాడు డ్రైవర్.

'నీకు తెలియదురా. తేడా కొట్టేస్తోంది. నేను అప్పుడెప్పుడో వేసిన ప్లాను ఎందుకూ పనికి రాకుండా పోతున్నదనిపిస్తోంది'.

'ఏంటయ్యా నీరసం మాటలు. తేడా అనేది ఎక్కడా లేదు. నా మాట విని ముందు దగ్గర్లో మంచి ముహూర్తం చూడండి. అసలు ముహూర్తం చూడొద్దు. పఠాన్‌బాబును వెంటనే వెనక్కి వచ్చి ఆ సివంగి మెళ్ళో తాడు కట్టేయమని చెప్పండి. ఆ ఒక్క పని జరిగితే చాలు. అంతా సరి అయిపో తుంది' అన్నాడు డ్రైవర్.

'అబ్బాయి రావటానికి ఇంకో మూడు రోజులు పడుతుంది. శ్రీలంక నుంచి బయ్యర్లు వస్తున్నారు. నిలబెట్టి ఉంచిన సరుకునంతా అప్పగించి చేతులు దులిపేసుకోవాలి. లేకపోతే ఆ సబ్బిరెడ్డి దృష్టిలో పడతాం' అన్నాడు బాజిరెడ్డి.

**(ఇంకా వుంది)**

## ఆస్తమా, సైనసైటిస్‌లు మళ్లీ రావు

**ఒక** వ్యక్తికి పడని కారకం ఏదైనా తుమ్ములకు కలిగిస్తుంది. అంటే అలర్జీలన్న మాట. ముఖ్యంగా దుమ్ము, బూజు దులిపినప్పుడు వచ్చే దుమ్ము, పుప్పొడి రేణువులు, పెంపుడు జంతువుల వెంట్రుకలు, ఘాటు వాసనలు, చల్లటిగాలి, చల్లటి నీరు ముక్కులోకి వెళ్లినప్పుడు శరీర రక్షణాత్మక వ్యవస్థతో రియాక్షన్ జరిగి అక్కడ ఉన్న ఐజీఈని ప్రేరేపిస్తుంది. అది హిస్టమైన్‌ను కదిలించి దాని చర్యను ప్రారంభించేలా ఉత్తేజపరుస్తుంది. అప్పుడు తుమ్ములు, కంటిలో నీరు, ముక్కులో వాపు, దురదలు, దద్దుర్లు కనబడతాయి. దీర్ఘకాలం ఈ సమస్య ఉన్నప్పుడు సైనసైటిస్, ఆస్తమాగా మారుతుంది.

**సైనసైటిస్ :** సైనస్‌లు అనేవి కపాలంలో గాలి ధారాళంగా ప్రవహించడానికి, తేమను కొనసాగించడానికి, అనవసరమైన వ్యర్థాలను తీసేయడానికి, కపాలం బరువును తగ్గించడంలో, వాయిస్ రీజన్స్‌లో ముఖ్య పాత్ర వహిస్తాయి. ఎప్పుడైతే ఈ సైనస్‌లు వివిధ కారణాల వల్ల వాచిపోతాయో అప్పుడు వాటిని సైనసైటిస్ అంటారు.

**లక్షణాలు :** తలనొప్పి ఎక్కువగా ఉంటుంది. ఎప్పుడూ పసుపు పచ్చని, ఆకుపచ్చని రంగులో ద్రవం కారుతూ ఉంటుంది. ముక్కు, నోరు నుండి దుర్వాసన వస్తూ ఉంటుంది. జ్వరం, నిద్రలేమి ఉంటుంది. కొన్ని సందర్భాలలో వినికిడి శక్తి తగ్గడం, చెవి నుండి చీము, పంటినొప్పి రావచ్చు.

**హోమియో చికిత్స:** హోమియో మందుల ద్వారా రోగ నిరోధక శక్తిని పెంచి, క్రానిక్ సైనసైటిస్ సమస్యను కూడా శాశ్వతంగా దూరం చేయవచ్చు.

## హెర్పిస్ వైరస్‌కు హోమియోతో చెక్

**అతి** సూక్ష్మమైన వైరస్ హెర్పిస్. జీవితాంతం బాధించే ఈ వైరస్‌ను హెర్పిస్ సింప్లెక్స్ వైరస్ అంటారు. ఇది రెండు రకాలు.

హెచ్ఎస్‌వి 1 : ఇది నోటి దగ్గర పొక్కుల రూపంలో బయటపడుతుంది. పెదవుల చుట్టూ తెల్లని నీటిపొక్కులలాగా కనిపిస్తుంది. ఎక్కువగా పిల్లల్లో కనిపిస్తుంది. సాధారణంగా ఇవి వచ్చిపోతూ ఉంటాయి.

హెచ్ఎస్‌వి 2 : జననావయవాల దగ్గర పొక్కులతో బయటపడుతుంది. దీనినే జెనిటల్ హెర్పిస్ అంటారు. చిన్న చిన్న నీటి పొక్కులలాగా వచ్చి పగిలిపోతుంటాయి. తగ్గినట్టే తగ్గి తిరిగి రావడం జరుగుతుంది.

హెర్పిస్ వైరస్ శృంగారం జరిపే సమయంలో వ్యాప్తి చెందుతుంది. కలయిక సమయంలో చర్మం చిట్లినప్పుడు పుండ్లు, గాయాల ద్వారా ఈ వైరస్ వ్యాపిస్తుంది. శరీరంలోకి ప్రవేశించిన ఈ వైరస్ కొద్దిరోజుల్లోనే ప్రభావం చూపిస్తుంది. రోగిలోని రోగనిరోధకవ్యవస్థ బలహీనపడినపుడు మానసిక ఆందోళన, శారీరక ఆందోళన ఉన్నప్పుడు వాతావరణ పరిస్థితులు మారినపుడు ఏదైనా తీవ్రమైన అనారోగ్య సమస్యలు వచ్చినపుడు సునామిలాగా విజృంభిస్తుంది.

**హోమియో చికిత్స :** హెర్పిస్ వంటి లైంగిక వ్యాధుల నివారణకు హోమియో చికిత్స అద్భుతంగా పనిచేస్తుంది. ఈచికిత్స మూలకారణాన్ని తొలగించే విధంగా ఉంటుంది. సాధారణంగా హెర్పిస్ తగ్గినట్టే తగ్గి మళ్లీ వస్తుంది. అయితే హోమియో చికిత్స అనంతరం వ్యాధి మళ్లీ తిరగబెట్టదు. అనుభవజ్ఞుడైన హోమియో వైద్యుని దగ్గర చికిత్స తీసుకుంటే హెర్పిస్ వ్యాధిని సమూలంగా, శాశ్వతంగా తరిమేయవచ్చు.


**Dr. K Ravikirane**

M.D.,M.sc(psych), P.G(virology)LONDON

గోల్డ్‌మెడల్ ఫర్ ఎక్సలెన్సీ ఇన్ మెడిసిన్

మాస్టర్స్ హోమియోపతి

అమీర్‌పేట్, కూకట్‌పల్లి, దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్,

విజయవాడ, కరీంనగర్, విశాఖపట్నం,తిరుపతి

ఫోన్ : 7842 106 106, 9032 106 106


V6లో ప్రతి మంగళవారం మధ్యాహ్నం 2:30కి

సాక్షిలో ప్రతి శనివారం మధ్యాహ్నం 2:30కి

10టీవీలో ప్రతి ఆదివారం మధ్యాహ్నం 3:30కి డాక్టర్‌గారి లైవ్ కార్యక్రమం ఉంటుంది.



## నడుంనొప్పితో ఎన్నాళ్లు బతుకీడుస్తారు?

**నడుం నొప్పి** ఏ పనీ చేసుకోనివ్వదు. ఈ మధ్యకాలంలో నడుం నొప్పి అనే మాట ప్రతి ఒక్కరి నోటి నుంచి వస్తోంది. కారణం జీవనశైలిలో లోపాలే. సాధారణంగా ఉదయం వేళ నడుం నొప్పి తీవ్రంగా ఉంటుంది. నొప్పి క్రమంగా నడుము నుంచి కాళ్లలోకి విస్తరిస్తుంది. అరుదుగా మూత్రవిసర్జనపై నియంత్రణ కోల్పోవడం జరుగుతుంది. దీర్ఘకాలంగా బాధపడే వారిలో శృంగార సమస్యలు కూడా ఎదురవుతాయి. సరియైన భంగిమలో కూర్చోకుండా పని చేసే వారిలోనూ, గంటల తరబడి కూర్చుని పనిచేసే వారిలోనూ ఈ సమస్య వస్తుంది.

**కారణాలు ఇవీ..**

ఎక్కువగా ఒకే భంగిమలో కూర్చోవడం, స్థూలకాయం, అధిక బరువులను మోయడం, ద్విచక్రవాహనాలు ఎక్కువగా నడపడం వల్ల సయాటికా వచ్చే అవకాశం ఉంది. థైరాయిడ్ సమస్య వల్ల కాల్షియం తగ్గిపోవడం, డిస్క్ మీద ఒత్తిడి పెరిగి రక్తప్రసరణ సరిగ్గా ఉండకపోవడం, అరిగి పోవడంవల్ల ఈ నొప్పి మొదలయ్యే అవకాశం ఉంటుంది.

**హోమియో చికిత్స**

నొప్పి ఏదైనా సమూలంగా తగ్గాలంటే హోమియో చికిత్స ఒక్కటే మార్గం. లుంబార్ స్పాండిలోసిస్, సయాటికా సమస్యలకు హోమియో వైద్య విధానంలో అద్భుతమైన చికిత్స అందుబాటులో ఉంది. హోమియో మందుల ద్వారా నడుము నొప్పి ఒక్కటేకాకుండా ఇతర నొప్పులను పూర్తిగా దూరం చేయవచ్చు. వెన్నుపూసలో జరిగే మార్పులను నివారిస్తూ, కండరాలకు బలం చేకూరే విధంగా చికిత్స ఇవ్వడం వల్ల మంచి ఫలితం ఉంటుంది. అయితే పరిస్థితి పూర్తిగా విషమించి, ఎముకలు పెళుసుగా మారకముందే వైద్యులను సంప్రదించాలి.

## హెపటైటిస్ తగ్గదని ఎవరన్నారు?

**కాలేయ** వ్యాధులలో అత్యంత ప్రాణాంతకమైనది, తెలియకుండా వ్యాపించే జబ్బు హెపటైటిస్. ఈ వైరస్ ముఖ్యంగా రక్తం ద్వారా వ్యాపిస్తుంది. వైరస్ ఉన్న రక్తాన్ని ఎక్కించడం, డ్రగ్స్ అలవాటు ఉన్న వారు ఒకరు ఉపయోగించిన నీడిల్స్ మరొకరు ఉపయోగించడం ప్రధాన కారణంగా చెప్పుకోవచ్చు. తల్లి నుంచి శిశువుకు కూడా సంక్రమించే అవకాశం ఉంది. లైంగిక సంబంధాల ద్వారా కూడా వ్యాపిస్తుంది.ఆకలి లేకపోవడం, వాంతి వస్తున్నట్లుగా ఉండటం, ఒళ్లంత నొప్పులు, మూత్రం పచ్చగా రావడం జరుగుతుంది. లో గ్రేడ్ ఫీవర్, పొట్ట పైభాగంలో నొప్పి, జాండిస్ వంటి లక్షణాలు కనిపిస్తాయి. హెపటైటిస్ బి వ్యాధి చాలా ఆలస్యంగా బయటపడుతుంది. కొన్ని సందర్భాలలో సంవత్సరాల తర్వాత బయటపడవచ్చు. వీరిలో కామెర్ల వ్యాధి తగ్గకుండా అలాగే ఉంటుంది. వాంతులు, ఒళ్లంతా దురదలు, కొన్నిసార్లు విరేచనాలు, కడుపు ఉబ్బరంగాఉండటం, పొట్టలో నొప్పి, రక్తనాళాలు వాచిపోవడం, కిడ్నీకి సంబంధించిన సమస్యలు, ప్లేట్‌లె ట్స్ కౌంట్ పడిపోవడం, తలనొప్పి, రక్తహీనత, రక్తకణాల సంఖ్య క్రమంగా పడిపోవడం జరుగుతుంది.

ఈ వ్యాధి కొన్ని సంవత్సరాల తర్వాత బయటపడినట్లయితే దాన్ని క్రానిక్ ఇన్‌ఫ్లమేషన్ ఆఫ్ లివర్, లేదా క్రానిక్ హెపటైటిస్ అంటారు. దీని వల్ల కామెర్లు వస్తాయి.

**హోమియో చికిత్స**

కాలేయానికి ఉన్న ప్రధాన లక్షణం ఏమిటంటే తనకుతానుగా రికవరీ అయ్యే అవకాశం ఎక్కువగా ఉంటుంది. చనిపోయిన కణాలను మళ్లీ పుట్టించగలదు. హోమియో వైద్యం ఇందుకు అద్భుతంగా పనిచేస్తుంది. హెపటైటిస్‌ను సమూలంగా పారదోలే సత్తా హోమియో మందులకు ఉంది.




# పితృదేవతలు:పూజలు:ప్రభావాలు

**సగరుని యాగాశ్వాన్ని ఇంద్రుడు దొంగిలించాడు. దానిని పాతాళంలోని కపిలముని ఆశ్రమంలో దాచిపెట్టాడు. కనిపించని యాగాశ్వంకోసం సగరపుత్రులు నేలని తవ్వారు. పాతాళంలోనికి ప్రవేశించారు. అక్కడ కపిలముని ఆశ్రమాన్నీ, ఆ ఆశ్రమంలో ఉన్న యాగాశ్వాన్నీ చూశారు. అశ్వాన్ని కపిలమునే దొంగిలించాడనుకున్నారు. ఆగ్రహావేశాలు చెందారు. అతనిపై దాడికి దిగారు.**

తనపై దాడిని కపిలముని తట్టుకోలేకపోయాడు. అవమానంగా భావించాడు. ఆగ్రహోదగ్రుడయ్యాడు. కళ్ళెర్రజేసి సగరపుత్రులను చూశాడతను. అంతే! వారంతా క్షణంలో బూడిదకుప్పలయ్యారు. అయితే వారిలో బర్హికేతువు, సుకేతువు, శూరుడు, పంచజనుడు అనే నలుగురు కొనప్రాణాలతో మిగిలారు.

పుత్రులు బూడిదకుప్పలయ్యారన్న సంగతి తెలుసుకున్నాడు సగరుడు. కపిలమునిని సమీపించాడు. అతన్ని ప్రార్థించి ప్రసన్నుణ్ణి చేశాడు. ఫలితంగా అక్షయకీర్తీ, స్వర్గాలూ వరాలుగా పొందాడు. సగరుని వినయానికి సంతోషించిన కపిలుడు, అతనికి సముద్రుణ్ణి పుత్రునిగా ప్రసాదించాడు. సముద్రుడు అప్పుడు 'సాగరుడు' అయి యాగాశ్వాన్ని తండ్రికి సమర్పించాడు. దాంతో అశ్వమేధాన్ని నిర్వర్తించి, మంత్రి సామంతుల అభినందనలు అందుకున్నాడు సగరుడు. ఆ సగరుని కుమారుడు పంచజనునికి అంశుమంతుడు జన్మించాడు. అతనికి ఖట్వాంగుడు, అతనికి దిలీపుడు, దిలీపునికి భగీరథుడు జన్మించాడు. ఈ భగీరథుడే పరమేశ్వరుని జటాజూటంలో ఉన్న గంగను కిందికి దించి, భూప్రజలను ఆనందపరవశులను చేశాడు. అతని కుమారుడే శ్రుతుడు. అతనికి నాభాగుడు, అతనికి అంబరీషుడు, ఆ అంబరీషునికి సింధుద్వీపుడు జన్మించారు. సింధుద్వీపునికి ఆయుతాయు, అతనికి ఋతుపర్ణుడు జన్మించారు. ఈ ఋతుపర్ణుడు అక్షవిద్యావేత్త. నలమహారాజు ఈతని వద్దనుంచే అక్షహృదయం అన్న విద్యను స్వీకరించాడు. ఋతుపర్ణునికి కల్మషపాదుడు, అతనికి సర్వకర్ముడు, అతనికి అనరణ్యుడు, ఆ అనరణ్యునికి నిఘ్నుడు జన్మించారు. నిఘ్నునికి ఇద్దరు కుమారులు జన్మించారు. పెద్దవాడు అనమిత్రుడు, రెండవవాడు రఘువు. అనమిత్రుడు రాజ్యాన్ని కాదనుకుని అరణ్యాలకి వెళ్లిపోయాడు. తీవ్రతపస్సు ఆచరించసాగాడక్కడ. రఘువు రాజ్యాన్ని స్వీకరించి, ప్రజలను కన్నబిడ్డల్లా పాలించాడు. రఘువు కొడుకే దిలీపుడు. ఈ దిలీపుడే నూరు అశ్వమేధయజ్ఞాలు చేశాడు. ఈ దిలీపునికే రఘువు జన్మించాడు. రఘువు కుమారుడే అజుడు. అతని కుమారుడే దశరథుడు.

ఆ దశరథుని కుమారుడు రాముడే రావణుని సంహరించింది. రామునికి కుశుడు, ఆ కుశునికి అతిథి, అతనికి నిషధుడు, నిషధునికి నలుడు జన్మించారు. రాజులలో ఇద్దరే నలమహారాజులు. ఒకరు వీరసేన కుమారుడు నలమహారాజయితే రెండవవారు ఇక్ష్వాకువంశంలో జన్మించిన నలమహారాజు. ఈ నలునికే నభుడు, అతనికి పుండరీకుడు, అతనికి క్షేమధన్వుడు, ఆ క్షేమధన్వునికి దేవానీకుడు, అతనికి అహీనగణుడు, అతనికి సుధన్వుడు జన్మించారు. ఇది వైవస్వతమనువు వంశక్రమం అని ఆగాడు వైశంపాయనుడు.

తెలిసిన వివరాలకు ఆనందించాడు జనమేజయుడు. అడిగాడిలా.

మునీంద్రా! పితృదేవతల గురువు సూర్యదేవుడు అని నేను ఇంతకుముందు విన్నాను. ఆ వివరాలేమిటి? అలాగే పితృగణాలు ఎవరు? వారిని పూజిస్తే ఎలాంటి ఫలితం కలుగుతుంది? ఆ వివరాలు నాకు తెలియజేయాల్సిందిగా కోరుతున్నాను.

తప్పకుండా చెబుతాను అన్నాడు వైశంపాయనుడు. చెప్పసాగాడిలా.

ఈ పితృదేవతావృత్తాంతాన్ని సనత్కుమారుడు చెప్పగా మార్కండేయుడు విన్నాడు. ఆ మార్కండేయుడు భీష్మునికి చెప్పాడు. భీష్ముడు ధర్మరాజుకి చెప్పాడు. అదే నీకిప్పుడు నేను చెబుతున్నాను. జాగ్రత్తగా విను.

అంపశయ్య మీద ఉన్న భీష్ముణ్ణి సమీపించాడు ధర్మరాజు. చేతులు జోడించి అతనికి నమస్కరించాడు. అడిగాడిలా.

పితామహా! మునీంద్రులకు కూడా పితృదేవతలు పూజ్యులని నేను విన్నాను. ఇది ఎంతవరకూ నిజం. అలాగే తండ్రులూ, తాతలూ తమతమ కర్మలను అనుసరించి మరణించిన తర్వాత ఆయా లోకాల్లో ఉంటూ కూడా పుత్రులు అందించిన పిండాలనూ, పూజలనూ ఎలా గ్రహిస్తారు? వాటి ఫలితాలేమిటి? పితృదేవతలు అంటే తండ్రులూ, తాతలేనా? లేక వేరెవరైనా ఉన్నారా?

ధర్మనందనా! నా తండ్రి శంతనమహారాజు స్వర్లోకం చేరుకున్న తర్వాత నేను శ్రద్ధాభక్తులతో వారికి పిండప్రదానం చేయసంకల్పించాను. ఆ మాట అనుకున్నానో లేదో కంకణాలతోనూ, భుజకీర్తులతోనూ ఒక చెయ్యి భూమి నుండి వెలువడింది. పైపైకి వచ్చింది. అది మా తండ్రిగారి చెయ్యేనన్నది నేను గ్రహించాను. గ్రహించి, దర్భలపై పిండాలు ఉంచానో లేదో నా తండ్రి నా ముందు ప్రత్యక్షమయ్యాడు. నన్ను అభినందించాడు.

నాయనా! వేదోక్తంగా పైతృకర్మ ఆచరించావు. నాకు చాలా ఆనందంగా ఉంది. ఈ ఆనందసమయంలో మృత్యువు నువ్వు చెప్పినట్టు వినేట్టుగా నీకు వరాన్ని ప్రసాదిస్తున్నాను. ఇంకా ఏదైనా కావాలంటే చెప్పు, నీ కోరిక నెరవేరుస్తాను అన్నాడు. అప్పుడు నువ్విప్పుడు నన్ను అడిగినట్టుగానే ఈ విషయాన్నే నా తండ్రిని అడిగాను. ఆయనిలా సెలవిచ్చారు.

నాయనా భీష్మా! పితృదేవతలు దేవతలకు కూడా పూజ్యులే! వారంతా స్వర్లోకంలో దివ్యరూపాలతో విరాజిల్లుతున్నారు. మమ్మల్ని మీరు నామగోత్రాలతో పూజిస్తే ఆ పూజలను మేము అందుకుంటూ ఆనందిస్తున్నాం. ఈ విషయాలను నాకంటే ఇదిగో... ఇక్కడ ఉన్న ఈ మార్కండేయముని సవివరంగా నీకు ఆ రహస్యాలను అందించగలడన్నాడు. అని నా తండ్రి అదృశ్యమయ్యాడు. అప్పుడు మార్కండేయముని చెప్పాడిలా.

భీష్మా! పితృదేవతల పూజల వల్లనే నాకు దీర్ఘాయుష్షూ, విశాలకీర్తీ, మహనీయానందమూ లభ్యమయ్యాయి. పితృదేవతలను కొన్ని వేల ఏళ్ల పాటు పూజించిన అనంతరం నేను మేరుగిరిపై దీర్ఘ తపస్సు ఆచరించాను. కొన్నాళ్లు అక్కడలా గడిచాయి. ఒకనాడు నాకు కొద్దిదూరంలో ఒక విమానం కనిపించింది. సూర్యుడిలా మెరిసిపోతోందది. అందులో అగ్నిజ్వాలలా వెలుగులీనుతూ పురుషుడు ఒకడు

**వైవస్వతమనువు వంశక్రమాన్ని వైశంపాయనుడు చెప్పగా విని ఆనందించాడు జనమేజయుడు. అతడి కోరికమేరకు పితృదేవతావృత్తాంతం కూడా చెప్పసాగాడు. నిజానికి ఈ వృత్తాంతాన్ని ధర్మరాజుకు భీష్ముడు, భీష్ముడికి మార్కండేయుడు, అతడికి సనత్కుమారుడు తెలియజేశారు. అసలు పితృదేవతల్ని ఎందుకు పూజించాలి? బ్రహ్మను పూజించకపోవడంవల్ల దేవతలు ఎలాంటి శాపానికి గురయ్యారు?**

సాక్షాత్కరించాడు. కనిపించిన తక్షణం అతన్ని నేను సమీపించాను. పూజలు చేసి, సాష్టాంగ నమస్కారం చేశాను.

మహాత్మా! నువ్వు ఆదిదేవుడి స్వరూపమేకాని వేరొకటి కాదు. కరుణించి నీ మహిమ నాకు తెలియజెయ్యి అన్నాను. వేడుకున్నానతన్ని. నా వేడుకోలు ఫలించింది. అతడు కరుణించాడు.

మార్కండేయా! నేను బ్రహ్మదేవుని మానస పుత్రులందరిలోనూ పెద్దవాణ్ణి. నన్ను సనత్కుమారుడు అంటారు. పుట్టినప్పటి నుంచి నేను ఇలాగే కౌమార రూపంలో ఉండడంతో నన్ను అంతా 'సనత్కుమారుడు' అంటున్నారు. మరీచాదులు నా సహోదరులు ఏడుగురూ తపోజ్ఞానంలో వారికన్నా మిన్నని నన్ను గౌరవిస్తున్నారు. నువ్వు భృగువంశీయులందరిలోనూ పరమపవిత్రుడివి. నాకోసం చిరకాలం తపస్సు ఆచరించిన కారణంగా నేను నీ ముందు ప్రత్యక్షమయ్యాను. సంకోచించకు! నీకేం కావాలో కోరుకో అన్నాడు.

అప్పుడు నేను పితృగణాల సృష్టీ, వారి పూజాఫలమూ వివరించమన్నాను. సరేనని అతను చెప్ప సాగాడిలా.

మార్కండేయా! తనని సదా అర్చించాలనే సంకల్పంతో దేవతలెందరినో సృష్టించాడు బ్రహ్మ. అయితే వారంతా బ్రహ్మదేవుణ్ణి కాదని, ఇంద్రాది దేవతల కరుణాకటాక్షాలకోసం యజ్ఞయాగాలు ఆరంభించారు. దాంతో తనని అవమానించారని బ్రహ్మ ఎంతగానో బాధపడ్డాడు. ఆ బాధలో వారందరికీ తత్వజ్ఞానం నశించాలని శపించాడు. ఫలితంగా వారంతా జ్ఞానహీనులయ్యారు. లోకాలు మూడూ అజ్ఞానాంధకారంలో మునిగిపోయాయి. దేవతలు ఆ అంధకారాన్ని భరించలేక తిరిగి బ్రహ్మదేవుణ్ణి ఆశ్రయించారు. అతన్ని శరణు వేడారు. అప్పుడు బ్రహ్మ అన్నాడిలా.

దేవతలారా! మీరు నాకు చాలా అపకారం చేశారు. అయినా మిమ్మల్ని నేను క్షమిస్తున్నాను. క్షమిస్తున్నాను కాని, మీరు ఇందుకు ప్రాయశ్చిత్తం చేసుకోక తప్పదు. ప్రాయశ్చిత్తం చేసుకుంటేనే మీకు సుజ్ఞానం లభిస్తుంది. అయితే ప్రాయశ్చిత్తం ఏ విధంగా చేసుకోవాలో మానవలోకంలో మీకు మీ కుమారులే చెబుతారు. వారు చెప్పినట్టుగా నడుచుకోండి! వెళ్ళిరండి!

బ్రహ్మదేవుని ఆజ్ఞమేరకు దేవతలంతా మనుజలోకానికి చేరుకున్నారు. కుమారులను సమీపించారు. తమకు విజ్ఞానాన్ని దానం చేయమని వేడుకున్నారు.

మీరు మనసా వాచా కర్మణా చేసిన పాపాలకు శుభకర్మాచరణం చెయ్యడమే తగిన ప్రాయశ్చిత్తమన్నారు కుమారులు. కర్మకాండ పరమార్థం ఆ రకంగా తెలిసినంతనే వారందరికీ తిరిగి పూర్వవిజ్ఞానం లభించింది. అప్పుడు దేవతలను ఉద్దేశించి మానవులు ఇలా అన్నారు.

కుమారులారా! మీరు మళ్ళీ విజ్ఞానులయ్యారు. వెళ్ళిరండి.

తమను మానవులు 'కుమారులు' అనడాన్ని దేవతలు తట్టుకోలేకపోయారు. బాధపడ్డారు. ఆ బాధను వెళ్లబోసుకునేందుకు తిరిగి బ్రహ్మను సమీపించారు.

బ్రహ్మదేవా! మానవులు మమ్మల్ని కుమారులని సంబోధించి కించపరిచారు. దీనికి కారణం ఏమిటి? అనడిగారు. అందుకు బ్రహ్మ ముందు సన్నగా నవ్వి, తర్వాత అన్నాడిలా.

మీకు మనుజులు ప్రజ్ఞానం ప్రసాదించిన కారణంగా మీకు వారు తండ్రులయినారు. ఈ కారణంగానే మిమ్మల్ని వారు కుమారులని సంబోధించారు. అయితే మీరు మనుజులకు శరీరాలను ప్రసాదించి, వారికి జనకులయిన కారణంగా మీకు పితృత్వం సిద్ధించింది. ఇలా ఒకరికొకరు దేవతలే గాక, పితరులై ముల్లోకాల్లోనూ పూజలందుకోండి.

అలా బ్రహ్మదేవుడు చెప్పిన మీదట దేవతలు మళ్లీ మనుజులను సమీపించారు. చెప్పారిలా.

మాకు పూజలు చేసి లోకపూజ్యులుకండి. పితృదేవతలను పూజించినవారికి సమస్తసంపదలూ సమకూరడమేకాదు, పరలోకసౌఖ్యాలు కూడా ఇట్టే అందుతాయి. మా సంతోషం మీకు శుభదాయకం.

అని ముగించాడు సనత్కుమారుడు. అది విని మహదానందం చెందాడు మార్కండేయుడు. తర్వాత అడిగాడిలా.

సనత్కుమారా! పితృదేవతల గణాలెన్ని? వారు ఏయే లోకాల్లో నివసిస్తున్నారు? ఆ వివరాలు తెలియజేయగలవు.

సరేనన్నట్టుగా సన్నగా నవ్వుతూ చెప్పసాగాడిలా సనత్కుమారుడు.

మార్కండేయా! వైరాజులు అన్న పితరుల గణాలు మూడు ఉన్నాయి. ఈ వైరాజులు విరాజు అన్న ప్రజాపతి కుమారులు. వారు శుభంకరులు. స్వరూపశూన్యులు. ఈ మూడుగణాల పితరులూ దివ్యలోకంలో సంచరిస్తున్నారు. వారి మానసాలవల్ల మేనక అన్న కన్య జన్మించింది. ఆమె హిమవంతుని భార్య అయింది. ఆ మేనకకు మైనాకుడనీ, క్రౌంచుడనీ ఇద్దరు కుమారులు జన్మించారు. అపర్ణ, ఏకపర్ణ, ఏకపాటల అని ముగ్గురు కుమార్తెలు కూడా జన్మించారు. ఈ కుమార్తెలు ముగ్గురూ పరమ భయంకరమైన తపస్సు చేయసాగారు. ఏకపర్ణ వేయి సంవత్సరాలకు ఒక వటపత్రాన్ని ఆహారంగా తీసుకుంటే, ఏకపాటల ఒక్క పాటలపుష్పాన్ని ఆహారంగా తీసుకునేది. అలా పదివేలసంవత్సరాలపాటు తపస్సు ఆచరించారు. అపర్ణ అయితే ఈ పదివేలసంవత్సరాలూ ఒక్క ఆకును కూడా ముట్టలేదు. అంతలా అపర్ణ తపస్సు చేయడాన్ని మేనక తట్టుకోలేకపోయింది. తీవ్రంగా దుఃఖించింది.

వద్దమ్మా అన్న అర్థంతో 'ఉమా' అని పదేపదే హెచ్చరించింది. ఆ కారణంగానే అపర్ణకు ముల్లోకాల్లోనూ 'ఉమా' అన్న పేరు ప్రసిద్ధమైంది.

సుదీర్ఘతపస్సు అనంతరం ఆ ముగ్గురు కన్యలూ శాశ్వతబ్రహ్మచర్యంతో, అద్భుతయోగశక్తితో అందరిచేతా పూజలందుకున్నారు. పెద్దదైన అపర్ణ లోకైకజనకుడైన ఆ మహాదేవునికే భార్య అయింది. లోకపూజ్యురాలైంది. ఆ పరమేశ్వరికి కృత్రిమంగా పుట్టిన శుక్రుడు యోగాచార్యుడు అన్న విశేషఖ్యాతి గడించాడు. రెండవకన్య ఏకపర్ణ అసితునికి భార్య అయింది. ఓ కుమారుణ్ణి కన్నది. అతనిపేరు దేవలుడు. మూడవ కన్య ఏకపాటల జైగీషుడు అన్న మహామునికి భార్య అయింది. శంఖలిఖితులని ఇద్దరు కుమారులను కన్నది. ఈ కుమారులంతా లోకంలో యోగవిద్యను పెంపొందించారు.

-అరణి





# ప్రేమా? ఆకర్షణా!?

**టీనేజ్...ఏమైనా చేయగలం..ఏదైనా చేసేయగలం అనుకుంటారు టీనేజర్లు. తల్లిదండ్రులకు అసలేమీ తెలియదు..ఏది చేసినా మాదే కరెక్ట్. ఈకాలానికి అనుగుణంగా మేము అప్‌డేట్ అయిపోయాం... ఇలాగే ఆలోచిస్తుంటారు.**

**వీలైతే ప్రేమిద్దాం డూడ్ పోయేదేముంది అని ఒకడంటాడు. ప్రేమ ఉంటే అన్నీ ఉన్నట్లే అని ఇంకొకడంటాడు. అందం ఉంది, ఆస్తి ఉంది, మంచితనం ఉంది నన్ను ప్రేమించడానికి ఇంకేం కావాలి? అని ప్రశ్నిస్తుంది మరో అమ్మాయి.**

మరి తల్లిదండ్రులు, టీచర్లు మాత్రం, ఈ ఏజ్‌లో పుట్టేది ప్రేమ కాదు ఆకర్షణ అంటారు. అందంచూసి అట్రాక్టవుతున్నారు అంటారు.

ప్రేమిస్తే తప్పేలా అవుతుందని పిల్లలు అంటుంటే, అది అసలు ప్రేమే కాదు ఆకర్షణ అని పెద్దలు అంటున్నారు. ఇలా ఒకరు తప్పు అనీ, ఒకరు ఒప్పు అనీ అంటున్నారు.

టీనేజ్ అనగానే మనకు మొదట గుర్తుకు వచ్చేది ఆకర్షణ, ప్రేమ, రొమాన్స్. ఆ వయసులో హృతిక్‌రోషన్ దొరికినా సరే ఇంకా అందగాడు కావాలనుకుంటారు; ఐశ్వర్యారాయ్ వచ్చినా, అమ్మాయి ఇంకా బాగుండాలి అనుకుంటారు. ప్రతి ఒక్కరి జీవితంలో టీనేజ్ అనేది చాలా ముఖ్యమైనది. దాన్ని ఎంజాయ్ చేయాలి, తప్పుకాదు, కానీ ఏం చేసినా చేసేముందు ఒకటి రెండుసార్లు ఆలోచించాలి.

సజాతి ధృవాలు వికర్షించుకుంటాయి, విజాతి ధృవాలు ఆకర్షించుకుంటాయనే సంగతి మనందరికీ తెలిసిందే! టీనేజ్‌లో ఉండేవన్నీ ఆకర్షణలే! అన్నీ ఊహలే!

జస్ట్ పగటి కలలు కనడం... లాంటిదన్నమాట. 'ఒకరిపై ఒకరు అట్రాక్షన్‌తో చేసే పనులు, పుట్టే ప్రేమలు వందలో తొంభైతొమ్మిది శాతం ఫెయిల్ అవుతాయి. ఏదో ఒక్కశాతమే సక్సెస్ కావచ్చు.'

'కొత్తబంగారులోకం' సినిమాలో రావురమేష్ కూడా ఇదే విషయం చెబుతాడు. టీనేజ్‌లో కలిగే ప్రేమ, ఆకర్షణలమీద ఈరోజుల్లో నానారకాల సినిమాలు వస్తూండటం చూస్తూనే ఉన్నాం. టీనేజర్ల ఉద్వేగాన్ని సరిగ్గా పట్టుకోగలిగినవారు, పర్‌ఫెక్ట్‌గా దాన్ని సినిమాగా తీయగలిగినవాళ్ల కోట్లు గడిస్తుంటే, అది చేతకాని వాళ్లు కుదేలై పోతున్నారు. అయితే వాళ్లు డబ్బులు సంపాదించడం సంపాదించకపోవడం తర్వాత విషయం ఈ ఆకర్షణల మత్తులో టీనేజ్ సమయాన్ని వృథా చేసుకుంటున్నారన్నది మాత్రం అంగీకరించాల్సిన వాస్తవం.

### ఆకర్షించాలనేదే ప్రధానం

అందం ద్వారా ఆకర్షించాలనేది కేవలం మనుషుల మధ్యే కాదు ప్రకృతి మధ్య కూడా జరుగుతుంది. మొక్కలు వివిధ రకాల రంగుల్లో ఆకర్షణీయంగా విచ్చుకుని, కీటకాలను పరాగ సంపర్కానికి ఎలా ఆకర్షిస్తాయో, జంతువులు వింతైన అరుపుల ద్వారా ఇతర జంతువులను ఎలా ఆకర్షిస్తాయో, పిట్టలు, కోయిలలు లాంటి పక్షులు తమ రంగురంగుల ఈకల్ని, మృదువైన, మధురమైన కూజితాల ద్వారా జత పిట్టల్ని దగ్గరికి ఆహ్వానించుకుని సంతానక్రియను ఎలా పెంపొందించుకుంటాయో, అదేవిధంగా టీనేజ్‌లో పిల్లల మధ్య కూడా పరస్పర ఆకర్షణ కలుగుతుంది.

ఈ వయసులో ఉండే పిల్లలకు ఆపోజిట్ జెండర్‌ను ఆకర్షించాలనే తాపత్రయం ఎక్కువగా ఉంటుంది. ఆడపిల్లలు మగపిల్లల్ని, మగపిల్లలు ఆడపిల్లల్ని ఆకర్షించాలనీ, ఆహార్యం చూసి మెచ్చుకుంటుంటే మరీ మరీ పొగిడించుకోవాలనీ అనిపిస్తుంది. అందుకోసం వారు ఏం చేయడానికైనా సిద్ధమవుతుంటారు. ఆకర్షించడానికి ప్రత్యేకంగా రెడీ అవుతుంటారు. మగపిల్లలతో పోలిస్తే ఆడపిల్లల్లో ఇది మరీ ఎక్కువ! అందుకే ప్రత్యేకంగా అలంకరణలపట్ల, డ్రెస్సులపట్ల ఆడపిల్లలు మహామోజు చూపిస్తారు. మొదటి నుంచీ ఆడపిల్లలు సుతారంగా, సుకుమారంగా తల్లిదండ్రుల మెప్పుకోసం, వారి గారాబం కోసం ఆశపడుతుంటారు. అయితే టీనేజ్‌లోకి వచ్చాక కూడా వారిలాగే ఉంటారు కానీ తమ అందచందాలను తల్లిదండ్రుల మెప్పుకోసం కాకుండా అబ్బాయిల మెప్పుకోసం, తోటి ఆడపిల్లల ముందు అందంగా కనపబడడం కోసం చేస్తుంటారు. అసలు అబ్బాయిల మెప్పుకోసం కంటే తోటి ఆడపిల్లలతో 'నీకంటే అందంగా ఉన్నాను' అనిపించుకోవడానికే అందంగా తయారవుతారని చెప్పొచ్చు. అందుకే టీనేజ్ ఆడపిల్లలు అలంకరణపట్ల మహామోజు చూపిస్తారు.

ఆడపిల్లతో పోలిస్తే మగపిల్లవాడు కాస్త విభిన్నంగా తన బాడీ ఫిట్‌నెస్, సామర్థ్యం చూపించాలనే మోజులో ఉంటాడు. మంచి కండరాల



సౌష్టవంతో ఉండాలనుకుంటాడు. ఆ కండల సౌష్టవాన్ని అమ్మాయిల ముందు ప్రదర్శించాలనుకుంటాడు. అందుకే ఈవయస్సు కుర్రవాళ్లు సినిమాలలో అందంగా ఉండే హీరోలను, విలన్లనూ అభిమానిస్తుంటారు. వాళ్లలాగే ఉండాలనుకుని, మనసులో తమను వాళ్లతో పోల్చుకుంటుంటారు. ప్యూబర్టీ దశలో ఈ ఆకర్షణలకోసం జతగాళ్లతో గ్యాంగ్ కూడా ప్రారంభిస్తారు. ఈగ్యాంగ్ ఎందుకంటే తోటి కుర్రవాళ్లను, ఆడవాళ్లను మిగతా విషయాల్లో అధిగమించి గ్యాంగ్‌కి లీడర్‌గా ఉండాలని, వాళ్లచేత గొప్ప అనిపించుకోవాలనే ప్రయత్నమే. ఏదేమైనాసరే టీనేజ్‌లో అబ్బాయిలు చేసే ఈరకమైన చేష్టలన్నీ ఆడపిల్లల్ని ఆకర్షించేందుకే.

### శృంగారం పట్ల ఉత్సుకత

ఆకర్షించాలనే తాపత్రయంతో చాలామందికి ఈ వయసులో శృంగారంపట్ల ఉత్సుకత కూడా పెరుగుతుంది. అమ్మాయిలతో పోలిస్తే అబ్బాయిలలో ఇది ఎక్కువగా ఉంటుంది. టీనేజ్ ఆడపిల్లలు అందంగా కనిపించి తోటి మగపిల్లల్ని, ఆడపిల్లల్ని ఆకర్షించాలనే ప్రయత్నిస్తారు. కేవలం పొగడ్తలు, ప్రశంసల కోసమే వారిలాంటి ఆకర్షణ యత్నాలు చేస్తారు. ఒకవేళ పొరబాటున అబ్బాయిలు ఏమైనా శృంగారపరమైన ప్రస్తావనలు తీసుకువస్తే అవమానంగా భావిస్తారు. కోపంతో తిరస్కరిస్తారు. ఇక జీవితంలో వారి మొహం కూడా చూడరు.

ఆడపిల్లలు లోపల కోరికలు దాచుకుని పైకి అలా తిరస్కరిస్తారనుకుంటే పొరపాటే. ఆడపిల్లలు మనస్ఫూర్తిగా ఇలాంటి పనులు తిరస్కరిస్తారు. కేవలం కుర్రవాళ్లను ఆకర్షించాలనే తాపత్రయమే! అయితే ఆడపిల్లలు ఇక్కడో విషయం గమనించాలి.

**అతిరూపాత్ హృతాసీతా అతిదర్పాచ్చ రావణాః**
**అతిదానాత్ బలర్బద్ధః అతి సర్వత్ర వర్జయేత్!**

అందం అతిగా ఉండడంతో సీత అపహరణకు గురైంది. అతిగా గర్వించి రావణాసురుడు నశించిపోయాడు. అతిగా దానంచేసి బలి బందీ అయ్యాడు. అందుకే 'అతి' అన్ని చోట్లా హానికరం అని పెద్దలు చెబుతారు.

అలాగే లిమిట్స్‌దాటి అతిగా చేస్తే ఎవరైనా సరే చిక్కుల్లో పడతారనేది గమనించుకోవాలి. తమ వయస్సు మగపిల్లల్ని అంటే పదహారేళ్ళవాళ్లను ఇలా రెచ్చగొడితే పర్వాలేదు, అది వయసు ప్రభావం కానీ అంతకంటే ఎక్కువ వయసు వాళ్లను రెచ్చగొడితే ప్రమాదమేనని వారు గ్రహించాలి.

### పీపింగ్‌టామ్ మనస్తత్వం

పదహారేళ్ల కుర్రకారులో కనిపించే ముఖ్య లక్షణం సెక్స్ పట్ల క్యూరియాసిటీ. అమ్మాయిలలో దీనిపట్ల తక్కువ ఇష్టత ఉన్నా అబ్బాయిలకు ఎక్కువ ఉంటుంది. ఈ వయస్సులో మగపిల్లలు స్నానం చేస్తున్న లేదా బట్టలు మార్చుకుంటున్న ఆడవాళ్లను చూడడానికి మహా తహతహలాడుతుంటారు. ఆడవాళ్లు స్నానంచేస్తుంటే ఆ బాత్‌రూంకి ఏమైనా చిల్లులు ఉంటే అందులోంచి తొంగి చూడాలన్న తాపత్రయం వేధిస్తుంటుంది. దీనినే పీపింగ్‌టామ్ మనస్తత్వం అంటారు. ఒకవేళ ఏ పిల్లవాడైనా అలా కనిపిస్తే తప్పుకదూ అని వారిని మందలించి చూసీ చూడనట్లుగా ఊరుకోవడం మంచిది. ఒకవేళ ఆ ఉదాసీనతను చూసి అతను మళ్లీ మళ్లీ చొరవ తీసుకుని చేస్తుంటే మాత్రం తరుణోపాయం అవసరం. ముఖ్యంగా అలాంటి పరిస్థితికి అతను దూరంగా ఉండేట్లు చూడాలి. మగపిల్లల్లో సెక్స్ పట్ల క్యూరియాసిటీ ఎనిమిది, తొమ్మిది సంవత్సరాల వయసులో కూడా ఉంటుంది. కానీ అప్పుడు క్యూరియాసిటీకి టీనేజ్ క్యూరియాసిటీకి చాలా తేడా ఉంది. బాల్యంలో క్యూరియాసిటీ శరీర నిర్మాణానికి సంబంధించింది. అంటే వారి శరీర నిర్మాణానికి ఆడపిల్లల శరీర నిర్మాణానికి తేడా ఏంటి? అని తెలుసుకోవాలని అనుకుంటుంటారు. అయితే టీనేజ్‌లో కనిపించే క్యూరియాసిటీ వేరు ఇందులో లైంగికతత్వం ఉంటుంది. లైంగికంగా ఆడపిల్లల అవయవాలు ఎలా పని చేస్తాయో తెలుసుకోవాలన్న తాపత్రయం ఉంటుంది. ఆడపిల్లలకు పిల్లలు ఎలా పుడతారో, అలా పుట్టడంలో పురుషులపాత్ర ఏమిటో ఎలా ఉంటుందో తెలుసుకోవాలనే క్యూరియాసిటీ ప్రదర్శి స్తారు. ఈ క్యూరియాసిటీని అసాధారణమైనదిగా భావించకూడదు. అయితే సైన్స్‌పరంగా ఆ విషయాలు వారికి విడమర్చి చెప్పాలి కూడా!

మనది ప్రేమా? ఆకర్షణా? చేసేది తప్పా? ఒప్పా? అనే గందరగోళం టీనేజ్‌లో ఉంటుంది. కానీ ఆ విషయాలు ఎవరితోనూ పంచుకోడానికి వారి మనసు అంగీకరించదు. ఇతరులతో చెప్పుకుంటే ఏమవుతుందో, ఏమంటారో అనుకుంటారు. ఆకర్షణలవల్ల వారిలో చెలరేగే లైంగిక భావనలను కూడా నియంత్రించుకోలేకపోతుంటారు. అలాంటి టీనేజ్ టెంప్టేషన్స్‌కి ఈ క్రమంలో కొంతవరకు అడ్డుకట్ట వేయవచ్చు. అదెలాగో ముందు ముందు చూద్దాం!

**- లతాకమలం**
lathakamalam@gmail.com

## ఆకర్షణలతో జాగ్రత్త!



**యు**క్తవయసుకు వచ్చిన యువతీయువకుల్లో సెక్స్ గురించి తెలుసుకోవాలనే విపరీతమైన కోరికలు ఉంటాయి. యవ్వనం తెచ్చిన కొత్త అందాల్ని ఆస్వాదించాలని యుక్తవయసులో కోరుకుంటారు. ఈదశలో అబ్బాయి, అమ్మాయి మధ్య స్నేహం కేవలం స్నేహంగా మాత్రమేకాక ఆకర్షణకు లోనై శారీరక సంబంధాలకు సైతం దారితీస్తుంది. అయితే కొందరు కోరికలకు గట్టిగా పగ్గాలువేస్తారు. మరికొందరు మాత్రం సెక్స్ సుఖం అనుభవించాలని కోరుకుంటారు. ఒకవేళ కోరికలు అవధులు దాటేసిన తర్వాత ఆ ఆకర్షణ కాస్తా ఆవిరైపోతుంది. అటు కెరీర్‌కి నష్టం వాటిల్లుతుంది. వీటన్నింటినీ దృష్టిలో పెట్టుకుని యువతీయువకులు నడుచుకోవాలి.

## నగరాల్లోనే ఎక్కువ!



**టీ**నేజ్‌లో యువతీయువకుల మధ్య ఆకర్షణ సహజం. ఈ ఆకర్షణను ప్రేమగా భావించే వారు ఇదివరకు చాలా తక్కువమందే ఉండేవారు. కానీ ఇప్పుడు సినిమాలు, సోషల్ మీడియా ప్రభావంవల్ల ఈ ఆకర్షణనే ప్రేమగా భావించి దానికోసం తల్లిదండ్రులను కూడా ఎదిరించి, తెలిసీతెలియని వయసులో ఆకర్షణలకు లోబడి తప్పులు చేస్తున్నవారు ఎక్కువమందే ఉంటున్నారు. తల్లిదండ్రులు మందలిస్తే ఆత్మహత్యలు చేసుకుంటున్నారు. ఈ విషయంపై ఒక సంస్థ అధ్యయనం నిర్వహించింది. ఇలా ఆత్మహత్యలకు పాల్పడేవారిలో ఎక్కువమంది ప్రముఖ నగరాల్లో ఉండే పిల్లలే అని వెల్లడైంది.

# రెండు కళ్ళు

-దూరి వెంకటరావు

**“స్వప్నా! లేమ్మా ఎంత పొద్దెక్కిందో చూడు, లేచి మొహం కడుక్కో కాఫీ తాగుదువు గాని” మురిపెంగా తల నిమురుతూ నిద్రలేపింది దీపిక.**

**కిమ్మనకుండా లేచికూర్చుంది స్వప్న. అదే మునుపైతే నిద్రలో ఉండగా లేపినందుకు ఉవ్వెత్తున ఎగిరిపడేది. నోటికొచ్చిన తిట్లు తిట్టేది. ఇప్పుడున్న పరిస్థితివేరు. ఎవరి అండా లేకుండా ఏపనీ చేసుకోలేని నిస్సహాయస్థితి తనది. మౌనంగా లేచి ఒంటి కాలిమీద నిలబడింది.**

చంకకింద ఊతకర్ర ఉంచి నెమ్మదిగా నడిపిస్తూ స్వప్నని బాత్‌రూంకు తీసుకెళ్లి బ్రష్ చేయించింది దీపిక. అక్కడనుంచి తిన్నగా గదిలోకి తీసుకొచ్చి కుర్చీలో కూర్చోబెట్టి కాఫీకప్పుతో పాటు ఆరోజు పేపరు కూడా చేతికిచ్చింది.

కాఫీతాగుతూ దీపికవంక ఆర్తిగా చూసింది స్వప్న. ఆమెకు మాటలు రావడంలేదు. దీపిక లేకుండా తనిప్పుడు అడుగు ముందుకు వేయలేదు. లేచిన దగ్గరనుంచి రాత్రి పడుకునేవరకు అన్ని పనులు ఆమె సాయంతోనే జరగాలి. లేకుంటే తను జీవచ్ఛవమే. మొన్నటివరకు తనామెను ఎంతగా క్షోభ పెట్టింది? అయినా అవేమీ పట్టించుకోకుండా ప్రేమగా తనకు సపర్యలు చేస్తోంది. ఆమెనుచూస్తే మనిషిలో ఇంత సహనగుణం ఉంటుందా? అనిపించింది. నిజం చెప్పాలంటే తనూ, దీపికా రక్తం పంచుకుపుట్టినవాళ్లు కాదు.

తాగిన కాఫీకప్పు బల్లమీదపెట్టి పేపర్లో తల దూర్చింది. ఆమెకు అక్షరాలు కనిపించడంలేదు. మనసంతా గజిబిజిగా ఉంది.

•••

భానుప్రకాశ్‌కి ఉన్న ఊళ్లోనే ఉద్యోగం. ప్రైవేటు కొలువు. జానాబెత్తెడు జీతమే అయినా దినమంతా గాడిదచాకిరీ తప్పడంలేదు. ఐశ్వర్యను పెళ్ళాడి ఐదేళ్ళవుతోంది. ఇంతవరకు పిల్లలు కలగలేదు. ఇంట్లో తను, ఐశ్వర్యతప్ప మూడోవ్యక్తి లేరు. ఒంటరిగా ఉంటున్న ఐశ్వర్యకు ఏం తోచకపోవడం వల్ల గుళ్లూగోపురాల చుట్టూ ప్రదక్షిణలు చేయడం నిత్యకృత్యమై పోయింది. ఎప్పటికైనా ఆ పరమేశ్వరుడు తనను కరుణించకపోతాడా, ఓ నలుసుని ప్రసాదించకపోతాడా అన్నదే ఆమె ఆశ.

‘ఎందుకైనా మంచిది ఓమారు డాక్టర్ దగ్గరకెళ్లి ఉభయులు పరీక్షలు చేయించుకుంటే బావుంటుంది” ప్రకాశ్‌కి సలహా ఇచ్చారు సన్నిహితులు.

వాళ్లమాట ఎందుకు కాదనాలని ఓరోజు భార్యను గవర్నమెంట్ హాస్పిటల్‌కు తీసుకెళ్లాడు ప్రకాశ్.

పరీక్షలుచేసి ఇరువురిలో ఏలోపం లేదని తేల్చేశారు వైద్యులు.

డౌటు తీరిపోవడంతో హమ్మయ్య అనుకుని ఊపిరి పీల్చుకున్నారు ప్రకాశ్ దంపతులు. ఇవాళ కాకుంటే రేపైనా తల్లిని కాలేకపోతానా అనుకుంది ఐశ్వర్య.



ఇరువురూ డాక్టర్ దగ్గర సెలవు తీసుకుని వెళ్ళిపోతుండగా ప్రసూతివార్డులో పెద్దగా కేకలు వినిపించాయి.

ఠక్కున ఆగిపోయారు ఇద్దరూ.

ఇద్దరు ఆడపిల్లలకు జన్మనిచ్చిన భార్యపై శివమెత్తినట్టున్నాడు భర్త. పాపం ఆ ఇల్లాలు మాత్రం ఏం చేస్తుంది? ఇంగితం లేకుండా ఆవిడ మీద ఎగిరెగిరి పడుతున్నాడు.

"ఏవండీ! మనకెలానూ పిల్లలు లేరు, ఆ మూర్ఖుడెవరో ఇద్దరాడపిల్లలు పుట్టారని తెగ రంకెలు వేస్తున్నాడు. పోనీ మనం ఓ పిల్లని పెంచుకుంటామంటే ఇస్తాడేమో అడిగి చూడరాదూ" అభ్యర్థనగా అంది ఐశ్వర్య.

"నీ పిచ్చిగాని ఎవరినో పెంచుకున్నంత మాత్రాన ఆ పిల్ల మన బిడ్డైపోతుందా? మనకింకా సంతానం కలిగే అవకాశం ఉందంటున్నారు డాక్టర్లు. అలాంటప్పుడు ఈ పెంచుకోవడాలవీ ఎందుకు చెప్పు" భార్యమాట కొట్టిపారేశాడు ప్రకాశ్.

అయినా ఐశ్వర్య ఊరుకోలేదు. మరింత ఒత్తిడి చేసింది. అర్థాంగి ఆర్డరు. ఏం చేస్తాడు? చచ్చినట్లు ఒప్పుకోక తప్పిందికాదు. వెళ్ళి బిడ్డకోసం వాళ్లను సంప్రదించాడు.

ప్రకాశ్ అడగడమే ఆలస్యం 'అంతకన్నా నాకు కావలసిందేముంది. కనీసం ఓ దరిద్రమైనా వదులుతుంది, నిరభ్యంతరంగా తీసుకెళ్లండి అంటూ ఓ బిడ్డను అతడి చేతిలో పెట్టాడా పెద్ద మనిషి. అదివరకే అతగాడికి ఇద్దరు ఆడపిల్లలు ఉన్నారట. అదీ వాడి బాధ.

పాపని భార్య చేతికందించాడు ప్రకాశ్. పసిపాప ఒడి చేరేసరికి ఊరంత సంబరపడిపోయింది ఐశ్వర్య.

నాటినుంచి ఆ చిన్నారిని దీపిక అని పిలుస్తూ అల్లారుముద్దుగా పెంచుకోసాగారు ప్రకాశ్ దంపతులు.

దీపికకు రెండేళ్లు నిండాయో లేదో నెల తప్పింది ఐశ్వర్య.

ఇల్లాలు గర్భవతి అని తెలిసి ఆనందంతో ఉక్కిరిబిక్కిరయ్యాడు ప్రకాశ్.

చూస్తుండగానే ఐశ్వర్య ప్రసవించడం ఓ ఆడపిల్లకి జన్మనివ్వడం ఇట్టే జరిగిపోయాయి.

కాస్త ఆలస్యంగానైనా తమ కలలు పండించిన ఆపాపకి స్వప్న అని పేరు పెట్టుకున్నారు ఆ దంపతులు. తనకు ఇద్దరు ఆడపిల్లలని మురిసిపోతూ వాళ్లని అల్లారుముద్దుగా సాకుతోంది ఐశ్వర్య.

తొందరపడి దీపికని నెత్తినెక్కించుకున్నానేమో అనుకుని తెగ బాధపడిపోయాడు ప్రకాశ్.

ఐశ్వర్య పిల్లలిద్దర్నీ రెండు కళ్ళల్లా భావించి ఎంతో ప్రేమగా చూసుకుంటున్నా ప్రకాశ్‌లో మాత్రం భేదభావం కొట్టొచ్చినట్లు కనబడుతోంది.

భర్త ప్రవర్తనకు బాధపడింది ఐశ్వర్య. 'మీ తీరు నాకేం నచ్చడంలేదు. కడుపునపుట్టిన బిడ్డని ఒకలాగా, పెంపుడు పిల్లను మరోలా చూడకూడదు, మనకు ఇద్దరాడపిల్లలనుకోవాలి ' అంటూ నచ్చచెప్పింది.

అయినా అతగాడిలో మార్పు రాలేదు. స్వప్న పుట్టకముందు దీపికని భుజాన ఎక్కించుకుని ఊరంతా తిప్పినవాడు ఇప్పుడు ఆ పిల్లని కనీసం ముట్టనైనా ముట్టడం లేదు. స్వప్నే లోకమైపోయిందతనికి. సందర్భం ఉన్నా లేకున్నా ఆపిల్లకు ఖరీదైన దుస్తులు కొంటాడు. అదే దీపికకైతే తప్పదన్నట్లు ఏ పండక్కో పబ్బానికో పేవ్‌మెంట్ మీద దొరికే నాసిరకం డ్రస్సులు పట్టుకొస్తాడు. స్వప్న పుట్టినరోజునాడు పదిమందినీ పిలిచి ఎంతో ఆర్భాటంగా ఆ పిల్లచేత కేక్ కట్ చేయిస్తాడు. దీపిక పుట్టినరోజును అసలు పట్టించుకోడు. అయినా పాపం ఆ అమాయకురాలు ఏమాత్రం బాధపడదు. పైగా చెల్లాయి బర్త్‌డే అని మురిసిపోతూ వచ్చిన వాళ్లందరికీ స్వీట్లు పంచుతుంది.

తండ్రి తనకిస్తున్న ప్రాధాన్యం అక్కకి ఇవ్వకపోవడంచూసి ఏమనుకుందో ఏమో తను కూడా దీపికను చిన్నచూపు చూడడం, కసురుకోవడం మొదలుపెట్టింది స్వప్న.

దీపిక టెన్త్ క్లాసికి వచ్చేసరికి నేనిక చదివించలేనంటూ ఆ పిల్లని బడి మాన్పించేశాడు ప్రకాశ్. ఇంట్లోనే ఉండి తల్లికి పనిపాట్లలో సాయపడమన్నాడు.

రోజులు దొర్లుతున్నాయి. ఋతువులు మారు తున్నాయి. కాలం దానిపని అది చేసుకుపోతోంది.

ఉన్నట్లుండి ఏదో జబ్బుచేసి చనిపోయింది ఐశ్వర్య. తల్లిపోయిన దగ్గరనుంచి ఇంటిపని దీపిక మీదే పడింది. అయినా తన మీద తండ్రికి కనీస సానుభూతిలేదు. రాను రాను స్వప్నకూడా ఆమెనో పనిమనిషిలా చూడసాగింది. మాటిమాటికీ తనమీద పెత్తనం చెలాయిస్తోంది. అంతేనా? ఏ రాత్రికో ఇంటికొచ్చిన తండ్రికి అక్కమీద లేనిపోని చాడీలు చెప్పేది.

తనని ఎంత చీదరించుకున్నా ఆమెను చెల్లీ చెల్లీ అంటూ ప్రేమగా పిలుస్తూ ఆమెకు కావల సినవన్నీ క్షణాల్లో సమకూర్చిపెట్టేది దీపిక.

స్వప్న డిగ్రీ పూర్తిచేయగానే ఆపిల్లకి సంబంధాలు చూడడం మొదలు పెట్టాడు ప్రకాశ్.

ఈ క్రమంలో అమ్మాయిని చూడడానికి పెళ్ళివారు వచ్చారు. అబ్బాయి సాఫ్ట్‌వేర్ ఇంజనీరు. మావాడికి పిల్ల నచ్చితేచాలు కట్నకానుకలతో పని లేదన్నారు అబ్బాయి తల్లిదండ్రులు.

రొట్టె విరిగి నేతిలో పడ్డట్టైంది ప్రకాశ్‌కి. లక్షలు గుమ్మరించి కూతురికెలానూ పెళ్ళిచేయలేడు. అనుకోకుండా గొప్పింటి సంబంధం తలుపు తట్టినందుకు తెగ సంబరపడిపోయాడు.

స్వప్నను దగ్గరుండి ముస్తాబుచేసి పెళ్ళివారి ముందుకు తీసుకొచ్చింది దీపిక.

పెళ్ళికొడుకుతో సహా అందరి దృష్టీ దీపిక మీద పడింది.

'ఆ అమ్మాయి ఎవరు? మీ పెద్దపిల్లా" ఉండబట్టలేక అడిగేసింది అబ్బాయితల్లి. సడన్‌గా ఆవిడలా అడిగేసరికి ఏమనాలో తెలీక ఔనన్నట్లు తల ఊపాడు ప్రకాశ్.

పెళ్ళిచూపుల తతంగం పూర్తయింది.

స్వప్న లేచి లోనికెళ్లిపోయింది.

కొడుకుతో కాసేపు గుసగుసలాడి లేచారు అతని తల్లిదండ్రులు.

"మా అమ్మాయి మీకు నచ్చిందనే అనుకుంటాను



ఇంటికెళ్లాక ఆలోచించుకుని ఫోన్ చెయ్యండి" అన్నాడు ప్రకాశ్.

"అంతవరకు ఎందుకు ఇప్పుడే చెప్పేస్తాం మా అబ్బాయి మీ పెద్దమ్మాయిని ఇష్టపడుతున్నాడు. ఆ పిల్లనే చేసుకుంటానంటున్నాడు, మీరు ఊ అంటే ముహూర్తం పెట్టేసుకోవచ్చు" బాంబు పేల్చారు పెళ్ళివారు.

ఆ మాటకు నిర్ఘాంతపోయాడు ప్రకాశ్. వెంటనే ఏమనాలో స్ఫురించక "నాకు కాస్త టైంకావాలి" అన్నాడు.

"ఇప్పటికిప్పుడు చెప్పమనడంలేదు, బాగా ఆలోచించుకునే మాకు తెలియజేయండి. పెద్ద పిల్లని వదిలేసి రెండోదానికి పెళ్ళిచేయడం కూడా సమంజసంకాదు కదా! ఆలోచించండి" అంటూ వెళ్ళిపోయారు.

దీపిక వాళ్ళకు ఎదురుపడటంవల్లనే ఈ అనర్థం జరిగింది, లేకుంటే స్వప్నని ఇష్టపడేవాళ్లు. ఈ ముదనష్టపుదానివల్లే సంబంధం చెడిపోయిం దనుకుని దీపికను నానా చివాట్లు పెట్టాడు తండ్రి. పోనీ వాళ్లు కోరినట్లు ఆమెనేయిచ్చి పెళ్ళిచెయ్యొచ్చు కదా! అహా! అంతమంచి సంబంధం కన్నకూతురికి కాదని పెంపుడుపిల్లకి కట్టబెట్టడానికి మనసొప్ప లేదు. ఏం చెయ్యాలో తోచక తలపట్టుకున్నాడు ప్రకాశ్.

వచ్చిన సంబంధం అక్కవల్లే తప్పిపోవ డంతో స్వప్న ఆగ్రహానికి గురైంది. ఇంతచక్కటి సంబంధం మళ్ళీ వస్తుందా అనుకుని "నాన్నా! దాన్ని తక్షణం ఇంట్లోంచి గెంటేయండి. మీరాపని చేయకపోతే నేనే వెళ్ళిపోతా! ఇక తను నేను కలు సుండడం కల్ల. నేను నా క్లాస్‌మేట్ ఇంటికెళు తున్నా, అరగంటలో వస్తాను. తిరిగొచ్చేసరికి అది నాకు కనిపించకూడదు" హెచ్చరిస్తూ బైటకు వెళ్లి పోయింది స్వప్న.

దీపికను ఎలాగో అలా బైటకు సాగనంపే యాలనీ, లేకపోతే స్వప్న అన్నంతపనీ చేస్తుం దనీ భయపడ్డాడు ప్రకాశ్. అనుకున్నంత తేలిక కాదు ఆచరించడం. ఆ పనిచేస్తే లోకం ఊరుకుం టుందా? పిల్లలు లేనప్పుడు ఓ అభాగ్యురాల్ని తెచ్చుకుని ఇన్నాళ్ళూ పెంచి ఇప్పుడు అక్కర్లేదనుకుని వదిలేయడానికి నీకు మనసెలా వచ్చిందంటూ చీవాట్లు పెట్టదూ..? పరిపరి విధాలుగా ఆలోచనలు ప్రకాశ్ మదిని దొలిచేస్తున్నాయి.

తను ఎక్కడ దిగాలో చెప్పి ఆటోఎక్కి కూర్చుంది స్వప్న.

బండి రయ్‌మని ముందుకు దూసుకుపోతోంది. అంతకంటే వేగంగా పరుగెడుతున్నాయి ఆమె ఆలోచనలు.

మార్గమధ్యంలో ఉన్నట్లుండి ఆటో అదుపు తప్పి ఎదురుగా వస్తున్న లారీని ఢీకొంది. ఆ యాక్సి డెంట్లో స్వప్న కుడికాలు విరిగిపోయింది. దారిన పోయేవారెవరో వన్‌జీరో ఎయిట్‌కి ఫోన్‌చేసి ఆమెను హాస్పిటల్‌కు తరలించారు.

కన్నకూతురికి జరిగిన ఘోరం చూసి భోరు మన్నాడు ప్రకాశ్.

హాస్పిటల్‌నుంచి డిశ్చార్జ్ అయినప్పటినుండి స్వప్న మంచం దిగే పనిలేకుండా దీపికే ఆమెకు అన్నీ సమకూరుస్తోంది. అవసరాలన్నీ తీరుస్తోంది. ఆ సంఘటన తర్వాత ప్రకాశ్‌లో అంతర్మథనం ఆరంభమైంది. ఇన్నాళ్ళుగా దీపికపట్ల తను ప్రవ ర్తించిన తీరు తనకే రోతనిపించింది. తన పాపమే కన్నకూతురికి శాపమైంది. తన ద్వేషం మాన వతను మంటగలిపింది. స్వప్న మాటలు విని ఆరోజు దీపికను బైటకు తరిమేసుంటే ఇవాళ తన కూతురి గతేంటి? ఈ ఇంటినీ, తననూ పట్టించు కునేదెవరు?..ఇలా ఎన్నో ఎన్నెన్నో ఆలోచనలు అతడి మస్తిష్కంలో సుళ్లు తిరుగుతున్నాయి.

"ఏమిటి? అంత దీర్ఘంగా ఆలోచిస్తున్నావు? కాఫీ తాగావాలేదా? ఇవాళ శనివారం. వెంకటేశ్వర స్వామికి ప్రీతికరమైన రోజు. తలస్నానంచేద్దువు గాని పద. ఈలోగా దీపం పెట్టేందుకు ఏర్పాట్లు చేస్తాను" అంటూ స్వప్న చేయి అందుకుంది దీపిక

'అక్కా! అని పిలిచింది స్వప్న. ఆ పిలుపులో ఆర్ద్రత, ఆత్మీయత అంత ప్రేమగా తనని అలా పిల వడం అదే తొలిసారి కావడంతో నిర్ఘాంతపోయింది దీపిక. స్వప్న అశ్రుపూరిత నయనాల్లో పశ్చా త్తాపం కొట్టొచ్చినట్లు కనిపిస్తోంది దీపికకు.

"నన్ను క్షమించక్కా! అకారణంగా నిన్ను ఇన్నాళ్ళూ ద్వేషించాను. అనరాని మాటలన్నాను. నా పాపానికి ఈ శిక్ష చాలదు. అయినా నువ్వేం పట్టించుకోకుండా నన్నెంతో ప్రేమగా చూసుకుంటు న్నావు. నువ్వు మనిషివికాదు దేవతవి" అంటూ దీపిక గుండెలమీద తలాన్చి కన్నీరు కార్చింది స్వప్న.

**స్వప్నకు పెళ్ళిచూపులు. చక్కగా అలంకరించి తీసుకెళ్ళి పెళ్ళికొడుకు ముందు కూర్చోబెట్టింది దీపిక. పెళ్ళివారు గుసగుసలాడుకున్నారు. స్వప్న బదులు దీపికనే చేసుకుంటామని కుండ బద్దలుకొట్టి చెప్పారు. సందిగ్ధంలో పడ్డాడా కన్నతండ్రి. తర్వాత ఆలోచించి చెబుతా నన్నాడు. పెళ్ళి చూపులకు వచ్చినవారు వెళ్ళి పోయాక ఆ ఇంట్లో ఏం జరిగింది? స్వప్న ఎలా స్పందించింది? తండ్రి ఎలాంటి ఆలోచనలు చేశాడు?**

"ఛ అవేం మాటలు స్వప్నా! ఇప్పుడంటే అన్నావు గానీ ఇంకెప్పుడూ అలా అనకు, నాకు కోపం వస్తుంది" అంది దీపిక ఆమె కళ్ళు తుడుస్తూ.

"అయితే నేను చెప్పినట్లు చేస్తావా? చేతిలో చెయ్యేసి చెప్పాలి" అడిగింది స్వప్న.

"గతంలో వచ్చిన సంబంధం నువ్వు చేసుకో వాలి. ఆ అబ్బాయి నిన్నెంతగానో ఇష్టపడు తున్నాడు. నిన్ను పెళ్ళికూతురిగా చూడాలని నా ఆశ" చెప్పింది స్వప్న.

దూరంనుంచి ఆ సంభాషణ ఆలకిస్తున్న ప్రకాశ్ ఆలోచనలో పడ్డాడు. దీపికపట్ల తను వ్యవ హరించిన తీరు హర్షించరానిది. ఆ పాపమే తన కన్నకూతురికి తగిలింది. ఈరకంగానైనా స్వప్న కోరినట్లు దీపికకు మేలు జరిగితే కొంతలో కొంతైనా తనకు పాపపరిహారం జరుగుతుందను కున్నాడు ప్రకాశ్. "ఔనమ్మా దీపికా! స్వప్న కోరిక నెరవేరాలి. నువ్వో ఇంటిదానివి కావాలి. నేనూ అదే ఆశపడుతున్నాను" అన్నాడు ప్రకాశ్.

"అదేంటి నాన్నా, మీరు కూడా అలా అంటారు. నేను పెళ్ళి చేసుకుని వెళ్ళిపోతే చెల్లిని ఎవరు చూస్తారు? మీకు అన్నం ఎవరు వండి పెడతారు? ఆ పిచ్చిపిల్ల ఏదో అందని మీరు కూడా అలా అంటే ఎలా? వద్దు నేను పెళ్ళిచేసు కోను" ఖండితంగా చెప్పింది దీపిక.

"నాకు మాటిచ్చావ్. ఒట్టేసి మళ్ళీ మాట తప్పుతావా; నీ బెంగంతా నాగురించే కదా!..ఇక నీకా చింతవద్దు. నేను ఏదో ఒకపని చేస్తూ డబ్బు సంపాదిస్తాను. నాన్నని సుఖపెడతాను. ఈ అవిటిది ఏం చేస్తుందనుకుంటున్నావు కదూ! ఎంత ఖరీదైనా సరే నాన్నని జైపూర్ ఫుట్ కొని మ్మంటాను. అది ధరిస్తే నా కాళ్ళమీద నేను నిటారుగా నిలబడగలను. ఏపనైనా చేయగలను. మన వీధిలో ఉన్న కుట్టుసెంటర్‌లో కుట్లు, డిజై నింగ్ నేర్చుకుంటాను. బట్టలుకుట్టి డబ్బు సంపా దిస్తాను. నాన్నను జాగ్రత్తగా చూసుకుంటాను, సరేనా? ఇకనైనా ఇచ్చినమాట నిలబెట్టుకోవే తల్లీ"

స్వప్న ఆత్మవిశ్వాసానికి, మనోధైర్యానికి అచ్చెరు వొందింది దీపిక. నోటమాటరాక దీనంగా తండ్రి వంక చూసింది.

పశ్చాత్తాపంతో దహించుకుపోతోన్న ప్రకాశ్ మనసుకు స్వప్న మాటలు ఎంతో ఊరటనిచ్చాయి. వెంటనే సెల్‌తీసి మా దీపికను మీ కోడల్ని చేసు కోండి" అంటూ పెళ్ళివారికి ఫోన్ చేశాడు.

**సెల్: 9666991929**



## ఆటో ఇమ్యూన్ డిజార్డర్

శరీరంవ్యాధులబారినపడకుండా కాపాడటానికీ, పోరాడటానికీ ఒక రక్షణ వ్యవస్థ ఉంటుంది. ఆ రక్షణ వ్యవస్థ పొరబడి తన సొంత శరీరంపైనే దాడిచేసే థైరాయిడ్ సమస్యలు, రుమటాయిడ్ ఆర్థ్రైటీస్, తెల్లమచ్చలు, సోరియాసిస్ వంటి వ్యాధులువస్తాయి. అందుకే వీటిని ఆటోఇమ్యూన్ వ్యాధులంటారు. **కారణాలు:** బ్యాక్టీరియా, వైరస్, కెమికల్స్, వాతావరణ కాలుష్యం. వంశపారంపర్యంగా కూడా ఇది వచ్చే అవకాశం ఎక్కువగా ఉంటుంది. **లక్షణాలు:** కండరాలనొప్పి, నీరసం, జ్వరం, అలసట. కీళ్ళనొప్పులు, చర్మం, రక్త కణాలు, రక్తనాళాలు వంటి భాగాలు ఎక్కువ ప్రభావానికీ లోనవుతాయి. **వ్యాధి నిర్ధారణ:** ఆటోయాంటీ బాడీస్ టెస్ట్‌లు, సిబిపి, సీరియాక్టివ్ ప్రోటీన్, ఈ.ఎస్.ఆర్. సిబిపి, ఎరిత్రోసైట్ సెడిమ్‌న్‌టేషన్‌రేట్.

**కొన్నిరకాల ఆటోఇమ్యూన్ వ్యాధులు: రుమటాయిడ్ ఆర్థ్రైటీస్:** ఇదొక ఇన్‌ఫ్లమెటరీఆర్థ్రైటీస్, జీవక్రియలలో ఏర్పడే అసమతూల్యతవలన తలెత్తే ఈ ఆటోఇమ్యూన్ డిసీజ్, శరీరంలో ఇరు ప్రక్కలలో ఉండే కీళ్ళకు సమాంతరంగా వ్యాప్తి చెందుతుంది.

**థైరాయిడ్ సమస్యలు:** యాంటీబాడీస్ శరీరంలో తయారగుట వల్ల థైరాయిడ్ గ్రంథికి వ్యాపిస్తాయి. ఇది కొన్ని నెలలనుంచి కొన్ని సంవత్సరాలు పడుతుంది. రేడియేషన్ చికిత్స ఇచ్చినప్పుడు థైరాయిడ్ గ్రంథి దెబ్బ తిని హైపోథైరాయిడిజం రావచ్చు. హైపర్ థైరయిడ్ వచ్చినప్పుడు గ్రేవ్స్ డిసిజ్ అంటారు. **లక్షణాలు:** మలబద్ధకం, డిప్రెషన్, నీరసం, అలసట, వెంట్రుకలు రాలిపోవడం, గోళ్ళు విరగడం, కాళ్ళు, చేతులు వాయడం, గొంతుబొంగురుపోవడం. **వ్యాధి నిర్ధారణ:** టీ,టీ4, టీఎస్‌హెచ్ పరీక్షలు, లిపిడ్‌ప్రోఫైల్, సిబిపి, ఎల్.ఎచ్.టీ, ప్రోలాక్టిన్ మొదలైన పరీక్షలు చేయించుకోవాలి.

**సోరియాసిస్:** సోరియాసిస్ అనేది దీర్ఘకాలపు చర్మ వ్యాధి. ఇది పొలుసుల మాదిరిగా వచ్చే చర్మవ్యాధి. దురద, ఎర్రమచ్చలు శరీరమంతా వ్యాపిస్తాయి. ఈ వ్యాధి స్త్రీ పురుషులకు సమానంగా వస్తుంది. సోరియాసిస్ వ్యాధి ఎక్కువగా మోచేతులు,మోకాళ్ళు, తల, వీపు, అరిచేతులు, అరికాళ్ళు, ఉదరంపై, మెడ, నుదురు, చెవులు మొదలైన ప్రాంతాల్లో వ్యాపిస్తుంది. **లక్షణాలు:** చర్మం ఎర్రబడటం, జుట్టు రాలిపోవడం, కీళ్ళనొప్పులు, చర్మం పొడిబారినప్పుడు, చర్మంపై పగుళ్లు, ఏర్పడంతో పాటు రక్తస్రావం అవుతుంది. **నిర్ధారణపరీక్షలు:** స్కిన్‌బయోప్సి, ఈఎస్‌ఆర్, సిబిపి, ఎక్స్‌రే. **డయాబెటీస్:** టైప్-1 డయాబెటీస్ అనేది ఆటో ఇమ్యూన్ డిజార్డర్‌లో మరో డయాబెటీస్ అనగా షుగర్‌వ్యాధి. ఇది ఏ వయసులోనైనా రావచ్చు ప్రస్తుతం భారతదేశంలో ప్రతి వంద మందిలో 14 మంది డయాబెటీస్ బారిన పడుతున్నారు. ఇది ఇన్సులిన్ ఉత్పత్తి లోపం వల్ల జరుగుతుంది. వంశపారంపర్యంగా కూడా ఇది రావచ్చు. ఇప్పుడు 20-30 ఏళ్ళ వారిలో సైతం కనిపిస్తోంది. డయాబెటీస్ రెండు రకాలుగా ఉంటుంది. టైప్ 1, టైప్ 2.

**టైప్ 1.** 20 సంవత్సరాల లోపు వారిలో వచ్చే వ్యాధి. ఇది ఆటోఇమ్యూన్ డిసిజ్‌గా చెబుతారు. ఇది చిన్నపిల్లలో కనిపించే సమస్య కనుక అది వారి మానసిక, శారీరక పెరుగుదల మీద చాలా ప్రభావాన్ని చూపుతుంది.

**టైప్-2.** డయాబెటీస్ 20 సంవత్సరాలు పైబడిన వారిలో కనిపిస్తుంది. ఏటా 5.1 మిలియన్ల మంది డయాబెటీస్ వల్ల మరణిస్తున్నారు. 2030 వరకు ప్రపంచంలోని ప్రతి ఇద్దరిలో ఒకరు డయాబెటీస్ బారిన పడే అవకాశం ఉందని అంచనా. టైప్-1, టైప్-2, టైప్-3 డయాబెటీస్ కుడా ఉంది ఇది జెస్టేషనల్ డయాబెటీస్ ముఖ్యంగా గర్భిణుల్లో కనిపిస్తుంది.



**డా. మురళి అంకిరెడ్డి**
M. D (Homeo)
**స్టార్ హోమియోపతి**

**లక్షణాలు.** ఆకలి, నీరసం, దాహం ఎక్కువగా ఉండటం. అతిమూత్రం, కళ్ళుమసకగా కనిపించడం, బరువు తగ్గడం. తలనొప్పి, గుండెదడ, చెమటలు పట్టడం, గాయాలు నయం కాకపోవడం, కాళ్లు, చేతులు తిమిర్లు రావడం. **నిర్ధారణ పరీక్షలు.** ఫాస్టింగ్ బ్లడ్ షుగర్, పోస్‌డియల్ బ్లడ్ షుగరం, గ్లూకోజ్ టాలరెంట్ టెస్ట్, యూరిన్ షుగర్ లెవల్, రావడమే షుగర్ లెవల్, బ్లడ్ యూరియా లెవల్స్, సిరమ్ పరీక్షలు.

**హోమియోచికిత్స.** హోమియో వైద్యవిధానంలో వ్యాధి లక్షణాలు, మానసిక, శారీరక స్థితిగతులు, ఆహార వివరాలను పరిగణలోకి తీసుకొని చికిత్స అందించడ్ జరుగుతుంది. ఆటోఇమ్యూన్ డిజార్డర్స్ అన్నింటికీ హోమియోలో మంచి మందులు ఉన్నాయి. వీటితో ఎలాంటి దుష్ప్రభావాలు ఉండవు. ఇది అనుభవజ్ఞులైన హోమియో వైద్యుని పర్యవేక్షణలో చికిత్స తీసుకుంటే ఆటోఇమ్యూన్‌డిసిజ్‌ను సమూలంగా నయంచేయవచ్చు. మన రక్షణ వ్యవస్థను పటిష్టం చేయడం వ్యాధి మూలాలకు చికిత్స చేస్తూ వ్యాధి తిరగబడకుండా చికిత్స చేయడం హోమియోపతి యొక్కప్రాధాన్యం.

www.starhomeopathy.com | తెలంగాణ । ఆంధ్రప్రదేశ్ । కర్నాటక । దుబాయి । లండన్ । మాంచెస్టర్ | 90300 64224

## నడుంనొప్పికి ఆయుర్వేద చికిత్స

**ప్రస్తుత పరిస్థితుల్లో మానవుని జీవనం ప్రకృతి సహజ విధానాలకు విరుద్ధంగా ఉంటోంది. పెరిగి పోతున్న పని ఒత్తిడి, పోషకాహారం సరిగా తీసుకోక పోవడం వల్ల ఈ రోజుల్లో 40 ఏళ్లకే నడుంనడప్పి వస్తోంది. శారీరకంగా, మానసికంగా సమస్యలు కలిగించే నడుంనొప్పిని దూరం చేయాలంటే ఆయుర్వేద చికిత్సే ఉత్తమమైన మార్గం అంటున్నారు ప్రముఖ ఆయుర్వేద వైద్యులు డాక్టర్ మనోహర్.**

నేటి జీవనవిధానంలో ఆహారలోపాలు, అస్తవ్యస్తమైన దిన చర్యలు, స్వప్న విపర్యం అంటే రాత్రివేళ నిద్రపోక పోవడం, పగటిపూటనిద్రపోవడం వంటి అలవాట్లు శరీర వ్యవస్థను బాగా దెబ్బ తీస్తున్నాయి. ఆందోళన, మానసిక ఒత్తిడి కూడా అనేక అనారోగ్యలకు కారణ మవుతున్నాయి. వీటిలో అతిముఖ్యమైనది నడుంనొప్పి, ఆయుర్వేదశాస్త్రం నడుం నొప్పికి 'గృధ్రసీవాతం' గా నామకరణం చేసింది. తొంభైశాతం మంది తమ జీవిత కాలంలో ఎప్పుడో ఒక్క సారి నడుంనొప్పి బారినపడతారని కొన్నిఅధ్యయనాల్లో స్పష్టమయింది. **కారణాలు:** ఎక్కువసమయం ఒకే భంగిమలో కూర్చోవటం, స్థూలకాయం, ఎక్కువగంటలు విపరితంగా శ్రమించడం, అతిగా బరువులు మోయడం, ద్విచక్ర వాహనం మీద ఎక్కువ దూర ప్రయాణం చేయడం, రోడ్డు ప్రమాదాలు,దీర్ఘకాలికరుగ్మతలు, వంశ పారంపర్య వ్యాధులు ఇవన్నీ నడుంనొప్పికి కారణాలు. ఈ కారణాల వల్ల వాత ప్రకోపం జరుగుతుంది. ఫలితంగా ముందుగా పిరుదుల పైభాగాన స్తబ్ధతను, నొప్పిని కలిగించి ఆ తరువాత నడుం భాగం, ప్రత్యేకించి ఎల్-4, ఎల్-5 వెన్నుపూసల మధ్య ఉండే సయాటికా నరం మీద ఒత్తిడి పడటంవల్ల నడుంనొప్పి వస్తుంది. డిస్కులో వచ్చే మార్పులు. వెన్నుపూసల మధ్య ఉండే డిస్కుల్లో కొన్ని మార్పులు జరిగినప్పుడు డిస్కుల మీద ఒత్తిడి పెరుగు తుంది. వాపు రావడం, డిస్కుకి రక్త ప్రసరణ సరిగా లేక పోవడం, డిస్కు అరిగి పోవడం వంటి సమస్యల వల్ల ఈ నొప్పి వస్తుంది. డిస్కులలో వాపువస్తే అందులోనుంచి ద్రవం బయటకు వచ్చి మేరుదండం నుంచి వచ్చే నరాల పైన ఒత్తిడి పెరుగు తుంది. దీనివల్ల వెన్ను నొప్పి వస్తుంది. **లక్షణాలు:**నడుంనొప్పి, వాపు, కాస్త శ్రమించినా సూదుల తో గుచ్చినట్లుగా నొప్పి తీవ్రంకావడం, కాళ్ళలో తిమ్మిర్లు, మంటలు ఉంటాయి. సకాలంలో చికిత్స అందకపోతే స్పర్శజ్ఞానం కోల్పోతారు.సమస్య తీవ్రమైతే మలమూత్రాల మీద నియంత్రణ కోల్పోయే ప్రమాదం ఉంది. పెయిన్ కిల్లర్స్ వాడకూడదు. పెయిన్‌కిల్లర్స్‌తో మలబద్ధకం, జీర్ణాశయ సమస్యలు వస్తాయి. వెన్నుసంబంధిత సమస్యలను వెంటనే గుర్తించి చికిత్స తీసుకుంటే ఈ వ్యాధిరాకుండా ఉంటుంది.

**ఆయుర్వేదచికిత్స:** నడుంనొప్పిసమస్యకు ఆయుర్వేద శాస్త్రం సూచించిన సమగ్రమైన చికిత్సా పద్ధతుల్లో నిదాన పరి వర్జనము, శమన చికిత్స, శోధనచికిత్స అని మూడు ప్రధానమైనవి ఉన్నాయి. **నిదానపరివర్జనము:** వ్యాధికి కారణమయిన విషయాలను పాటించక పోవడం. ఉదా॥ విరుద్ధ ఆహార, విహార సేవన (రాత్రి మేల్కోవటం, పగలు నిద్రపోవటం).**శమనచికిత్సలు:** వ్యాధితాలూకు దోషాలను శమింప చేయాటానికి తెచ్చే ఔషదాలు. ఇందులో రోగ బలాన్నిబట్టి, రోగిబలాన్నిబట్టి చూర్ణాలు, గటికలు, కషాయాలు, లేహ్యాలు, తైలాలు వంటి ఔషదాలు రోగికి ఇవ్వడం జరుగుతుంది. కానీఈ శమన చికిత్సవల్ల ఒక్కో సారి ప్రకోపించిన దోషాలుమళ్ళీ తిరగబడవచ్చు. అందుకే వ్యాధితీవ్రతను బట్టి శమన చికిత్సలతో పాటు కొందరికి పంచకర్మ (శోధన చికిత్స) కూడా అవసరం. ప్రకోపించిన దోషాలను(వాత, పిత్త, కఫ) దీని ద్వారా సమంగా చేసి శరీర శుద్ధిని, అగ్ని బలాన్ని పొందవచ్చు. ఆయుర్వేదంలోని స్వేద కర్మ ద్వారా వెన్నుపూసల మధ్య స్నిగ్ధత్వాన్ని పెంపొందించి కీళ్లకదలికలను సులభతరం చేయవచ్చు. బిగుసుకుపోయిన కీళ్లను స్వేదకర్మ ద్వారా వదులుగా, మృదువుగా మార్చవచ్చు. **కటివస్తి:** ఇది ఆయుర్వేదంలోని ఒక విశిష్టప్రక్రియ. అరిగిపోయిన మృదలాస్థి (కార్టిలేజ్)కి రక్తప్రసరణ పెంచినొప్పి తీవ్రతను తగ్గించడంలో ఈ ప్రక్రియఎంతగానో ఉపయోగపడు తుంది. ఇదే క్రమంలో సర్వాంగధార చికిత్స కూడా వీరికి బాగా ఉపయోగపడుతుంది. వస్తికర్మ, ఆయుర్వేద శాస్త్రం లో వస్తికర్మచికిత్స అత్యంత ప్రాధాన్యాన్ని సంతరించు కుంది. ఈ వస్తికర్మచిన్నపేగులు, పెద్దపేగులలోని ఎంటరిక్ నర్వస్ సిస్టమ్‌పై ప్రభావం చూపుతుంది. తద్వారా నాడీ కణాలలో ఏర్పడిన లోపాలను సరిచేసి బలం చేకూర్చ వచ్చు. అలాగే పక్వాశయు వాతస్థానంకాబట్టి ప్రకోపించిన వాతాన్నికూడా సహజస్థితికి తీసుకురావచ్చు.

**జాగ్రత్తలు:** అవసరమైన పోషకాహారం తీసుకుంటూ వైద్యులు సూచించిన విధానా లను అనుసరించడం చాలా ముఖ్యం. ఔషదచికిత్సల తరువాత క్రమం తప్పకుండా వ్యాయామం కూడా చేస్తే నడుం నొప్పి సమస్యనుంచి శాశ్వతంగా విముక్తి కలుగుతుంది.

**డా. లక్ష్మీ** M. D (Ayurveda)
**స్టార్ ఆయుర్వేద**

ADVT

90300 85456 | తెలంగాణ । ఆంధ్రప్రదేశ్ । కర్నాటక | www.starayurveda.com

**ఉత్తరప్రదేశ్‌లో ములాయం కోడళ్లే చక్రం తిప్పుతున్నారు. ఇటీవల పార్టీలో సంక్షోభం తలెత్త డానికి వారిద్దరే చాలావరకూ కారణమని అర్థమవుతోంది.**

**ఉత్తర ప్రదేశ్ ప్రస్తుతం కోడళ్ల రాజ్యమైపోయింది. అధికార సమాజ్‌వాది పార్టీ వ్యవస్థాప కుడు ములాయం సింగ్ యాదవ్ కోడళ్లే చక్రం తిప్పుతున్నారు. ప్రస్తుతం తన కుమారుడు, రాష్ట్ర ముఖ్యమంత్రి అఖిలేశ్ యాదవ్‌తో తీవ్రంగా విభేదిస్తున్న ములాయం తన కోడళ్ల కార ణంగా ఊపిరి ఆడనంతగా అవస్థ పడుతున్నారు. ఆ కోడళ్ల పేర్లు డింపుల్ యాదవ్, అపర్ణా యాదవ్.**


అపర్ణా యాదవ్

ఇందులో డింపుల్ యాదవ్ ఆయన పెద్ద కుమారుడు అఖిలేశ్ యాదవ్ భార్య కాగా, అపర్ణా యాదవ్ ఆయన రెండవ భార్య కుమారుడు ప్రతీక్ యాదవ్ భార్య. ప్రతీక్‌కి రాజకీయాలంటే పెద్దగా ఆసక్తి లేదు. ప్రస్తుతం ఈ ఇద్దరు కోడళ్లే రాష్ట్రంలో రెండు ప్రధాన అధికార కేంద్రాలుగా మారిపోయారు. తండ్రీ కొడుకుల మధ్య వైరంతో రాజకీయ సంక్షోభంలో చిక్కుకుపోయిన ఉత్తరప్రదేశ్‌లో ఈ ఇద్దరూ తెరవెనుక ఉండి తమ భర్తల మీదే కాక, అటు పార్టీ మీదా, ఇటు ప్రభుత్వం మీద కూడా ఆధిపత్యం చెలాయిస్తున్నారు.

ఈ ఇద్దరి మధ్యా కొన్ని విషయాల్లో పెద్దగా తేడా కనిపించడం లేదు. రాజకీయాల్లోకి తన ఇంటి మహిళలు అడుగుపెట్టడం ములాయం సింగ్‌కు అంతగా ఇష్టం లేదు. కానీ, కోడళ్లిద్దరూ వారంతట వారే అడుగు పెట్టేసరికి ఆయన ఏమీ అనలేకపోతున్నారు. ప్రస్తుతం దేశమంతటి దృష్టినీ ఆకర్షిస్తున్న రాజకీయాధికార పోరాటంలో వారిద్దరూ కీలక పాత్రధారులుగా మారారు. మరో అంశమేమిటంటే, వాళ్లిద్దరూ ఉత్తరాఖండ్ ప్రాంతానికి చెందినవారే. అక్కడ యాదవుల ఆధిపత్యం బొత్తిగా మృగ్యం. ఈ ఇద్దరి మధ్యా ఉన్న ఈ సారూప్యతలు కేవలం మచ్చుకు కొన్ని మాత్రమే. అయితే, వైవిధ్యాలు కూడా అనేకం ఉన్నాయి. పెద్ద కోడలు డింపుల్ యాదవ్ ఎవరితోనూ ఎక్కువగా మాట్లాడరు. దూసుకుపోయే తత్వం కాదు. చిన్న కోడలు అపర్ణా యాదవ్ మాత్రం దూసుకుపోయే మనిషి. చొరవ ఎక్కువ. ధైర్యం కూడా ఎక్కువే.

డింపుల్ యాదవ్‌కు రాజకీయాలంటే ఆసక్తి ఎక్కువ. ఆమె ప్రస్తుతం పార్లమెంట్ సభ్యురాలు కూడా. అయితే, తన భర్త పేరే తన కంటే అన్నిటా ముందుండాలని, భర్తే వెలుగులో ఉండాలని ప్రతి క్షణం కోరుకునే వ్యక్తి ఆమె. తన తోటి కోడలు మాత్రమే రాజకీయాల్లో ఉండడం నచ్చని అపర్ణా యాదవ్ ప్రస్తుతం లక్నో నియోజకవర్గం నుంచి శాసనసభకు పోటీచేస్తున్నారు. అసలు ఈ కోడలు వల్లే ములాయం, అఖిలేశ్‌ల మధ్య విభేదాలు ప్రారంభమయ్యాయని సన్నిహితులు చెబుతుంటారు. పార్టీయే కాక, కుటుంబం కూడా నిట్టనిలువునా చీలిపోయి, తండ్రీ కొడుకులు వీధిన పడడానికి ఈ కోడలే కారణమని అంతా భావిస్తున్నారు. డింపుల్, అపర్ణలు ఈ స్థితికి చేరుకోవడానికి, వాళ్ల వల్ల ఇంటి విభేదాలు, పార్టీ విభేదాలు రచ్చకెక్కడానికి కారణమేమిటి అని ఆలోచిస్తే, సాధారణ ఇళ్లలోని సమస్యలే ఇక్కడ కూడా పెద్ద ప్రభావం చూపించాయని అర్థమవుతుంది.

# కోడళ్లు ఎంత చెబితే అంత!


డింపుల్ యాదవ్

### తెరవెనుక వ్యూహాలు

ఇందులో 38 ఏళ్ల డింపుల్ ప్రస్తుతం ఉత్తరాఖండ్‌లో ఉంటున్న చంపా రావత్, రిటైర్డ్ కల్నల్ ఆర్.సి. సింగ్ రావత్‌ల కుమార్తె. ఆమె బాల్యమంతా ఎక్కువగా సైనిక నివాస ప్రాంతాల్లోనే గడిచింది. తల్లితండ్రులు కూడా రాజకీయాలకు దూరంగానే ఉంటూ వచ్చారు. లక్నో విశ్వవిద్యాలయంలో కామర్స్ విద్యార్థిగా ఉండగా ఆమె మొదటిసారిగా అఖిలేశ్‌ను కలుసుకున్నారు. ఆ తరువాత వారికి 1999లో వివాహం అయింది. అఖిలేశ్‌కు డింపుల్‌తో వివాహం జరగడం ములాయం సింగ్ యాదవ్‌కు ఏమాత్రం ఇష్టం లేదు. ఆమె 'ఠాకూర్' కావడమే అందుకు ప్రధాన కారణం. ములాయం ఓబీసీ రాజకీయాలకు ఇది పూర్తిగా విరుద్ధం. అయితే, అమర్‌సింగ్ ఆయనకు నచ్చజెప్పి ఒప్పించారు. ఆయనే ములాయం తల్లిని కూడా ఈ వివాహానికి ఒప్పించారు.

ఇది ఇలా ఉండగా కనౌజ్ లోక్‌సభా స్థానానికి ఖాళీ ఏర్పడి ఉపఎన్నిక జరగాల్సి వచ్చింది. ఆ సమయంలో అఖిలేశ్, డింపుల్‌లు హనీమూన్‌లో ఉన్నారు. ములాయం తన కుమారుణ్ణి పిలిపించి, ఏదో విధంగా కనౌజ్ లోక్‌సభ స్థానాన్ని చేజిక్కించుకోవాలని సూచించారు. తండ్రికి అఖిలేశ్ మాట ఇచ్చి, ఆ సీటును చేజిక్కించుకున్నారు. పెళ్ళయిన తరువాత దాదాపు పదేళ్ల పాటు డింపుల్ రాజకీయాల వైపు కన్నెత్తి చూడలేదు. 2009లో అఖిలేశ్ తన ఫిరోజాబాద్ సీటును వదులుకుని కనౌజ్ సీటును దక్కించుకున్నారు. ఫిరోజాబాద్ సీటుకు ఉపఎన్నిక వచ్చింది. ఈ సీటు నుంచి డింపుల్ పోటీ చేయాలని అఖిలేశ్ తన తండ్రికి సూచించారు. ములాయం సింగ్‌కు ఈ ప్రతిపాదన ఏమాత్రం ఇష్టం లేకపోయినా కొడుకు మాట కాదనలేక కోడలికి అవకాశం ఇచ్చారు. అప్పటికింకా రాజకీయానుభవంలేని డింపుల్ సరిగ్గా ప్రచారం చేసుకోలేకపోయారు. పైగా ఆమెకు అప్పటికి సభల్లో మాట్లాడడం కూడా చేతకాదు. ఆమె ప్రముఖ నటుడు రాజ్‌బబ్బర్ చేతిలో ఘోరంగా ఓడిపోవడం జరిగింది.

ఇక 2012 నాటికి ఆమె రాజకీయాల్ని కాస్తంత ఒంటబట్టించుకున్నారు. అఖిలేశ్ ముఖ్యమంత్రి అయిన తర్వాత కనౌజ్ లోక్‌సభ స్థానం ఖాళీ అయింది. ఆమె ఆ స్థానం నుంచి పోటీ చేసి ఘన








**ఉత్తరప్రదేశ్ ఇప్పుడు కోడళ్ల రాజ్యం. నిజం చెప్పాలంటే రాష్ట్రంలో ఇప్పటిరాజకీయ పరిస్థితికి ఈ కోడళ్లే కారణం అంటున్నారు అంతా. భర్తకు వెన్నుదన్నుగా నిలబడి అతడికి రాజకీయ సలహాదారుగా మారిపోయారు అఖిలేశ్ భార్య డింపుల్. ఇక ములాయం రెండోభార్య కుమారుడు ప్రతీక్‌యాదవ్ భార్య అపర్ణకు దూకుడెక్కువ. జనంలో కలిసిపోయేతత్వం. మరి ఇంతకీ వీళ్ళు చేసిందేమిటి?**

విజయం సాధించారు. 2014లో బీజేపీ హవా విజృంభించిన సమయంలో కూడా ఆమె ఆ సీటు నుంచి చక్కని మెజారిటీతో గెలిచారు. ముగ్గురు పిల్లల తల్లి డింపుల్ ఇంకా పూర్తిగా రాజకీయంగా పరిణతి సాధించలేదు కానీ, ఇంటి రాజకీయాల్లో ఎలా నెగ్గుకు రావాలో మాత్రం బాగా ఒంటబట్టించుకున్నారు. 2012లో అఖిలేశ్ ముఖ్యమంత్రి అయిన తరువాత ఇంట్లోనే ఆయనకు వ్యతిరేకంగా రాజకీయాలు మొదలు కావడం డింపుల్ మొదట్లోనే గమనించారు. వెంటనే అఖిలేశ్‌ను హెచ్చరించారు. అప్పటి నుంచి ఎప్పటి వార్తలను అప్పుడు అఖిలేశ్‌కు చేరవేస్తూ వచ్చారు. మొదట్లో ఆమె హెచ్చరికలను అంతగా పట్టించుకోని అఖిలేశ్ క్రమంగా వీటిని అర్థం చేసుకుంటూ వచ్చి, భార్య మాటలకే ప్రాధాన్యం ఇవ్వడం ప్రారంభించారు. ముఖ్యంగా కొద్ది నెలలుగా ఇంట్లో జరుగుతున్న విషయాలను ఆయన స్వయంగా గమనించిన తరువాత డింపుల్ చెప్పింది నిజమేనని ఆయన భావించడం మొదలుపెట్టారు.

ఇంటి రాజకీయాలు ఏ స్థాయికి చేరాయంటే, సోదరుల మధ్య, తండ్రీ కొడుకుల మధ్య, బాబాయికి అబ్బాయికి మధ్య, సవతి తల్లి సవతి కుమారులకు మధ్య పచ్చగడ్డి వేస్తే భగ్గుమన్న చందంగా ఇంటి పరిస్థితి మారిపోయింది. ఈ ఇంటి రాజకీయాల ఫలితంగానే అఖిలేశ్ తన పార్టీ నుంచి సస్పెండ్ కావాల్సి వచ్చింది. అఖిలేశ్ సస్పెండ్ కాబోతున్న విషయాన్ని డింపుల్ ముందుగానే పసిగట్టి భర్త చెవిలో వేశారు. ఈ సమస్యలు విజృంభిస్తున్న కొద్దీ డింపుల్ అఖిలేశ్‌కు గట్టి అండగా నిలబడుతూ వచ్చారు. ఆమె క్రమంగా అఖిలేశ్‌కు ముఖ్యమైన రాజకీయ సలహాదారుగా మారిపోయారు. ఆయన పౌర సంబంధాలను, ఆయన సోషల్‌మీడియా నెట్‌వర్క్‌ను కూడా ఆమే సమర్థవంతంగా పర్యవేక్షిస్తుంటారు. ఇంటి రాజకీయాలకు ఆమె దూరంగానే ఉంటూ వచ్చారు. కానీ, బయట రాష్ట్రంలో ఆయన ఇమేజ్‌ను పెంచడానికి మాత్రం విశేషంగా కృషి చేశారు. ఈ విషయంలో ఆమె విజయవంతం అయ్యారు కూడా. డింపులే తనకు కొండంత అండ అనీ, తన బలమంతా డింపులేననీ అఖిలేశ్ అనేక పర్యాయాలు పత్రికల వారికి కూడా చెప్పారంటే ఆమె ప్రాధాన్యాన్ని అర్థం చేసుకోవచ్చు.

## దూకుడు రాజకీయాలు

ముప్ఫయ్యేళ్ల వయసున్న అపర్ణా యాదవ్ ప్రముఖ జర్నలిస్టు అరవింద్ సింగ్ బిస్త్ కుమార్తె. 2014లో ఆయనను రాష్ట్ర సమాచార కమిషనర్‌గా రాష్ట్రప్రభుత్వం నియమించడం జరిగింది. డింపుల్‌లా కాకుండా అపర్ణ చిన్నప్పటి నుంచీ రాజకీయ నాయకులతో కలిసి తిరిగిన వ్యక్తి. ములాయం సింగ్ యాదవ్ ఆమె తండ్రికి ముఖ్యమైన స్నేహితుడు. లక్నోలో ఆ ఇద్దరూ తరచు కలుస్తుంటారు. తానొక దౌత్యవేత్త కావాలని ఆమెకు చిన్నప్పటి నుంచీ కోరిక. డిగ్రీలో పొలిటికల్ సైన్స్, మోడరన్ హిస్టరీ, ఇంగ్లీష్‌లు చదివిన అపర్ణ మాంచెస్టర్ యూనివర్సిటీలో ఇంటర్నేషనల్ రిలేషన్స్ మీద మాస్టర్స్ డిగ్రీ చేశారు. ఇంగ్లండ్‌లో ఉన్నప్పుడే ఆమెకు ప్రతీక్‌తో పరిచయం ఏర్పడింది. ఆయన కూడా అప్పుడు లీడ్స్ యూనివర్సిటీలో పోస్ట్ గ్రాడ్యుయేషన్‌లో మేనేజ్‌మెంట్ కోర్సు చేస్తుండే వారు. డింపుల్ లాగే అపర్ణ కూడా ఉత్తరాఖండ్‌లో ఠాకూర్ కుటుంబం నుంచి వచ్చిన వ్యక్తే. ఇష్టం ఉన్నా లేకపోయినా వాళ్ల వివాహానికి ములాయం ఒప్పుకోవాల్సి వచ్చింది. అపర్ణా, ప్రతీక్‌లకు ఒకే ఒక కుమార్తె ఉంది.

తన కుమారుడు ప్రతీక్ ములాయంకు వారసుడు కావాలని ములాయం సింగ్ రెండవ భార్య సాధనా గుప్తా కోరిక. అయితే, ప్రతీక్‌కు రాజకీయాలంటే ఇష్టం లేకపోయేసరికి అపర్ణ ఆ బాధ్యతలు చేపట్టాల్సి వచ్చింది. అఖిలేశ్‌ను ఏదో విధంగా అణచివేయాలని ఎదురు చూస్తున్న అఖిలేశ్ బాబాయి శివ్‌పాల్‌యాదవ్ క్రమంగా అపర్ణకు మద్దతునివ్వడం ప్రారంభించారు. లక్నో కంటోన్మెంట్ అసెంబ్లీస్థానం నుంచి పోటీ చేయడానికి అపర్ణకు ములాయం గత ఏడాది మార్చిలోనే పచ్చజెండా చూపించారు. విచిత్రమేమిటంటే, ఈ సీటునుంచి సమాజ్‌వాది పార్టీ ఏనాడూ గెలిచిన పాపాన పోలేదు. డింపుల్ అఖిలేశ్ భార్యగా పోటీ చేశారు. కానీ అపర్ణ మాత్రం సొంత గుర్తింపుతో పోటీచేయడానికి మొదటి నుంచీ ఈ నియోజకవర్గాన్ని తనకు అనుకూలంగా చేసుకుంటూ వచ్చారు. పైగా రాజకీయంగా, కుటుంబపరంగా ఆమె భిన్నమైన ప్రయత్నాలు చేస్తూ వచ్చారు. డింపుల్ మొదటినుంచీ సంప్రదాయ రాజకీయాలకు తగ్గట్టుగా వ్యవహరించారు. అపర్ణ మాత్రం తనలోని అనేక రాజకీయ కోణాలను ప్రదర్శిస్తూ, వ్యక్తం చేస్తూ వచ్చారు.

రాజకీయంగానే కాక, ఆమె విద్యాపరంగా, కళల పరంగా కూడా డింపుల్‌కు భిన్నమైన వ్యక్తి. సంగీతం, చిత్రలేఖనం, స్కై డైవింగ్‌లలో కూడా ఆమె దిట్ట. మామూలు జనంతో కలిసిపోయి రోడ్ల మీద ఐస్‌క్రీం తింటూకూడా వార్తల్లోకి ఎక్కారు. రాజకీయాల్లోకి ప్రవేశించేవరకూ ఆమె జీన్స్, బూట్స్ మాత్రమే ధరించేవారు. రాజకీయాల్లోకి వచ్చిన తరువాత మాత్రమే ఆమె చీర కట్టడం ప్రారంభించారు. ఆమెకు చొరవ ఎక్కువ. ఆమె ప్రధాని నరేంద్ర మోదీతో సెల్ఫీలు దిగారు. హోం మంత్రి రాజ్‌నాథ్ సింగ్‌ను కలుసుకుని ఆయనకు పాదాభివందనం చేశారు. ఆమె తరచూ సోషల్ మీడియాలో బీజేపీ అనుకూల వ్యాఖ్యలు చేస్తుంటారు. తాను బీజేపీకి అనుకూలంగా మారిపోతాననే బెదిరింపుతో ఆమె లక్నో సీటు సంపాదించారని కుటుంబ సన్నిహితులు చెబుతుంటారు. "నా సొంత అభిప్రాయాలు నాకున్నాయి. అయితే, జనాన్ని నా భావాలకు అనుకూలంగా మార్చుకోగలను. ఆ నమ్మకం నాకుంది. ఉత్తరప్రదేశ్‌లో మాయావతిలా వ్యవహరించకుండానే రాజకీయాల్లో పైకి రావచ్చు" అని ఆమె అంటుంటారు.

అత్యాచారాల మీద ములాయంసింగ్ కొన్ని ప్రజావ్యతిరేక వ్యాఖ్యలు చేసినప్పుడు డింపుల్ మాత్రమే ఆయన వ్యాఖ్యల్ని సమర్థించారు. అపర్ణ ములాయం వ్యతిరేక వ్యాఖ్యలు చేయడానికి ఏమాత్రం వెనుకాడలేదు. "ఇలా జరగడానికి తామే కారణమనో, తమదే పొరపాటనో మహిళలు భావించనే కూడదు. ఇటువంటికేసుల్లో మనం పురుషులనే తప్పుపట్టాలి తప్ప మహిళలను కాదు" అని అపర్ణ వ్యాఖ్యానించారు. "ఆమెకు ధైర్యం ఎక్కువ. ఆమె విజయాలు సాధించడం ఖాయం. ఏ పనిచేసినా ఆమె అగ్రస్థానంలో ఉండడం ఖాయం. ఆమె ఎక్కడా వెనుకంజ వేయదు" అని ప్రతీక్ చెబుతుంటారు. ఉత్తరప్రదేశ్ ఎన్నికలతో గానీ ఈ సంగతి పూర్తిగా నిర్ధారణ కాదు.

నవ్య

# మహానంది





-వక్కంతం సూర్యనారాయణరావ్, సెల్:98662 67287

**నందిగోడకు జార్లాబడి కూచున్నాడు. పూరిపాక గోడను ఆనుకుని ఉన్న కుక్కి మంచం మీద రాకుమారి లాలస ఆదమరిచి నిద్రపోతోంది. నగరం చివర దూరంగా విసిరి వేసినట్టున్న పూరిపాక, అపరంజి భోజనశాలలో పనిచేసే సహాయకుడిది. చీకటి రాత్రిలో గడపడానికి అనువైన ప్రదేశం. ఉలూకుడికి అనుమానం రాని ప్రదేశం. సహాయకుడు చేసిన చక్కటి ప్రతిపాదన. అతను వివరించిన ఆనవాళ్ళ ఆధారంగా చాలాసేపు ఉప వీధులగుండా నడిచి, అర్ధరాత్రి దాటే సమయానికి ఇక్కడికి చేరుకున్నారు.**

అపరంజి తెలివిగా రాకుమారికి మారువేషం వేసింది. ఆమె శిరోజాల అమరికతో ముఖం మారిపోయింది. పైకి కనిపించే ఆమె చర్మం రంగు నల్లగా మారిపోయింది! తనూ వస్త్రాలు మార్చుకున్నాడు. తలపాగా తన మూల రూపాన్ని తనలో దాచుకుంది! అపరంజి, ఆమె భర్త క్షేమం కోసం తాను ఆడుతున్న నాటకాన్ని చక్కగా రక్తి కట్టించారు! భోజనాలకి వచ్చిన వాళ్ళందరూ ఆ నాటకాన్ని ఆసక్తిగా చూశారు. ఉలూకుడు గానీ, ఇతర రాజోద్యోగులు గానీ వస్తే, అపరంజి దంపతులు పరదేశచోరుణ్ణి వెళ్లగొట్టారని సాక్ష్యం చెబుతారు. వాళ్ళందరూ చూస్తుండగానే తాను అపరంజి దంపతులను వేడుకున్నాడు. కాళ్ళావేళ్ళా పడ్డాడు. తాను దొంగను కానన్నాడు. తనను వెళ్లగొట్టద్దన్నాడు. ఇక మీదట రాజభటుల మీదా, ఉలూకుడు

**జరిగిన కథ**

**కా**మరూపరాజ్య సర్వసైన్యాధ్యక్షుడు రుద్రాక్షుడిని రాజద్రోహిగా నిర్ధారించి యావజ్జీవ కారాగార శిక్ష విధించాడు మహారాజు కుబేరవర్మ. రుద్రాక్షుడి కొడుకు నందికి రాజ్యబహిష్కార శిక్ష విధిస్తాడు. పొరుగు రాజ్యంలో సత్రం నిర్వాహకురాలి ఆశ్రయం పొందుతాడు నంది. స్వయంవరం రోజున యువరాణి లాలసాదేవి మాయమవుతుంది. రాకుమార్తెను కళింగ యువరాజు కళింగరత్న అపహరిస్తాడు. విషయం తెలుసుకున్న మహారాణి చేసిన తప్పుని సరిదిద్దుకోమంటూ, తమ పూజా మందిరంలో ఉన్న కలశ చరిత్రను వివరిస్తుంది. కళింగరత్న తన ఉపాయాల్లో తానుండగానే, లాలస తప్పించుకుంటుంది. లాలసను వెతికేందుకు బయలుదేరిన ఉలూకుడి నుంచి ఆమెను, నంది రక్షిస్తాడు. ఆమెను కామరూప యువరాణిగా తెలుసుకొని ఆశ్చర్యపోతాడు. ఇంతలో ఉలూకుడు నందిని పట్టి బంధించేందుకు భటులసహా వస్తాడు. వాళ్లను చావమోది వెనక్కి పంపేస్తాడు నంది. ఉలూకుడు మళ్లీ దాడిచేసే అవకాశం ఉండటంతో అక్కడినుంచి లాలససహా బయటపడాలనుకుంటాడు నంది.

**ఆ తర్వాత....**

లాంటి ఉద్యోగుల మీదా తిరుగుబాటు చేయనంటూ మొత్తుకున్నాడు!

తను నేర్పిన తిట్లన్నీ అపరంజి అతి సహజంగా తిట్టింది! ఆమె భర్త మోదకుడు ఒంటి కాలి మీద నిలుచుని, దుడ్డుకర్రతో తనను కొట్టినంత పనిచేశాడు! "మెడపట్టి గెంటుతుంటే అడుగులు పట్టుకుని అడుక్కుంటావేంటయ్యా? సిగ్గూ, లజ్జా లేదా? నీలాంటి పరదేశ చోరుడికి మా కళింగ రాజ్యంలో చోటు లేదు!" అంటూ భోజనాలకు వచ్చిన వాళ్ళందరూ తనను కేకలేశారు!

నాటకం పూర్తయ్యాక తను బయలుదేరాడు, బరువుగా కాళ్లు ఈడ్చుకుంటూ. భోజనశాల వెనక ఇరుకు సందులో చీకటిలో యువరాణి లాలస తన కోసం వేచి ఉంది. ఆమె చేతిలోని చిన్న మూట తీసుకున్నాడతను. అపరంజి పెట్టిన తిండీ, బట్టలూ ఉన్నాయందులో! సడీ చప్పుడూ లేకుండా, ఇద్దరూ చీకట్లో సహాయకుడి పూరిపాక వైపు నడక సాగించారు.

నంది బరువుగా నిట్టూర్చాడు. మానవుల మధ్య అనుబంధాలు ఏర్పడడానికి అట్టే కాలం అవసరం లేదు. భజరంగి కుటుంబంతో పరిచయం, అపరంజి కుటుంబంతో పరిచయం తనకు ఆ సత్యాన్ని స్పష్టం చేశాయి. తనకు వీడ్కోలు పలుకుతున్న ఆ దంపతుల విచారం ఇంతా అంతా కాదు. అపరంజి జలజలా కన్నీళ్లు కారుస్తూ వలవలా ఏడ్చేసింది. మోదకుడు చెమర్చుతూనే ఉన్న కళ్లను తుడుచుకుంటూనే ఉన్నాడు. పిల్లల మౌన విషాదం అందరినీ కలిచివేసింది. యువరాణి కళ్లు వర్షిస్తూనే ఉన్నాయి. దోసిట్లో మొహం దాచుకుని ఉండిపోయింది.

"నేను...వచ్చాను, మీ మధ్య ఆప్యాయతలను నా స్వార్థంతో ఖండించాను. ప్రాణహానీ, మానహానీ జరుగుతాయన్న భయం నా చేత ఈ అన్యాయాన్ని చేయిస్తున్నాయి..." అపరంజి చేతులు పట్టుకుని గద్గదస్వరంతో అంది లాలస.

ఆమె మాటలు అపరంజిని కదిలించివేశాయి. "మీ స్థితిలో నేనున్నా ఇదే చేసి ఉండేదాన్ని యువరాణిగారూ! మీకు తీరని అన్యాయం జరిగింది. స్త్రీకి రాకూడని కష్టం వచ్చింది మీకు! నంది కష్టాల కడలిని దాటించగలడు!"

"రాకుమారిగారూ, మీకు జరిగిన అన్యాయం మా కళింగరాజ్యానికి కళంకం తెచ్చే ఘోర నేరం. ఆ కళంకాన్ని కడిగివేసే ప్రయత్నం మా ఇంట్లో ప్రారంభమైనందుకు గర్విస్తున్నాను!" మోదకుడు గర్వంగా అన్నాడు.

"నన్ను 'మీరు' అనకండి. మీ బిడ్డలాంటిదాన్ని. అమ్మ ఒడి చేరేదాకా నేను సామాన్య యువతినే..." లాలస కళ్ళు తుడుచుకుంటూ అంది.

"అపరంజీ, నందికి ఇవ్వడం మరిచిపోయేవు సుమా!" మోదకుడు నర్మగర్భంగా హెచ్చరించాడు.

"ఎలా మరిచిపోతాను?" అంటూ రొంటిన దోపుకున్న చిన్న గుడ్డ సంచిని ఇవతలికి లాగింది అపరంజి.

సంచిలోని నాణేలు గలగలమన్నాయి. "నాయనా... ఎంత దూరం ప్రయాణం చేయాలో, ఎన్ని నాళ్ల ప్రయాణం చేయాలో, ఎన్ని ఊళ్ల దాటాలో... దారి బత్తెం అవసరం. గుప్పెడే గుప్పెడు వరహాలు... తీసుకో! దానం అనుకోవద్దు. సహాయం అనుకోవద్దు. అక్కయ్య ఇస్తున్న దీవెన అనుకో!" అపరంజి నందికి సంచి అందిస్తూ అంది.

"మీకు రుణపడిపోతున్నాను.." నంది సంచిని అందుకుంటూ అన్నాడు. "మీ ప్రేమనూ, దీవెనలనూ నిరాకరించలేను."

"మీ కోసం రొట్టెలు సిద్ధం చేయించాను. రెండు మూడు దినాలు బాగానే ఉంటాయి." అపరంజి చిన్న మూట లాలసకు అందిస్తూ అంది. "ఇందులో ఇద్దరికీ అవసరమైన బట్టలున్నాయి తల్లీ.."

"మిమ్మల్ని భవిష్యత్తులో కలుసుకోవాలి. మీ రుణం తీర్చుకోవాలి. అందుకోసం మా ఇలవేలుపు కామరూపాంబికను ప్రార్థిస్తాను" లాలస గద్గద కంఠంతో అంది.

"అపరంజీ, ఆ ఉలూక రాక్షసుడు ఏ క్షణంలో అయినా బలగంతో రావచ్చు. యువరాణిని మన తోట



వెనుక చీకటి సందులో వదిలిపెట్టిరా. భోజనశాలకు వెళ్ళి జనం కళ్ల ముందు నందిని వెళ్లగొడదాం!" మోదకుడు చిరునవ్వుతో హెచ్చరించాడు.

పూరిపాకలో ప్రవేశిస్తున్న మసక వెల్తురూ, కోడిపుంజుల మేలుకొలుపులూ నందిని హెచ్చరించాయి. ఆలోచనలు చాలించి, నంది కూచున్న చోటు నుండి లేచాడు. పెరటివైపు ఉన్న పొట్టి తలుపు తెరుచుకుని, వెలుపలికి వెళ్ళాడు. వేకువ వెల్తురు చీకటిని అటూ ఇటూ తరుముతోంది. నిద్ర లేని కారణంగా కళ్లు మండుతున్నాయి. రాకుమారి రక్షణ బాధ్యత తనకు నిద్రను దూరం చేసింది!

దంతధావనాదికాలు ముగించి, తాను ప్రయాణానికి సిద్ధం కావాలి. రాకుమారిని మేలుకొలిపి, ఆమెనూ సిద్ధం చేయాలి. నంది వేపకొమ్మ విరుచుకుని నీటి తొట్టె వైపు అడుగులు వేశాడు. మసక చీకటి మాటునే నగర పొలిమేర దాటివెళ్లాలి.

•••

మోదకుడూ, సహాయకుడూ సూచించిన దిశగా నడుస్తున్నాడు నంది. యువరాణి లాలస అతడికి దగ్గరగా ఉండే ప్రయత్నంలో వేగంగా అడుగులు వేస్తోంది. ఎత్తుగా, దట్టంగా పెరిగిన మహావృక్షాలు సూర్యకాంతిని అడ్డుకునే ప్రయత్నం చేస్తున్నాయి. నంది ముళ్లపొదల మధ్య ఆగి, లాలస వైపు చూస్తూ చిరునవ్వు నవ్వాడు.

"నలుగురు నడిచే దారి మనకు ప్రమాదం. అందుకే ముళ్ల దారిలో, రాళ్ల మధ్య తీసుకు వెళ్తున్నాను. కళింగరాజ్య పరిధి దాటేదాకా మనం మనిషి కంట పడకూడదు..."

"వాళ్లు... వాళ్లు మనల్ని వెంటాడతారంటారా?" లాలస అనుమానం వ్యక్తం చేసింది.

"ఉలూకుడికీ, యువరాజుకీ కావల్సింది నేను కాదు; మీరు! తప్పకుండా వెంటాడతారు; నలుదిశలా వేటాడుతారు. మనిషి అంత సులభంగా ఓటమిని అంగీకరించడు! మోదకుడు చెప్పినట్టుగా చీకటి పడేసరికి మనం క్షీరసాగరం అనే పట్టణం చేరుకుంటాం. అది కళింగ రాజ్యంలోనిదే. కళింగరత్న తమ రాజ్యంలోని గ్రామాలలో, పట్టణాలలో, నగరాలలో తన సైనికులనూ, రక్షకులనూ అప్రమత్తం చేస్తాడు. అశ్విక భటుల ద్వారా మన పలాయనం గురించి జనవాసాలకు తెలియజేయబడుతుంది. జనావాసాలలో ప్రవేశించే అవకాశం మనకు లేదు. మన ప్రయాణం కొండలలో, కోనలలో సాగాల్సిందే" నంది వివరించాడు.

లాలస బెదురు చూపులు చూసింది. అంతఃపుర కన్య. రాళ్లూ, ముళ్లూ, కొండలూ, కోనలూ, పాదాలు బొబ్బలెక్కే నడక, కాళ్లు పట్టివేసే పరుగు-తెలియని సౌకుమార్యం! నంది చిరునవ్వుతో ఆమె వైపు చూశాడు. "భయపడకండి. సురక్షితంగా అంతఃపురానికి చేరుస్తాను. మీకు దాపురించిన అపాయంతో, కష్టంతో పోలిస్తే ఈ దుర్గమ మార్గ ప్రయాణం ఎంత?"

"ఔను..." లాలస ధైర్యంగా అంది.

గలగలా పరుగులు తీస్తున్న సెలయేటి సవ్వడి వింటూ, అటువైపు అడుగులు వేశాడు నంది. మెలికలు తిరుగుతూ, ఏటవాలుగా ప్రవహించుకుపోతున్న సెలయేటి సమీపంలో పచ్చిక మీద కూర్చుని, కూర్చోమన్నట్టు ఆమె వైపు చూశాడు. లాలస మెత్తటి పచ్చిక మీద కూర్చుంది.

ఏదో శబ్దం లీలగా వినిపించింది. చెవులు రిక్కించాడు నంది. గుర్రపు డెక్కల చప్పుడు! కాసేపటికి అశ్వికులు తమవైపే వస్తూ కనిపించారు. మనం వేరే దారి చూసుకోవాలి అంటూ నదీప్రవాహం వైపు పరుగుతీశాడు నంది. తన ఉత్తరీయాన్ని తీసి ముళ్ళు వేస్తూ, మీకు అశ్వికరోహణం తెలుసా? అని అడిగాడు. ఆమెను నంది ఆ ప్రశ్న ఎందుకడిగాడు? వాళ్ళను తరుముతూ వస్తోంది ఉలూకుడేనా?

ఇద్దరూ చేతులూ, ముఖాలూ కడుక్కున్నారు. అపరంజి వేసిన మారువేషం ఛాయలు రాకుమారి లాలస ముఖం మీద అక్కడక్కడా నల్లటి మరకల్లా ఉన్నాయి.

కుడివైపు నుండి, లీలగా వినవస్తున్న ప్రవాహం శబ్దాన్ని చెవులు రిక్కిస్తూ విన్నాడు నంది. కింద ఎక్కడో ఏదో నది ప్రవహిస్తోంది. సెలయేరు ఆ నదీ సంగమం కోసం ఉరకలు పెడుతూ వెళ్తోంది! అపరంజి కట్టి ఇచ్చిన మూట విప్పాడు నంది. రొట్టెలు, రెండు రంగుల్లో ఉన్న రెండు రకాల పచ్చళ్ళు. నంది అటూ ఇటూ చూశాడు. దగ్గర్లో ఉన్న మోదుగ చెట్టు తన ఆకుల్ని కోసుకొమ్మని ఆహ్వానిస్తూ కనిపించింది. నంది లేచి వెళ్ళి, వెడల్పుగా, లేతగా మెరుస్తున్న మోదుగాకుల్ని తెంపి తెచ్చాడు. ఆకుల్ని నీటిలో తడిపి, పచ్చిక మీద విస్తర్లలా గుండ్రంగా పేర్చాడు. రొట్టెల్నీ, పచ్చళ్లనీ విస్తర్లలో వడ్డించాడు. ఇద్దరూ ఆకలిగా తినడం ప్రారంభించారు.

"సామాన్యులు తినే తిండి ఇంత రుచిగా ఉంటుందని నాకు తెలీదు! అపరంజి ఇంట్లో అడుగు పెట్టాకే తెలిసింది" లాలస తృప్తిగా ఆరగిస్తూ అంది.

"మీది బంగారు పళ్లాలలో భోజనం. బంగారు పళ్లెం ఆహారం రుచిని పెంచదు. విస్తర్లు అలా కాదు. పచ్చి మోదుగ ఆకులు ఆహారానికి ఒక రకమైన సువాసననూ, రుచినీ ఇస్తాయి. మర్రి ఆకులూ అంతే. అవి అందించే సువాసనా, రుచీ మరో రకంగా ఉంటాయి.

తామరాకుల్లో వడ్డించుకుని తింటే ఓ ప్రత్యేకమైన రుచీ, వాసనా ఆకలిని పెంచుతాయి. ఇంక అరిటాకు భోజనం అద్భుతం! గడ్డ పెరుగన్నం గానీ, మీగడ పెరుగన్నం కానీ తింటే అరిటాకులో వడ్డించుకుని తినాలి!"

"ఓహ్! ఇవన్నీ మీకు ఎలా తెలుసు?" లాలస కుతూహలంగా అడిగింది.

"అమ్మ చేతి వంట. అమ్మ చేతి వడ్డన. ఏ పదార్థం ఏ ఆకులో తినాలో అమ్మకు బాగా తెలుసు! మోదుగ, మర్రి, తామర, అరటి ఆకులలో మాకు రుచులు చూపించేది!"

"ఇప్పుడు కూడానా?" లాలస అడిగింది.

నంది తల అడ్డంగా ఊపాడు. "అమ్మ లేదు, స్వర్గానికి వెళ్ళిపోయింది."

లాలస సానుభూతితో చూస్తూ, నిట్టూర్పు విడిచింది. ఇద్దరూ భోజనం ముగించి, చేతులు కడుక్కున్నారు. నంది రొట్టెలు, బట్టలు ఉన్న




గాలి వీస్తుంది
ఆకులు పోగొట్టుకొని కొన్ని చెట్లు
కొ(రె)మ్మలు విరిచేసుకొని కొన్ని చెట్లు
గాలి నిదానించలేదు; ఒకే దిశగా పరుగులు
తీస్తుంది
ఇక నిభాయించుకొని ఏమి కోల్పోకుండా ఏ చెట్లూ

## గాలి వీస్తుంది

మిగల్లేదు
దాన్ని రౌద్రరూపానికి
చెట్లన్నీ సలాం తరువులన్నీ గులాం
మలయమారుతంలా మొదలైన గాలి
చండమారుతమై
ఊడల్ని వ్రేళ్ళాడదీసుకు బాహుబలిగా నిలబడ్డ
చెట్లు కూలి
వేర్లన్నీ ఇటూ అటూ జరగగ
పెద్దవృక్షాలే అమాంతం భూమ్మీద్కి వొరగగ

•••

## కల క్షణమే

నీలాల నింగిని, సిగలోని నక్షత్రాల్ని చూసి
మురిసి ప్రేయసిలా భ్రమసి
ఇంతలో దట్టమైన పొగతో నల్లటివర్ణమై
రాక్షసిలా అగుపిస్తే; భోరునవానై కురిస్తే
ఒక నిమిషం ఊరించిన ఊహల భావన



మరో నిమిషం ఉడికించిన ఉప్పెన కామన
కలక్షణం ఇలరణం

-కోటం చంద్రశేఖర్
సెల్: 94920 43348

మూటను బిగిస్తున్నాడు.

లాలస తటాలున అతని చేతిని పట్టుకుంది. ఆమె చేతి స్పర్శ చల్లగా ఉంది. ఆమెచేతి మీద నుంచి చూపులను ఆమె ముఖం పైకి మళ్ళించాడు నంది.

"వింటున్నారా?" లాలస కంఠం కొద్దిగా వణికింది.

నంది చెవులు రిక్కించాడు. గుర్రాల డెక్కల చప్పుడు...సెలయేటి గలగలకు డెక్కల చప్పుడు తాళం వేస్తోంది. నంది చివాలున పైకి లేచాడు. ఏటవాలు ప్రాంతం నుండి కొద్ది దూరం పైకి పరుగెట్టాడు. బోర్లా పడుకుని, తల పైకెత్తి, చూస్తూ ఉండిపోయాడు. డెక్కల చప్పుడు దగ్గరగా వస్తోంది. గుర్రాల కాళ్ళు కనిపిస్తున్నాయి. కొన్ని క్షణాల్లో గుర్రాలూ, అధిరోహించిన అశ్వికులూ కనిపిస్తున్నారు, తమ వైపే వస్తూ...

నంది జాగ్రత్తగా వంగి, లాలస దగ్గరగా పరిగెట్టాడు. మూట అందుకున్నాడు. "అశ్విక భటులు అన్వేషిస్తూ ఇటువైపే వస్తున్నారు.."

"మ...మనకోసమేనా?" లాలస కూచున్న చోటునుండీ లేస్తూ అంది.

"అశ్విక భటుల ముందు వస్తున్న ఉలూకుడు మనకోసమే అని చెప్తున్నాడు!"

"ఎలాగా?" లాలస కంఠం వణికింది.

సమాధానంగా నంది ఆమె చేతిని పట్టుకున్నాడు. "వేరే దారిలో వెళ్ళాలి..."

"వేరేదారి....ఎక్కడ? క..క..కనిపిస్తోందా?"

"వినిపిస్తోంది!" అంటూ నంది లాలసను లాగుతూ, ఏటవాలుగా ఉన్న ప్రదేశంలో, దారి కలుపుతూ వెళ్తున్న సెలయేటి పక్కగా పరుగు ప్రారంభించాడు.

లాలస రాళ్లనీ, ముళ్లనీ లెక్కచేయకుండా పరిగెడుతోంది. భయం ఆమెను వెన్నంటి తరుముతోంది. వంద గజాల దూరంలో వేగంగా ప్రవహించుకుపోతున్న నది, కింది లోయలోంచి కనిపిస్తోంది. నంది పరుగులో వేగం పెరిగింది. తూలుతూ, సర్దుకుంటూ పరుగు తీస్తోంది లాలస. గుర్రాల డెక్కల చప్పుడు నదీప్రవాహ శబ్దంతో కలిసి వినిపిస్తోంది. నంది ప్రవాహం దగ్గర ఆగాడు. ఒకసారి తలెత్తి పైకి చూశాడు. అశ్వికులు కనిపించలేదు.

"రాకుమారీ మీకు ఈత వచ్చా?" నంది ఆమె చేతిని వదుల్తూ ప్రశ్నించాడు.

లాలస భయంగా చూసింది. "ఉద్యానవనం ఈతకొలనులో ఈదడం వచ్చు. నదిలో ఈదలేను. నాకు...భ..భ..భయంగా ఉంది."

నంది మాట్లాడకుండా తన నడుం చుట్టూ చుట్టుకున్న పొడుగాటి ఉత్తరీయాన్ని తీశాడు. దానిని తాడులాగా మెలిపెట్టాడు. వీపు మీదుగా, రెండు చేతుల కింద నుండీ రెండు కొసల్నీ తన ముందువైపుకి తీసుకువెళ్ళి, గట్టిగా కలిపి ముడి వేశాడు. వర్తులాకారంగా అయిన ఉత్తరీయం ముడి వేసిన భాగాన్ని తల మీదుగా తన వీపు మీదకు వేసుకున్నాడు. చేతుల కింది భాగాల నుండి భుజాల మీదుగా, నంది వీపు మీద వాలిన ఉత్తరీయాన్ని లాలస అర్థంకానట్టు చూస్తోంది.

"రాకుమారీ, నేను నదిలోకి దిగి, బోర్లాపడు

## అడిగిన దానికన్నా ఎక్కువే చూపించిందట!



'**ము**కుంద' భామ పూజాహెగ్డే కాలం అస్సలు బాగున్నట్టు లేదు. తెలుగులో చేసిన రెండు సినిమాలు సోసోగానే ఆడాయి. బాలీవుడ్ సినిమా 'మొహెంజోదారో' మీద భారీ ఆశలు పెట్టుకుంటే అది కోలుకోలేని ఫలితాన్ని ఇచ్చింది. ఈ దెబ్బకి పూజా కెరీర్ క్లోజ్ అని అందరూ అనుకుంటున్న సమయంలో 'డిజె దువ్వాడ జగన్నాథం' సినిమాలో బన్నీ పక్కన అవకాశం వచ్చింది. ఈ సినిమాలో దర్శకుడు అడిగిన దానికన్నా ఎక్కువే అందాలు ఆరబోశానని పూజానే స్వయంగా చెబుతోంది.

కుంటాను. నా వీపు మీద కూర్చొని, ఉత్తరీయాన్ని పగ్గంలా పట్టుకోండి..."

"దె..దె...దేనికి?"

"నదిలో ఈదుతూ మిమ్మల్ని తీసుకెళ్తాను. అన్నట్టు మీకు అశ్వారోహణం తెలుసుగా?"

"...తెలుసు.."

"మంచిది. అశ్వం మీద కూర్చున్నట్టు నా మీద కూర్చోండి. కళ్లెం పట్టుకున్నట్టు నా ఉత్తరీయాన్ని పట్టుకోండి. కింద మీ రెండు పాదాలు మెలిపెట్టుకోండి.."

"మీ వీపు మీద కూర్చోవడమా?" లాలస కంఠం వణికింది.

"భయపడకండి. ఆలోచించకండి. ఇది ప్రాణ రక్షణ కార్యక్రమం. తప్పులేదు. నేను గజ ఈతగాణ్ణి. ఎన్ని గంటలైనా ఈదుతూ ఉండిపోగలను. సాయుధులైన ఆ ఆశ్వికుల కన్నా చాలా వేగంగా, అశ్వవేగాన్ని మించిన వేగంతో మనం జలప్రయాణం చేయగలం.." నంది నదిలోకి దిగుతూ అన్నాడు.

లాలస నిలుచున్న చోటే ఉండిపోయింది. నంది పరపురుషుడు. అతని వీపు మీద... లాలస ఆలోచనలను గుర్రాల డెక్కల చప్పుడు కత్తిరించి వేసింది.

"అశ్వికులు వచ్చేస్తున్నారు! ఆలస్యం చేస్తే అపాయంలో పడతాం! రండి! నన్ను మనిషి అనుకోకండి. నదిలో కొట్టుకుపోతున్న ఎండు మోడు అనుకోండి!" నంది నీళ్ల మీద బోర్లా వాలుతూ అన్నాడు.

పై నుండి భటుల కంఠాలు ఒక్కసారిగా ఆశ్చర్యంగా అరిచాయి. లాలస కంగారుగా చూసి, నీటిని సమీపించింది. నంది భుజాల మీదుగా వీపు మీదికి సాగిన వస్త్రాన్ని పట్టుకుంది. ఒకసారి కళ్లు మూసుకుని, కామరూపాంబికను తలచుకుంది. భయం ఆమెకు ధైర్యాన్నిస్తోంది.

"ఎక్కండి! భయం వేస్తే కళ్ళు మూసుకోండి!" నంది హెచ్చరించాడు.

లాలస గట్టు వైపు వాలుగా చూసింది. భటులు గుర్రాలు దిగుతున్నారు. ఉలూకుడు అరుస్తూ, వాళ్లను హెచ్చరిస్తున్నాడు. లాలస కుడిచేత్తో నంది వీపుని స్పృశించి, కళ్ళకు అద్దుకుంది. పావడను సర్దుకుని అతని వీపు మీదుగా, కుడికాలుని పోనిచ్చింది. క్షణంలో లాలస తన వీపు మీద కూర్చుందని గ్రహించాడు నంది. అతని చేతులు ఒక్కసారిగా గజబలంతో కదిలాయి. నది ప్రవహిస్తున్న దిశగా అతని శరీరం దూసుకెళ్ళింది. ప్రవాహం ఉధృతమైన వేగంతో నందిని ముందుకు తీసుకువెళ్తోంది. లాలస కాళ్లు అతని శరీర పార్శ్వ భాగాలను గట్టిగా చుట్టుకున్నాయి. గుర్రం కళ్లెంలాగా ఉత్తరీయం అతని భుజాల మీద బిగుసుకుంది.

"రాకుమారీ, భయం లేదు! ఎలాంటి స్థితిలో కూడా నా శరీరాన్ని వదలకండి. మీరు ప్రయాణం చేస్తోంది మనిషి మీద అని మరిచిపోండి. మీరు చేస్తోంది బల్లకట్టు ప్రయాణం అనుకోండి!" నంది ధైర్యం చెప్తూ అన్నాడు.

"అలాగే..." లాలస సన్నటి కంఠంతో అంది.

నంది కొద్దిగా పక్కకు తిరిగి తన శరీరాన్ని నది మధ్యభాగం వైపు పోనిస్తున్నాడు. గట్టు సమీపంలో నది నెమ్మదిగా కదులుతోంది. మధ్యభాగంలో వేగంగా వెళ్తోంది. తమ జలయానం వీలైనంత వేగంగా సాగాలి!

సమీపంలో, నీటిలో దొర్లుతూ ఏవో సర్రుసర్రున చప్పుళ్ళు చేశాయి. నంది వాలుగా చూశాడు. భటులు విసురుతున్న ఈటెలు! అవి తనను అందుకోలేవు. ఉన్నట్టుండి నంది ముఖం మీద చిరునవ్వు మెరిసింది. ఉన్నట్టుండి ప్రవాహం తన దిశను మార్చుకుంది! భటులు ఇప్పుడు తమను చూడలేరు. పల్లం వైపు దూసుకు వెళ్తున్న ప్రవాహమంత వేగంగా, వాళ్లు ప్రయాణం చేయలేరు!

•••

సూర్యుడు ఆకాశంలో ఎగబ్రాకుతున్నాడు. అది ఏ నదో తెలీదు గానీ, తిన్నగా ప్రవహించడం లేదు. కొండల్ని చీలుస్తూ, బండల్ని చుట్టేస్తూ, మెలికలు తిరుగుతూ అనుక్షణమూ వేగం పుంజుకుంటూ పరుగెత్తుతూనే ఉంది. వంకర టింకర వాహిని! ఒకసారి సూర్యుడు కుడివైపు ఉంటాడు. కాస్సేపట్లో ఎడమవైపు ఉంటాడు! తను యదార్థానికి ఏ దిశగా ప్రయాణం చేస్తున్నాడో తేల్చుకోలేక

పోతున్నాడు నంది. ఒక్కటి మాత్రం నిజం. తమను వేటాడేవాళ్లు వెంటాడలేనంత దూరంలో, వెంటాడలేనంత వేగంతో ప్రయాణిస్తున్నాడు. నది మరో మలుపు తిరిగింది.

నంది కళ్లు చెదిరినట్టయ్యాయి. తన ముందు ప్రవాహం లేదు! నీళ్లు క్రిందికి దూకుతున్నాయి. ఇరవై అడుగుల దూరంలో జలపాతం! ఎంత లోతుందో? దూకితే గానీ తెలీదు. దూకకుండా ఆగే శక్తీ లేదు. తనిప్పుడు నదీతరంగ హస్తాలతో బంధించబడి ఉన్నాడు!

"రాకుమారీ, జలపాతాన్ని సమీపిస్తున్నాం! గట్టిగా, జాగ్రత్తగా పట్టుకోండి! భయపడకండి! కళ్లు మూసుకోండి!" నంది బిగ్గరగా అరుస్తూ హెచ్చరించాడు.

లాలస కాళ్లు అతని చుట్టూ మోకుల్లా బిగుసుకున్నాయి. ముందు వైపు మహా తీక్షణతో ఉరుకుతున్న నదిని చూస్తూ, లాలస కళ్లు గట్టిగా మూసుకుంది. మరుక్షణం సమతలంగా ప్రవహిస్తున్న నది జలపాతంగా మారిపోయింది. నందినీ, లాలసనూ తనలో దాచుకుంటూ ప్రవాహం కళ్లు తిరిగే వేగంతో కిందకి దూకింది.

నంది తల విదుల్చుతూ, కళ్లు తెరిచాడు.




కిందికి దూకి సుళ్లు తిరుగుతున్న నీటిలో తేలుతున్నాడతను. శక్తిని కూడదీసుకుంటూ ప్రవాహ దిశలో కదిలాడు. కాస్సేపట్లో సమ ప్రవాహ ప్రదేశాన్ని చేరుకున్నాడు. తన వీపు మీదున్న లాలస శరీరంలో చలనం లేదు!

"రాకుమారీ!" నంది పిలిచాడు.

సమాధానంగా ఆమె చేతులు కదిలాయి. ఇప్పుడు ఆమె చేతులు తన మెడను చుట్టేసినట్టు గుర్తించాడు నంది. ఆమె శరీరం తన వీపుని సమాంతరంగా అంటిపెట్టుకుని ఉంది! జలపాతం భయంతో లాలస తనను గట్టిగా పట్టుకుని, తన మీదికి వాలిపోయినట్టుంది. ఒక విధంగా ఆమె మంచి పనే చేసింది. భయం ఆమెను సమయస్ఫూర్తితో వ్యవహరించేలా చేసింది. అది సంకల్పిత చర్య కూడా కావచ్చు! కొంచెం దూరంలో సమతలంగా ఉన్న బండరాతిని ప్రదక్షిణం చేస్తూ వెళ్తున్నాయి నీళ్లు. నంది నెమ్మదిగా ఆ బండరాతి మీదకు చేరుకున్నాడు. ఊపిరితిత్తుల నిండుగా గాలి పీల్చుకుంటూ, కాస్సేపు బోర్లా పడుకుని ఉండిపోయాడు. జలపాతంలో పడటం తనను అలసిపోయేలా చేసింది.

"రాకుమారిగారూ...లేవండి, కాసేపు విశ్రాంతి!" నంది మెల్లగా అన్నాడు.

లాలసలో కదలిక ప్రారంభమైంది.

తడిసిన వస్త్రాలు ఆరేదాకా నందీ, లాలసా బండరాతి మీద కూర్చుండిపోయారు. అప్పటికే నడినెత్తి మీదకు చేరిన సూర్యుడి తాపం వాళ్ళ వస్త్రాలను త్వరగానే ఆర్పివేసింది. నంది లాలస వైపు మెప్పుగా చూశాడు.

"యువరాణీ, నదీప్రవాహంలో ధైర్యంగా ప్రవర్తించారు. శరీరావయవాలు వణికిపోకుండా దృఢంగా పట్టుకున్నారు. నది మనల్ని ఎటు తీసుకు వెళ్తుందో, ఏ రాజ్యానికి చేరవేస్తుందో తెలీదు. సాయుధ అశ్వికులు వెంటాడుతున్న ఈ స్థితిలో నేలమీద ప్రయాణం సురక్షితం కాదు. చీకటి పడే దాకా మనం జలయానమే చేద్దాం. ఏమంటారు?"

"నాది ఒక కోరిక..." రాకుమారి లాలస అతని వైపు చూస్తూ అంది. తడిసిన శిరోజాలు ఆమె ముఖాన్ని ఇముడ్చుకున్న నల్లటి చట్రంలా ఉన్నాయి.

"చెప్పండి"

"నన్ను రాకుమారి అనీ, రాజకుమారిగారూ అనీ సంబోధించకండి. 'లాలసా' అంటూ పేరు పెట్టి పిలవండి. నేనిప్పుడు అపాయంలో ఉన్న ఆశ్రితురాలిని.."

నంది ఆమె కళ్లల్లోకి నిదానించి చూశాడు. "యువరాణి వారి కోరిక ఆజ్ఞే! కాదనలేం. అలాగే! అయితే నాదీ ఒక నిబంధన. నన్ను 'మీరు' అనకూడదు. 'నువ్వు' అనాలి. 'నందీ' అనాలి. అప్పుడు ఇద్దరం.."

"సమానమా?" లాలస అందుకుంటూ అంది.

నంది నవ్వుతూ, తలెత్తి సూర్యుడి వైపు చూశాడు. నీటిలోకి జారి బోర్లా తిరిగాడు.

"బల్లకట్టును అధిరోహించు!" అన్నాడు నవ్వుతూ.

"నిన్ను...నిన్ను...నరవాహనంగా చేసుకోవాల్సి వస్తుందని ఊహించలేదు." లాలస కంఠం జీరగా ధ్వనించింది.

"అందుకు విచారాన్నీ, ధన్యవాదాలనీ వ్యక్తం చేసే సమయం ముందుంది! చీకటి పడేలోగా సురక్షిత ప్రదేశం చేరుకోవాలి..." నంది హెచ్చరించాడు.

లాలస లేచి, అతని వైపు కదిలింది.

●●●

నంది తన శరీరాన్ని నదీజల ప్రవాహానికి అప్పగించి వేసి, తల కొద్దిగా పైకెత్తి, చేతుల్ని నెమ్మదిగా అలవోకగా కదిలిస్తూ ఉండిపోయాడు. చెరువులో లాగా, కొలనులో లాగా చేతులూ కాళ్ళూ ఉపయోగిస్తూ, భుజబలంతో ఈత కొట్టాల్సిన అవసరం నదిలో లేదు. ఎండిపోయిన గెడకర్రలా ఉంటే చాలు! ప్రవాహమే తనతో తీసుకెళ్తుంది.

హఠాత్తుగా అడ్డు వచ్చే మలుపుల కోసం, జలపాతాల కోసం నంది కళ్లు జాగ్రత్తగా, అప్రమత్తంగా గమనిస్తున్నాయి. ఒక ఆశ్చర్యకరమూ, ఆనందకరమూ అయిన అంశం ఏమిటంటే ఉదయం నుండీ సాగిన జలయానంలో నదిలో ఎక్కడా తాబేళ్లూ, చేపలూ తప్పా మొసళ్లు కనిపించలేదు! మొసళ్లు లేకపోవడం ఆశ్చర్యాన్ని కలిగిస్తోంది. తమ అదృష్టాన్ని తెలియజేస్తోంది.

పశ్చిమం వైపు వాలుతున్న సూర్యుడు ఇప్పుడు కుడివైపు ఉన్నాడు. అంటే తమ ప్రయాణం దక్షిణం వైపు సాగుతోంది. నింగిలో సూర్యుడు నీటిలో ప్రయాణిస్తున్న తమ కంటే వేగంగా ప్రయాణం చేస్తున్నట్టున్నాడు. ఇప్పుడాయన ఎడమ వైపు నుండీ తమను చూస్తున్నాడు. అంటే ప్రయాణం ఇప్పుడు ఉత్తరదిశగా సాగుతోందన్న మాట! తనకు తెలియకుండానే నది ఎప్పుడో, ఎక్కడో మలుపు తిరిగింది. ఇంతకీ ఇది నదా? నదమా? నది పడమర నుండి తూర్పుగా ప్రవహిస్తుంది. నదం తూర్పు నుండి పడమర దిక్కుగా పరుగులు తీస్తుంది. తను ఎవరో, ఎక్కడికి వెళ్తోందో ప్రవాహమే చెప్పాలి.

లాలస శరీరం నెమ్మది నెమ్మదిగా తన మీదికి వాలుతున్నట్టు గుర్తించాడు నంది. అలసటా, ఎండ వేడిమీ ఆమెను నిద్రలోకి నెట్టివేస్తున్నట్టున్నాయి. ఆమె చేతులు అసంకల్పితంగా తన మెడను చుట్టుకుంటున్నాయి. తన పొట్ట కింది భాగంలో ఆమె పాదాలు ఒకదాన్ని ఒకటి పెనవేసుకున్నట్టున్నాయి.

ఆపద మనుషుల మధ్య దూరాన్ని తేలికగా చెరిపివేస్తుంది! ఒక విధంగా ఆపద ఆప్యాయత కన్నా బలమైంది. లాలస వదులుతున్న ఊపిరి అతని మెడను వెచ్చగా స్పృశిస్తోంది.

సూర్యాస్తమయం కావస్తోంది. నంది నది గట్లవైపు పరిశీలనగా చూస్తున్నాడు. రాత్రికి ఆశ్రయం ఇచ్చే సురక్షిత ప్రదేశం కోసం అతని కళ్లు అన్వేషిస్తున్నాయి. మలుపు తిరిగిన నది వేగం ఉన్నట్టుండి తగ్గింది. నంది ముందుకు చూశాడు. కొంచెం దూరంలో నది రెండుగా చీలి, రాళ్ల గుట్టలతో, చెట్లతో దట్టంగా ఉన్న ప్రదేశాన్ని మధ్యలో ఉంచుకుంటూ ఒద్దికగా చీలి వెళ్తోంది. నది మధ్యలో ద్వీపకల్పం! తమ కోసమే అన్నట్టు సిద్ధంగా ఉంది. నంది చేతులూ, కాళ్లూ అసంకల్పితంగా కదిలాయి. అనువైన, సురక్షితమైన విశ్రాంతి స్థలం-విడిది తన ముందు వేచి చూస్తోంది.

**(ఇంకా వుంది)**



## స్వర్గమంటే ఇదేనేమో!

బిజీ జీవితంలో ఒత్తిడికి దూరంగా, ఆహ్లాదంగా గడపాలనే కోరుకుంటారు ఎవరైనా! దానికోసం ప్రత్యేకంగా టూర్లకు వెళ్ళటం పరిపాటిగా మారింది. ఎవ్వరూ లేని ఏకాంతంలో, ప్రకృతిలో గడపాలనుకునేవారి కోసమే ఏర్పాటు చేశారీ బోరాబోరా హోటల్! ఇది ఎక్కడ ఉందనుకుంటున్నారు?

నీటిపై చిన్న చిన్న గుడిసెలలాగా కనిపించే నిర్మాణాలివి! అద్భుతమైన ఆకావ సెన్ట్రిక్ లగ్జరీ రిసార్ట్స్! ఫ్రాన్స్ సమీపంలోని పసిఫిక్ మహాసముద్ర తీరంలో ఈ దీవులున్నాయి. వీటిల్లో ఒకదీవిని పూర్తిగా ఈ హోటలే ఆక్రమించేసింది. నీటిపై నిర్మించిన మొట్టమొదటి రిసార్ట్స్ ఇదే. ఈ రిసార్ట్స్‌లో ప్రత్యేక సౌకర్యాలు ఎన్నో ఉన్నాయి. కాకపోతే ఖర్చుకూడా కాస్త ఎక్కువే. ఇటువంటి ఆహ్లాద వాతావరణంలో ఒక్కరోజు గడిపినా చాలు అనిపిస్తుంది కదూ!

## రాతిద్వీపం

ప్రాచీన మానవుడు గుహల్లో నివసించేవాడు. ఆ తరువాత ఆకులతో, రాళ్ళతో చిన్న చిన్న కట్టడాలు ఏర్పాటు చేసుకుని అందులో ఉండేవాడు. ఆ తరహా రాతి గుడిసెలు ఐర్లాండ్‌లో నేటికీ చెక్కుచెదరకుండా ఉన్నాయి.

ఐర్లాండ్ సముద్రతీరానికి 12 కిలోమీటర్ల దూరంలో అట్లాంటిక్ మహాసముద్రంలో “స్కెల్లిగ్ మికేల్” అనే రాతిద్వీపం ఉంది. ఆరువందల ఏళ్ళ కిందట ఇక్కడ ఐరిస్ క్రైస్తవ సాధువులు రాతి గుడిసెలు ఏర్పాటు చేసుకున్నారు. పిరమిడ్ ఆకృతిలో ఉంటాయివి. సముద్రంలో దూరంగా ఉన్న ఈ రాతి ద్వీపానికి ఈ మధ్యకాలందాకా ఎవరూ వెళ్ళిచూడలేదు. అందువల్ల ఈ ప్రదేశం నేటికీ చెక్కుచెదరకుండా ఉంది. 12వ శతాబ్దం వరకు ఈ ద్వీపంలో సాధువులు ఉండేవారట. ఆ తరువాత వాతావరణ మార్పులవల్ల ఏర్పడిన తుఫానులు, ఉప్పెనల కారణంగా, వారంతా అక్కడి నుంచి ఐర్లాండ్‌కు తరలి వెళ్ళారు. ఆ తరువాత అక్కడ మఠం లేకపోవడంతో ఈ ద్వీపం యాత్రా స్థలంగా మారింది.






## కిరాయి మొగుళ్ళు

సినిమా కథల్లో, నవలల్లో అద్దె మొగుళ్ల ఉంటారేమో కానీ నిజజీవితంలో కూడా ఉంటారా? అనుకుంటున్నారు కదా! నిజమేనని నిరూపిస్తున్నాయి చైనాలోని కిరాయి మొగుళ్లు, బాయ్‌ఫ్రెండ్స్‌ను అందించే కంపెనీలు.

చైనాలో అమ్మాయిల అవసరాలకు అనుగుణంగా ప్రేమికుడుగా, మొగుడుగా నటించే వ్యక్తులను అందించే కంపెనీలు ఆ దేశంలో బయలుదేరాయి. పెళ్ళి చేసుకోమంటూ పెద్దలు చేసే ఒత్తిడి తట్టుకునేందుకు అమ్మాయిలే ఈ విధమైన కంపెనీలను సంప్రదిస్తున్నారట! దూర ప్రాంతాల్లో ఉద్యోగాలు చేస్తున్న అమ్మాయిలు అద్దెకు తెచ్చుకున్న వారిని తమ తల్లిదండ్రులకు పరిచయం చేస్తున్నారట.




వారికి చెల్లించే అద్దెకూడా కాస్త భారీ స్థాయిలోనే ఉంటుంది. నకిలీ బాయ్‌ఫ్రెండ్‌ని పొందాలంటే యువతులు పదివేల నుంచి 15 వేలవరకు ఖర్చు చేయాల్సి వస్తోందట. పర్సనాలిటీ, విద్యార్హతలనుబట్టి రేటు ఉంటుంది. అయితే మరీ ముక్కూమొహం తెలియని వ్యక్తిని ఇంటికి తీసుకువస్తే తల్లిదండ్రులు అనుమానాలు వ్యక్తంచేసే అవకాశం ఉండటంతో, అద్దె బాయ్‌ఫ్రెండ్‌తో ముందస్తు పరిచయం పెంచుకుని, కొద్ది రోజులు అవసరమైన వ్యక్తిగత విషయాలు అన్నీ చర్చించి, ఆ తర్వాతే ఇంటికి తీసుకెళ్తున్నారట.



## నీలి అగ్నిపర్వతం

అగ్నిపర్వతం అనగానే పొగలు విరజిమ్మే ఎర్రటి లావా కళ్ళముందు మెదులుతుంది. ఒకవేళ అగ్నిపర్వత బిలంలోంచి పైకి విరజిమ్మే లావా ఎర్రటి రంగులో కాక నీలి రంగులో ఉంటే...!

అదెలా సాధ్యం అనుకుంటున్నారా? సాధ్యమేనని నిరూపిస్తోంది ఇండోనేషియాలోని ఓ అగ్నిపర్వతం.

ఇండోనేషియా ఈస్ట్ జావా ప్రాంతంలో ఓ అగ్నిపర్వతం నిరంతరం సల్ఫర్‌గ్యాస్ బైటకు కక్కుతూ ఉంటుంది. ఈ గ్యాస్ గాలిలోని ఆక్సిజన్‌లో కలిసినప్పుడు నీలిరంగు మంటలు ఏర్పడతాయి. 16 అడుగుల ఎత్తుకు ఎగిసిపడే ఈ గ్యాసు ఒక్కొక్కసారి ద్రవరూపంలో కూడా వెలువడటం వల్ల నీలి లావాలాగా కిందకు పారుతూ అగ్ని ప్రవాహంలా కనిపిస్తుంది!

## రోబో ఫార్మసీ

రోబోల ప్రాధాన్యం రోజురోజుకీ పెరిగిపోతోంది. ప్రతీ పనిలోనూ చేదోడుగా రోబోలు ముందుంటున్నాయి. ఇప్పుడు కొత్తగా కేవలం రోబోలతోనే నడిచే మందుల దుకాణం కూడా తెరిచారు.



యునైటెడ్ అరబ్ ఎమిరేట్స్ (యూఏఈ) లో తొలిసారిగా రోబోలే ఫార్మసిస్టులుగా రషీద్ హాస్పిటల్‌లో మెడికల్ దుకాణం ఏర్పాటుచేశారు. వైద్యులు సూచించిన మందులను రోగులకు రోబోలే అందిస్తాయి. వైద్యులు సూచించిన ప్రిస్క్రిప్షన్ మీద ఉండే బార్‌కోడ్ ఆధారంగా మందులిస్తాయి. ఎటువంటి పొరపాటూ జరగదు. దీనివల్ల మందుల పంపిణీలో ఒక్కోసారి వ్యక్తులు చేసే తప్పులు సరిదిద్దుకోవచ్చని చెబుతున్నారు. రోబో ఫార్మసీలో దాదాపు 35 వేల మందులు నిల్వ ఉంటాయి. నిమిషంకంటే తక్కువ సమయంలో దాదాపు 12 మందుల చీటీలకు మందులు అందిస్తుంది. దీనివల్ల సమయం కూడా ఆదా అవుతుంది.

-నర్మద వాసిరెడ్డి

# దానం

## -కె.వి.మన్‌ప్రీతమ్

**అమృత మెడికల్ కాలేజ్ గ్రౌండ్స్....**
**వైద్యశాస్త్రంలో అభినయ్ పట్టా తీసుకునే రోజు.**
**చాలా గ్రాండ్‌గా అలంకరించారు వేదిక. రమామేడమ్ వ్యాఖ్యాతగా మారింది.**
**మేడమ్‌గారి పిలుపుతో యూనివర్సిటీ డీన్, కాలేజీ ప్రిన్సిపాల్, వైస్ ప్రిన్సిపాల్, డిపార్ట్ మెంట్ హెడ్స్ అంతా వేదికనలంకరించారు.**

"మన యూనివర్సిటీ డీన్ డా. సుబ్రహ్మణ్యన్ గారు విద్యార్థులకు వైద్యశాస్త్రం పట్టాలు అందజేస్తారు. దానికిముందు ఒక విషయం చెప్పాలి. ఈ బ్యాచ్‌కి ఒక విశేషం ఉంది. ఏంటంటే, ఇంతవరకు ఎవరూ సాధించనంత మంచిస్కోరు ఈ బ్యాచ్ విద్యార్థులు సాధించారు. ఒక్కొక్కరూ పోటా పోటీగా చదివారు. కానీ గోల్డ్‌మెడల్ ఎవరికి దక్కుతుందో? అనేదే అందరిలోనూ ఉత్సుకత, ఉత్కంఠ. ఫర్ దిస్ బ్యాచ్ గోల్డ్ మెడల్ గోస్ టూ మిస్టర్ అభినయ్... ప్లీజ్ గివ్‌హిమ్ ఏ బిగ్‌హ్యాండ్" అంటూ రమామేడమ్ అభినయ్‌ని వేదికపైకి పిలిచింది.

అభినయ్ ముఖం వెలిగిపోతోంది. అతని తల్లి దండ్రులు లక్ష్మీ, సురేష్ కళ్ళల్లో ఆనందం. వేదిక మీద డీన్‌తో అభినయ్ కరచాలనం చేస్తుంటే, కాలేజ్‌గ్రౌండ్స్ చప్పట్లతో మారుమోగిపోయింది. అభినయ్ మెడలో గోల్డ్‌మెడల్‌వేసి, డాక్టర్‌పట్టా అందించారు డీన్. ఆగకుండా వినిపిస్తున్న చప్పట్లతో, అభినయ్‌కి తెలియకుండానే కన్నీళ్ళు వచ్చాయి.

"మిస్టర్ అభినయ్ ప్లీజ్ స్పీక్ ఏ ప్యూ వర్డ్స్" మైకు అభినయ్‌కి అందించారు.

'చిన్నప్పటినుంచీ నేనెంతో స్ఫూర్తిపొందింది డాక్టర్ సుబ్రహ్మణ్యన్‌గారిని చూసే. ఇవాళ ఆయన చేతులమీదుగా ఈ గోల్డ్‌మెడల్, డిగ్రీపట్టా తీసుకోవడం నాకెంతో గర్వంగా ఉంది. నేను ఈ రోజు ఇలా బంగారు పతకం పొందడానికి, ఈ స్థానంలో ఉండడానికి కారణాలు రెండు. ఒకరు నాకు జన్మనిచ్చిన నా తల్లిదండ్రులు లక్ష్మి, సురేష్‌గార్లు' అంటూ అభినయ్ వాళ్ళను చూపించాడు. ఆనందంతో లక్ష్మికి కన్నీళ్ళు ఆగలేదు.

"మరొకరు నాకు పునర్జన్మనిచ్చిన సందీప్" అంటూ జేబులోంచి ఒక ఫొటోతీసి చూపించాడు. అప్పటిదాకా చప్పట్లతో మారుమోగిపోయిన ఆ కాలేజ్‌గ్రౌండ్ ఆ మాటతో ఒక్కసారిగా నిశ్శబ్దమైపోయింది. అందరూ ఆ ఫొటోవైపే చూడసాగారు. ఎంత ఆపుకుందామని ప్రయత్నించినా, ఆగకవచ్చిన ఆ కన్నీళ్ళు తుడుచుకుంటూ ఫొటోను తిరిగి భద్రంగా జేబులో దాచుకున్నాడు అభినయ్.

"ఈ ముగ్గురికీ నేను జీవితాంతం ఋణపడి ఉంటాను. అలాగే నన్ను డాక్టర్‌గా తీర్చిదిద్దిన ఈ కాలేజీకి, నా ఉపాధ్యాయులకి ధన్యవాదాలు తెలుపుకుంటున్నాను" అని చెప్పాడు. మళ్ళీ చప్పట్లు మారుమోగాయి. మిగిలిన విద్యార్థులకు కూడా పట్టాలు అందించారు. కొంతమంది విద్యార్థులు నృత్యాలు, పాటలతో అలరించారు.

అభినయ్ అవేవీ పట్టించుకోకుండా బైటికి వచ్చి ఎదురుచూస్తున్నాడు. ఇంతలో ఆటోవచ్చి అతనిముందు ఆగింది. దాంట్లోంచి అపర్ణ దిగింది. ఆమెను చూడగానే అభినయ్‌కు ఏదో తెలియని అందమైన ఫీలింగ్. ఆమెను ఆప్యాయంగా గుండెలకు హత్తుకున్నాడు. అలా హత్తుకున్నప్పుడు ఆమె చెవికి అతని గుండెచప్పుడు ఒకమాటలా విన్పించింది. 'అపర్ణ' అని పిలిచినట్లు! అభినయ్ షర్ట్ అపర్ణ కన్నీళ్లతో తడిసిపోయింది.

• • •

మూడు సంవత్సరాల ముందు..

నిజామ్ హాస్పిటల్ నుండి సికింద్రాబాద్ యశోద హాస్పిటల్ వరకు అంతా వన్‌వేగా మార్చేశారు. రాకపోకల్ని విభజించే రోడ్‌డివైడర్‌కు ఒకవైపు మాత్రమే ట్రాఫిక్ వెళుతోంది. రెండోవైపు రోడ్డు ఖాళీగా ఉంది. ఖాళీగా ఉంచిన రోడ్‌మీద అంబులెన్స్ రాకెట్‌లా దూసుకుపోతోంది. మూడునిమిషాల్లో నిజామ్ హాస్పిటల్ నుండి యశోద ఆసుపత్రికి చేరుకుంది అంబులెన్స్. అంబులెన్స్ ముందు ఒక పోలీసుజీప్ వెనుక మరొకజీప్!

అంబులెన్స్ సైరన్ వినబడగానే ఆసుపత్రి అంతా అలర్ట్ అయింది. ఉన్న లిఫ్ట్‌లన్నీ గ్రౌండ్‌ఫ్లోర్‌కు వచ్చి ఆగాయి. సెక్యూరిటీ టైట్‌గా ఉండడంతో హాస్పిటల్ ఎంట్రన్స్‌నుండి కార్డియాలజీ డిపార్ట్ మెంట్ ఫ్లోర్‌లో ఉన్న ఆపరేషన్ థియేటర్ వరకు రూట్ క్లియర్‌చేసి ఉంచారు. ఇద్దరు వ్యక్తులు ఒక నీలంరంగు డబ్బాపట్టుకుని అంబులెన్స్‌లోంచి దిగి ఆపరేషన్ థియేటర్‌లోకి పరుగెత్తారు. ఆ డబ్బాలో ఒక గుండె! లబ్‌డబ్..లబ్‌డబ్‌మని కొట్టుకుంటోంది! హాస్పిటల్ అంతా హడావిడి! అంబులెన్స్ ముందువచ్చిన ఒక పోలీస్‌జీప్‌లోంచి దిగిన రమణయ్య, అంజమ్మ దంపతులు కార్డియాలజీ డిపార్ట్‌మెంట్‌ఫ్లోర్‌లో కూర్చున్నారు. లక్ష్మి, సురేష్ దంపతులు వాళ్ళిద్దరి దగ్గరకువచ్చి పరిచయం చేసుకున్నారు.

"లోపల ఆపరేషన్ జరుగుతున్న అభినయ్ తల్లి దండ్రులం" రమణయ్యతో అన్నాడు సురేష్. పెల్లుబుకుతున్న దుఃఖాన్ని ఆపుకుంటూ అతిబలవంతంగా తలూపాడు రమణయ్య. ఏడుస్తున్న అంజమ్మని ఓదారుస్తోంది లక్ష్మి.

"మీ అబ్బాయి సందీప్ బ్రెయిన్‌డెడ్ అయ్యాడని మేము కూడా చింతిస్తున్నాం. మీ అబ్బాయి గుండె, మా అబ్బాయికి ఇవ్వడానికి ఒప్పుకున్నందుకు మీకు ఎలా కృతజ్ఞతలు చెప్పాలో మాకు తెలియట్లేదండి.." అన్నాడు సురేష్. "మా అబ్బాయి పోయిన తర్వాతకూడా, ఇంకొకరికి జీవితాన్ని ఇస్తున్నాడంటే వాడు ఓ రకంగా బ్రతికి ఉన్నట్టే". రమణయ్య సమాధానానికి అంజమ్మ దుఃఖస్వరం మరింత పెరిగింది.

ఇంతలో నర్సు వచ్చింది.

"సార్ పేషెంట్‌కి 'బి నెగెటివ్' బ్లడ్ కావాలి. మా బ్లడ్ బ్యాంక్‌లో ఉన్నది సరిపోవట్లేదు. మీలో ఎవరైనా....?" అంటూ అడిగింది.

"ఇంతసడన్‌గా అడిగితే ఎలాగమ్మా!! కొంచెం ముందుచెప్తే సరిపోయేదిగా. నాది, నా భార్యది 'ఓ పాజిటివ్' గ్రూప్ బ్లడ్" అంటూ కంగారుపడ్డాడు సురేష్. ఏం చేయాలో అర్థంకాక అందరూ ముఖముఖాలు చూసుకుంటున్నారు.

ఇంతలో 'మావయ్యా! రక్తం నేను ఇస్తాను' వెనుకనుంచి వినిపించింది ఓ యువతి గొంతు.

మెట్ల దారిలో నడిచివచ్చింది ఆ యువతి.

నర్సు ఆమెవైపు చూసి ఆత్రంగా అడిగింది, "మీది 'బి నెగెటివ్' బ్లడ్ గ్రూపా?"

"అవును..." దుఃఖాన్ని దిగమింగుకుంటూ చెప్పిందా యువతి.

"సమయానికి వచ్చావ్. ఎవరమ్మా నువ్వు...?" సంతోషంగా ఆమెకేసి చూస్తూ అడిగాడు సురేష్.

"మా అక్క కూతురు, అపర్ణ" మెల్లగా చెప్పాడు రమణయ్య.

"ఆ హృదయం కొట్టుకుంటున్నది నా కోసమే. అందులో నా రక్తం ప్రవహిస్తేనే, ఈ గుండెకి హాయి.." దుఃఖం ఆపుకుంటూ చెప్పింది అపర్ణ.

లక్ష్మి, సురేష్‌లకు ఆ మాటలు సరిగ్గా అర్థం కాలేదు. కానీ, రమణయ్య, అంజమ్మలకు అర్థమైంది. అంతలోనే నర్సువెంట లోనికి నడిచింది అపర్ణ.

"మీ అబ్బాయి పేరు?" కొంచెం మొహమాట పడుతూ అడిగాడు సురేష్.

"సందీప్...." చెప్పాడు రమణయ్య.

కొన్ని గంటల తర్వాత...

గుండె మార్పిడి (హార్ట్ ట్రాన్స్‌ప్లాంటేషన్) ఆపరేషన్ విజయవంతంగా ముగిసింది. డాక్టర్లంతా ఒకరికొకరు అభినందనలు తెలియజేసుకుంటూ

**బరువెక్కిన గుండెతో బస్సెక్కాడు అభినయ్. డైరీ తెరిచాడు. పేజీలు తిప్పుతున్నకొద్దీ అపర్ణ-సందీప్ మధ్య ప్రేమ ఎంత గాఢమైనదో అతడికి అర్థమైంది. మూగగా రోదించాడతను. కలవాలి..ఎలాగైనా ఆమెను కలుసుకోవాలి అని నిశ్చయించుకున్నాడు. కానీ ఆమే అతన్ని వెతుక్కుంటూ వచ్చింది. ఆ అపరిచితురాల్ని చూడగానే ఏదో పూర్వానుబంధం ఉన్నట్టు అతడి గుండె కంపించింది. ఎందుకని? ఏమిటా బంధం?**

సంబురాలు చేసుకుంటున్నారు. ‘ఈ గుండె మార్పిడి చికిత్స వైద్యచరిత్రలో ఒక సంచలనం. అలాంటి ఆపరేషన్లుచేసే డాక్టర్లు, ఆసుపత్రులు ఇక్కడ ఉండటం మన అదృష్టం’ అని ఆసుపత్రిలో అందరూ అనుకుంటున్నారు. కానీ, రమణయ్య, అంజమ్మ, అపర్ణ మాత్రం సందీప్ గురించే ఆలోచిస్తూ కన్నీరు కారుస్తున్నారు. కొంతసేపటి తర్వాత, అభినయ్‌ని ఐసీయూలోకి షిఫ్ట్ చేశారు. కన్న కొడుకును చూసుకోవడానికి సురేష్, లక్ష్మిలను అనుమతించారు డాక్టర్లు. కానీ అప్పటికింకా అభినయ్ అనస్తీషియా మత్తులోంచి బైటపడలేదు. ‘స్పృహవచ్చాక మళ్లీ పిలుస్తాం’ అని నర్సు వాళ్ళిద్దరినీ బైటకు పంపించింది. ఐసీయూ తలుపుల్లోంచి అభినయ్‌ని చూస్తూ కన్నీళ్లు కారుస్తోంది లక్ష్మి. సురేష్ ఇటు చూసేసరికి, రమణయ్య అంజమ్మ, అపర్ణలు కనబడలేదు.

“డాక్టర్లు ఇచ్చిన కాగితాలపై సంతకాలు చేసి వెళ్ళిపోయారు సార్” సురేష్ ప్రశ్నకు సమాధానం చెప్పింది నర్సు.

• • •

అభినయ్‌కి ఆపరేషన్ జరిగి ఏడాది పూర్తయింది. ఆ తర్వాత...

డాక్టర్ చదువుతున్న అభినయ్ తన శిక్షణలో భాగంగా జగిత్యాలలో మెడికల్‌క్యాంప్‌కు వచ్చాడు. ఆ సమీపంలోనే ఉన్న గొల్లపెల్లి మండలం చిల్వాకోడూరు వెళ్ళాడు. రమణయ్య, అంజమ్మ ఉంటున్నది అక్కడే. తనను పరిచయం చేసుకున్నాడు అభినయ్. అతను ఎవరో తెలియగానే ఆ దంపతుల కళ్ళు చెమర్చాయి. అభినయ్‌ని ఆప్యాయంగా గుండెలకు హత్తుకున్నాడు రమణయ్య. తన కొడుకు సందీప్‌ని చూసినట్టే అనిపించింది. సందీప్‌కు ఇష్టమైన బజ్జీలు, అప్పాలు చేసి అభినయ్‌కి పెట్టింది అంజమ్మ. ముందుగదిలో సందీప్‌ఫొటో ఉంది. కానీ, దానికి దండలేదు. తదేకంగా ఆ ఫొటోవైపేచూసిన అభినయ్ ఆ విషయమే అడిగాడు. “నా కొడుకు బ్రతికే ఉన్నాడుగా బాబూ” అని సమాధానం ఇచ్చాడు రమణయ్య అభినయ్‌నే చూస్తూ. అభినయ్‌ని అపర్ణవాళ్ళ ఇంటికి తీసుకెళ్లింది అంజమ్మ. అపర్ణ ఇప్పుడు హాస్టల్‌లో ఉంటోంది. అపర్ణ ఇంట్లోవాళ్ళని పరిచయం చేసింది అంజమ్మ. ఇంట్లో అపర్ణ డైరీ చూశాడు అభినయ్. అపర్ణ, సందీప్ బావా మరదళ్ళు! అది తెలిసి నిర్ఘాంతపోయాడు అభినయ్. ఆమె డైరీనిండా ఆ బావామరదళ్ళ ముచ్చట్లే.

అభినయ్‌కి ఊరంతా చూపించాడు రమణయ్య. సందీప్ తిరిగిన ప్రదేశాల్లో తిరిగాడు. ఊళ్లో ఉన్నంతసేపు అభినయ్ మనసుకు ఎంతో హాయిగా అనిపించింది. ఆ హృదయస్పర్శ అభినయ్‌కి స్పష్టంగా తెలిసింది. తిరుగుముఖంపట్టి జగిత్యాల బస్సు ఎక్కాడు. వీడ్కోలు చెప్పాడు రమణయ్య. బస్సు కదిలి ఊరు విడిచి దూరంగా వెళుతున్న కొద్ది అభినయ్ గుండె బరువెక్కింది. బస్సులో అపర్ణడైరీ బైటకుతీసి చదివాడు. పేజీలు తిప్పే కొద్దీ అపర్ణ, సందీప్‌ల ప్రేమ ఎంత గాఢమైనదో తెలిసింది అభినయ్‌కి. తనకు రక్తాన్ని ఇచ్చిన దాత అపర్ణను కలుసుకోవాలి అనుకున్నాడు అభినయ్.

కానీ అపర్ణ తానుగా మెడికల్‌క్యాంప్‌కి వచ్చింది. షాకయ్యాడు అభినయ్. అతని హృదయం ఆమె కోసం తపించింది. అది సందీప్ కలిపిన రక్త బంధం! బాగా కావాల్సినవారిలా, చిరపరిచితుల్లా కలిసిపోయారు ఇద్దరూ. అపర్ణ డైరీలో రాసుకున్నట్టే, ఆ గుండె ఆమె సొంతమైంది.

•••

రమా మేడమ్ హడావిడి పడుతూ అభినయ్ దగ్గరికి వచ్చింది.

“ఏమైంది అభి... కమాన్. అందరూ నీకోసం వెయిట్ చేస్తున్నారు, ఎంజాయ్ యువర్ నైట్” అంది మేడమ్. ‘నో మేడమ్, నాకు నా మరదలతో కలిసి ఎంజాయ్ చేయాలని ఉంది’ అన్నాడు. చెప్పి అపర్ణతో కలిసి తన పేరెంట్స్‌ను తీసుకుని అక్కడినుంచి వెళ్ళిపోయాడు.



సరిగ్గా సంవత్సరం తర్వాత...

పీజీ ఎంట్రెన్స్‌లో మంచిర్యాంక్‌తో ఉస్మానియా యూనివర్సిటీ కార్డియాలజీ డిపార్ట్‌మెంట్‌లో సీటు సంపాదించుకున్నాడు అభినయ్. ఒక సందర్భంలో కాలేజి అనాటమి ల్యాబ్‌కి వెళ్ళాడు. ఎంత డాక్టరైనా ఆ శవాలనుచూసి కొంచెం భయపడ్డాడు. కడుపులో పెరిగిన పిండం దగ్గరనుండి వృద్ధాప్యం వరకు అనేక దశల్లో ఉండే దృశ్యరూపాలకు నిలయం ఆ అనాటమీ ల్యాబ్. అలాంటి ల్యాబ్‌లో అనుకోకుండా, ఒక శవాన్ని చూసి చేష్టలుడిగిపోయాడు. అభినయ్‌కి నోట మాటరాలేదు. ఒళ్లంతా చెమటలు పట్టాయి. అటుగా వెళ్తున్న ల్యాబ్ అసిస్టెంట్‌ను ఆగమని సైగచేశాడు. ఆ శవంవైపు వేలుతో చూపించాడు మూగగా! ఇదా, “ఈ శవం మొన్నే వచ్చింది సార్” అన్నాడు. అడుగులో అడుగేసుకుంటూ ల్యాబ్ అసిస్టెంట్ వెంట వెళ్ళాడు అభినయ్. ఆ శవం దగ్గర పడక మీదు బయోకార్డ్‌పై ఉన్న పేరు చదివి కన్నీళ్ళ పర్యంతమయ్యాడు.

“ఆయన గ్రేట్ సార్, మెడికిల్ కాలేజీకి దేహాన్ని దానం చేశాడు. అది విద్యార్థులకు ఉపయోగపడి, వాళ్ళు డాక్టర్లై సేవచేస్తుంటే అతని జీవితం సార్థకమైనట్టేకదా సార్” ల్యాబ్ అసిస్టెంట్ మాటలతో శరీరదానం గొప్పతనం అర్థమైంది అభినయ్‌కి! అన్నదానంతో ఒకపూట కడుపు నిండుతుంది, కానీ దేహాన్ని దానం చేస్తే పరోక్షంగా ఎంతోమంది రోగులకు ఆరోగ్యాన్నీ, జీవితాన్ని ఇచ్చినట్టే, ఎన్నో రకాలుగా వారి కడుపులు నింపుతున్నట్టే అని అర్థం చేసుకున్నాడు అభినయ్. పార్థివ దేహం చూస్తుంటే అతని గుండెచప్పుడు రెట్టింపు పెరిగింది. కళ్ళు కన్నీటి సముద్రాలయ్యాయి. ఆ కన్నీటి నడుమ మసక మసకగా... సందీప్ తండ్రి రమణయ్య దేహం..!!

**సెల్:81793 06464**



# జీవితమే ఒక ప్రతిఘటన

(కోట శ్రీనివాసరావు కథాకథనం) 18

(గతవారం తరువాయి)

**తెరమీద అగ్రెసివ్‌గా కనిపించేవాడు రాజశేఖర్. మంచి పర్సనాలిటీతోపాటు ఆయన ముఖంమీద ఎక్స్‌ప్రెషన్స్ బాగా పలికేవి. ఆ సీరియస్‌నెస్, ఆయన వాయిస్ అన్నీ ఆయనకే సాధ్యమయ్యాయి. అందుకే సక్సెస్‌ఫుల్ హీరోగా కొనసాగాడు.**

# ఆ ఒక్కమాట నా జీవితాన్ని మార్చేసింది!

ఒక మనిషికి అదృష్టం కలగాలంటే, జీవితం మంచి మలుపు తిరగాలంటే ఎవరో ఒకరి సాయం కావాలి. మనకు ఎవరూ ధనరూపేణ, వస్తు రూపేణ ఆ సాయం చేయక్కర్లేదు.

ఒక్కమాట చెబితేచాలు. ఆ మాటతో జీవితం మారిపోతుంది. అలా మాటసాయంతో పైకి వచ్చిన వాళ్లలో నేనూ ఒకణ్ణి.

నేను నాటకాలు వేశాను, బాగా నటించగలిగాను. అవన్నీ పక్కనపెడితే సినిమాల్లో ఎప్పుడూ ట్రై చేయలేదు.

## ఒకేఒక్కమాట!

ఇంతకుముందే చెప్పాగా, హైదరాబాద్ రవీంద్ర భారతిలో నాటకాలు వేసేవాణ్ణి. ఒకసారి టి.కృష్ణగారు, ముత్యాల సుబ్బయ్యగారు నా నాటకం చూశారట. తర్వాతికాలంలో వారే ఈ విషయం చెప్పారు. విలేజ్ పాలిటిక్స్ మీద 'వందేమాతరం' సినిమా తీయాలని కృష్ణగారు అనుకుని, అందులో ఒక వేషానికి నర్రాగారిని బుక్ చేశారు. అప్పటికి ఆయన ఫేమ్‌లో ఉన్నారు. రెండో పాత్రను ఎవరితో వేయించాలనుకున్నప్పుడు, 'సినిమా ఆర్టిస్టులు ఎవరూ వద్దు, స్టేజీ ఆర్టిస్టులైతే బాగుంటుంది' అని టి.కృష్ణగారు అన్నప్పుడు ముత్యాల సుబ్బయ్యగారు 'ఏవండీ మీకు గుర్తుందా.. మనం హైదరాబాద్ రవీంద్రభారతిలో ఒక నాటకం చూశాం. సమయం వచ్చినప్పుడు అందులో ఒకనటుడి గురించి గుర్తు చేయమని నాతో అన్నారు మీరు' అని చెప్పారు. ఆ క్షణంలో సుబ్బయ్యగారు అలా కృష్ణ గారికి గుర్తు చెయ్యడం కేవలం నా పూర్వజన్మసుకృతం కాక మరేంటి? అలా టి.కృష్ణగారి సినిమాలో నా వేషం ఖరారైంది. ఆ సినిమాలో నాతోపాటు ముత్యాల సుబ్బయ్యగారు కూడా నటించారు. నర్రాగారి పక్కన చేశారాయన. సుబ్బయ్యగారు మంచినటుడు. కానీ ఎందుకో తర్వాతి కాలంలో ఆయన దర్శకత్వాన్ని వృత్తిగా తీసుకున్నారు.

టి.కృష్ణగారు ఉన్నప్పుడే సుబ్బయ్యగారు దర్శకత్వం చేశారు. ముత్యాల సుబ్బయ్య లేకపోతే ఇవాళ నేను లేను. మా ఇద్దరివీ ఒకే ప్రాంతాలు కావు. ఆయనతో ముందస్తు పరిచయం లేదుగానీ, సినిమాల్లోకి నా ఎంట్రీ ఆయన నోటిమాట వల్ల జరిగింది. అందుకే ఈ హోల్ ఇండస్ట్రీలో ముత్యాలసుబ్బయ్యగారు నాకు చాలా స్పెషల్.





## స్పెషల్ చిత్రం 'మామగారు'

ముత్యాల సుబ్బయ్యగారు దర్శకుడైన తర్వాత నాతో చాలా మంచివేషాలు వేయించారు. నాతో కామెడీ చేయించిన ఘనత కూడా ఆయనదే. ఆ చిత్రాలు అన్నిటిలోకీ 'మామగారు' చాలా స్పెషల్ చిత్రం. ఈ సినిమాను ఎడిటర్ మోహన్ నిర్మించారు. 'మామగారు' చిత్రం ఎలా మొదలైందంటే....

ఒకరోజు ఉదయం నాకు ఒక ఫోన్ వచ్చింది.

'ఏవండీ నేను ఎడిటర్ మోహన్ అండీ. తెలుగు సినిమా నిర్మాతని' అని అవతలి వ్యక్తి పరిచయం చేసుకున్నారు.

అంతకుముందు ఆయన నాకు తెలియదు. అందుకే 'అలాగా అండీ. నమస్కారం. చెప్పండి సార్' అన్నా.

'ఏం లేదు శ్రీనివాసరావుగారూ.. ఒక అరవ సినిమా తీసుకున్నాను. తెలుగులో రీమేక్ చేయాలనుకుంటున్నాను. అందులో ఓ వేషం మీరు చేయాలి. టికెట్లు పంపిస్తాను. ఫ్యామిలీతో మీరు ఒకసారి ఆ సినిమా చూసిరండి' అన్నారు.

'సరేనండీ.. అలాగే చూస్తాను' అన్నా. అన్నట్టుగానే టికెట్లు పంపించారు. సినిమా చూసొచ్చాం. మరుసటిరోజు ఉదయాన్నే ఆయన మళ్ళీ నాకు ఫోన్ చేశారు.

'శ్రీనివాసరావుగారూ.. చూశారా... తెలుగుకు ఎలా ఉంటుందీ? అని అడిగారు.

'బావుంటుంది సార్. మన నేటివిటీకి సరిపోతుంది' అన్నా. ఆయనతో మాట్లాడుతున్నానేకానీ నా మనసంతా ఒక పాత్ర మీదే ఉంది. అయినా ముందు నేనే చెబితే బావుండదు కదా.. ఆయన ఏమనుకుంటారో అని వెయిట్ చేశా.

నేననుకున్నట్టే ఆయనే ఆ విషయం ప్రస్తావించారు. 'నేను ఫలానా పాత్ర చేస్తాను సార్. క్యారెక్టర్ ఆర్టిస్టుగా బాగా ఉంటుంది. సినిమా చూస్తున్నంతసేపూ ఆ పాత్రనే గమనించాను' అని గబగబ చెప్పేశాను. ఎందుకో ఆయన ఒక్కక్షణం ఆగి 'ఆ పాత్ర మీరు చెయ్యదగ్గదేనండీ. నేను కాదనను. ఆ విషయంలో ఎలాంటి అనుమానాలూ లేవు. కానీ ఆ ఒక్క పాత్రనూ వదిలేయండి సార్. మేం ఇంతకుముందే కమిట్ అయ్యాం. దానికి దాసరి నారాయణరావుగారిని అనుకుంటున్నాం. అది ఫిక్స్ అయిపోయింది' అన్నారాయన.

'మరి అందులో నేను చేయదగ్గ పాత్రలు ఇంకేమున్నాయో మీరే చెప్పండి సార్. ఏ పాత్ర చేయమంటే అదే చేస్తాను. నాకేం ఫర్వాలేదండీ' అన్నా. నా గొంతులో నిరుత్సాహం ధ్వనించినట్టుంది, ఆయన గమనించినట్టున్నారు. 'మీరేం

ఆలోచించకండి. నిరుత్సాహపడకండి. తమిళంలో కౌండర్‌మణి చేసిన పాత్రకు మిమ్మల్ని అనుకుంటున్నాం. ముత్యాల సుబ్బయ్యగారు మీతో మాట్లాడతారు.

బాబూమోహన్‌గారిని మీకు పెయిర్‌గా పెడతాం. ఆయన్నీ అడుగుతున్నాను' అని చెప్పారు.

### బాబూమోహన్‌తో నా కాంబినేషన్ ఘనత ఆయనదే

ముత్యాల సుబ్బయ్యగారు నన్ను కలిసి 'నువ్వేం నిరుత్సాహపడొద్దు. తమిళ్‌కన్నా తెలుగులో ఆ పాత్ర చాలా బాగా వస్తుంది. నామీద నమ్మకంతో చెయ్యి' అన్నారు. నిర్మాతగారు కూడా మరోసారి ఆ మాటేచెప్పి అడ్వాన్స్ ఇచ్చి వెళ్ళారు.

అలా బాబూమోహన్‌తో నా కాంబినేషన్ సెట్ అయింది కూడా ముత్యాల సుబ్బయ్యగారి సినిమాతోనే. నేను, బాబూమోహన్ అడపా దడపా సినిమాలు చేశాంగానీ అవేమీ మా కాంబినేషన్ చిత్రాలు కాదు. తెలుగు వారిని కడుపుబ్బనవ్వించిన మా ఇద్దరి కాంబినేషన్‌కు శ్రీకారం చుట్టిన ఘనత ముత్యాల సుబ్బయ్యగారిదే. 'మామగారు' సినిమా సక్సెస్‌కి మా ఇద్దరి కామెడీ పెద్ద ఎస్సెట్ అయింది. సినిమా చూసిన ప్రతి ఒక్కరూ 'మీ ఇద్దరి కామెడీ లేకపోతే ఆ సినిమా ఆ స్థాయిలో ఆడేది కాదేమో. ఏదో మూడు, నాలుగు వారాల సినిమా అయ్యేది. మీ ఇద్దరి కామెడీ సినిమాను మరో లెవల్‌కి తీసుకెళ్ళింది' అని ప్రశంసించారు. అలా ఆ చిత్రం 100 రోజులు ఆడింది. దాంతో ఆల్‌రౌండ్ ఆర్టిస్ట్‌గా ఫిక్స్ అవుతున్నాననే ధైర్యం నాకు వచ్చింది. ఎందుకంటే అప్పటికే విలన్‌గా చేశా. ఈ చిత్రంలో కామెడీ కూడా బాగా చేయగలిగా.

### బాబూమోహన్‌తో దాదాపు 50 చిత్రాలు

'మామగారు' రిలీజైన తర్వాత నేను, బాబూమోహన్ కలిసి తక్కువలో తక్కువ 50 సినిమాలు చేశాం. అవన్నీ బడ్జెట్ చిత్రాలే. మా కాంబినేషన్ మొదలైన సమయంలోనే ఇండస్ట్రీ మెల్లిగా హైదరాబాద్‌కి తరలి వస్తోంది. ఇక్కడ తీసిన తెలుగు సినిమాలకు ఎనిమిది శాతం రాయితీ ఇచ్చేవాళ్లు. దాంతో బడ్జెట్ సినిమాలు విరివిగా వచ్చాయి. సినిమా పరిశ్రమలోనూ చాలా మార్పులు చోటుచేసుకున్నాయి. చాలాకాలం నుంచి పెద్ద దర్శకుల దగ్గర కో-డైరెక్టర్లుగా చేస్తున్న వారందరూ డైరెక్టర్లు కావడం కూడా అందులో భాగమే. అందులో నాకు కలిసొచ్చిన విషయం ఏమిటంటే ఒక క్యాడర్ హీరోలు, దర్శకుల చిత్రాల్లో విలన్, ఫాదర్, కమెడియన్‌వంటి వేషాలన్నిటికీ నేను షిఫ్ట్ అయ్యా.

**జీవితం ఎప్పుడు ఎక్కడ ఎలా మలుపు తిరుగుతుందో ఎవరికీ తెలియదు. కోట శ్రీనివాసరావు గారి జీవితంలో కూడా ఒక సంఘటన అలాగే జరిగింది. బ్యాంకు ఉద్యోగం చేసుకుంటూ స్టేజీ ఆర్టిస్టుగా నాటకాలు వేసుకుంటున్న కోటగారు ఎప్పుడూ సినిమాల్లో ట్రై చెయ్యాలని ఆలోచించలేదు. కానీ టి.కృష్ణగారి సినిమా రూపంలో అదృష్టం ఆయన తలుపుతట్టింది. అదెలా జరిగిందంటే ఒకేఒక్క మాటవల్ల! ఏమిటామాట? ఎవరు అన్నారామాట?**

### బాబూమోహన్ పెక్యూలియర్ టైమింగ్!

నేను ఏ సినిమా చేసినా దాదాపు బాబూమోహన్ నా పక్కనే ఉండేవాడు. అతనిలో నాకు బాగా నచ్చిన విషయం టైమింగ్. ఆర్టిస్ట్‌కి ఆ టైమింగ్ చాలా ముఖ్యం. బాబూమోహన్ ఓ పెక్యూలియర్ టైమింగ్ ఉన్న ఆర్టిస్ట్. దాన్ని ఎవరూ ఇమిటేట్ చేయలేరు. అతని ఫేస్‌కూడా అతనికి చాలా అడ్వాంటేజ్. భగవంతుడు ఇచ్చిన రూపాన్ని అతను ఎంతో గొప్పగా ఉపయోగించుకున్నాడు. దాదాపు ప్రతిచిత్రంలోనూ నేను అతన్ని కొట్టేవాణ్ణి, తన్నేవాణ్ణి. చూసిన జనాలు కడుపుబ్బ నవ్వుకునేవారు. అన్ని షాట్స్‌లోనూ నిజంగా నేను





అతన్ని తన్నివుంటే ఈ సమయానికి నా కాళ్ళు వాచిపోయి పనికిరాకుండా పోయుండేవి. అతని నడుము సంగతైతే వర్ణనాతీతం. కానీ బాబూమోహన్‌లో ఉన్న టైమింగ్‌వల్ల అలాంటి ఇబ్బంది లేవీ రాలేదు. డైరెక్టర్‌గారు రెడీ అనగానే ఆ టైమింగ్‌లో కరెక్ట్‌గా నడుము నావైపు పెట్టేవాడు. నేను కాలితో టచ్ చేయగానే అలా పడిపోయేవాడు. ఆ పడటంకూడా ఎంత నేచురల్‌గా ఉండేదనీ..

### నిజంగా భయపడ్డా!

ఎప్పుడూ ఉత్తుత్తినే తన్నే నేను ఒకసారి నిజంగానే తన్నా. ఫలితం అతను 50, 60 అడుగులు దొర్లుకుంటూ పడిపోయాడు. నాకు ఒక్కక్షణం నిజంగా వెన్నులో వణుకు మొదలైంది. 'చిన రాయుడు' షూటింగ్‌లో ఈ ఘటన జరిగింది. బి. గోపాల్ దర్శకత్వంలో వెంకటేశ్, విజయశాంతి జంటగా నటించారు. రాజమండ్రి దగ్గర రామచంద్రాపురంలో ఒకరోజు షూటింగ్ జరుగుతోంది. లొకేషన్‌లో నేను, బాబూమోహన్ ఉన్నాం. వాడు తన సీన్లన్నీ పూర్తిచేసి సాయంత్రం ట్రైన్‌కి తిరుపతి వెళ్ళాలి. అక్కడ ఇంకేదో షూటింగ్ ఉంది. దాంతో ఉదయం నుంచి లొకేషన్‌లో హడావిడి మొదలైంది. ఇద్దరం దోబీ వేషాలు వేసుకుని స్పాట్‌లో ఉన్నాం. ఆ సినిమా మొత్తం పాత్రలో వాడు నన్ను ఏవో సందేహాలు అడుగుతూనే ఉంటాడు. ఆ రోజుకూడా కొబ్బరి చెట్టు చూపించి సందేహం అడగాల్సిన సన్నివేశం ప్లాన్ చేశారు.

బి.గోపాల్‌గారు నా దగ్గరకు వచ్చి, 'కోటగారు కాస్త కో ఆపరేట్ చేయండి. అవతల బాబూమోహన్ వెళ్ళాలి' అన్నారు.

'అలాగేనండీ, చేసేద్దాం' అన్నా. యూనిట్ మొత్తం కూడబలుక్కుని లంచ్ కూడా చేయకుండా నిర్విరామంగా షూటింగ్ చేస్తూనే ఉన్నాం. డైరెక్టర్‌గారు 'యాక్షన్' అన్నారు.

**(ఇంకా ఉంది)**

**- డా.చల్లా భాగ్యలక్ష్మి**
**సెల్: 88850 55528**

## కోరినా కోరకపోయిన కలిసొచ్చే సంఖ్య!

*ఎనిమిది నాకు కలిసొచ్చే సంఖ్య. నా టెలిఫోన్ నంబరు, నా డేటాఫ్ బర్త్ వంటివన్నీ కూడితే ఎనిమిదే వస్తాయి. ఇప్పుడు ఫిల్మ్‌నగర్‌లో నేను ఉంటున్న రోడ్డునంబరు కూడా ఎనిమిదే. కొన్నిసార్లు అపార్ట్‌మెంట్లలో లాటరీలు తీయమని నన్ను ఆహ్వానిస్తుంటారు. నేను తీసిన నంబరు కూడితే గమ్మత్తుగా ఎనిమిదే అవుతుంది. హోటల్‌కి వెళ్ళినప్పుడు కూడా వాళ్లు ఇచ్చే రూమ్ నంబర్లు దాదాపు 305, 503... ఇలా ఎనిమిది వచ్చేవే ఉంటాయి. ఒకవేళ వాళ్లు ఇవ్వకపోయినా నేనే అడుగుతుంటా. '8 నెంబరు వచ్చేట్టు చూడవయ్యా' అని. మద్రాసులో నుంగంబాక్కంలో గుడ్‌లక్ థియేటర్ దగ్గర లేక్ ఏరియాలో నేనున్నది ఎనిమిదవ నంబర్ వీధిలోనే. అక్కడికి ఫ్యామిలీ షిఫ్ట్ చేయకముందు పామ్‌గ్రోవ్ హోటల్లో 305 రూమ్‌లో దాదాపు ఆరేడు నెలలున్నా. ఆ సంఖ్య వల్ల నాకు మంచి జరిగిందా? చెడు జరిగిందా? అని నేనెప్పుడూ ఆలోచించలేదుగానీ, నాకు ఆ సంఖ్య మాత్రం తారసపడుతూనే ఉంటుంది.*



"టీవీసిగ్నల్స్ లేని ప్రదేశానికి నాకు ట్రాన్స్‌ఫర్ అయిందహో' ఆనందం కేకై ధ్వనించింది పరమేష్టి గొంతులోనుంచి.

"నిజంగా అదే జరిగితే మీ వెంట వచ్చేది మీరు కట్టిన తాళే!"

భర్త గొంతుకి పదింతలు స్వరంపెంచి, ప్రళయ భీకరగర్జన చేసింది పంపరపనస.




# పంపరపనస!

సంవత్సరాల తరబడి సీరియల్ సాగుతున్నా, మధ్యలో పాత్రధారులు అకాలమరణం పాలై, కొత్తమొహాలు చోటుచేసుకున్నా, కంటిచూపు అంటుకునే వ్యాధికి చికిత్స ఏదో తెలుసుకోవడానికి ఎన్నో ప్రయత్నాలు చేసి ఓటమి పాలయ్యాడు పరమేష్టి!

తన ఉద్యోగంలో తనకో గౌరవం ఉంది. తీరిక దొరికినప్పుడల్లా యోగా నేర్పడం, ప్రశాంత చిత్తాన్ని చేరుకోడానికి ప్రవచనాలు చేయడం, ఎన్నో జీవితాలకు ఎంతోకొంత మేలు చేస్తున్నాడన్న ఆత్మసంతృప్తి, పరమేష్టి వ్యాపకం. అది క్షణక్షణం తరుగుతూ, కరుగుతూ మనసు పూర్తిగా ఆవిరి కాకముందే ఎవరో ఓ మానసిక వైద్యుణ్ణి సంప్రదించాలి అనుకున్నాడు.

●●●

పరమేష్టినిచూసి లేచినించుని "రండి, రండి! మీవంటి వారు రావడం, విశేషం" అన్నాడు డాక్టర్ కలవరం.

డాక్టరుకి తనూ, తనకు డాక్టరూ తెలియకూడదనుకున్న పరమేష్టి ఆ పలకరింపుతో, అసంకల్పితంగా ఓ అడుగు వెనక్కువేసి, తనువచ్చిన సంగతి చెప్పాడు, కలవరానికి!

"ఇంతటి అనుభవజ్ఞులు, విజ్ఞులు మీరు చేతులు ఎత్తేయడం, జాతికంత మంచిది కాదు. ఈ విషయంలో మీకు మీరే మహా వైద్యులు! అదే వేరే ఎవరో అయితే ఏదో ఒకటి చెప్పి, జేబు చూసుకునేవాణ్ణి" గౌరవంగా చెప్పాడు కలవరం. చెప్పింది అతి రహస్యంగా చెవిలో ఎందుకు ఊదాడో అర్థంకాలేదు పరమేష్టికి.

చెప్పి లోకువ అయ్యానా అని ఒకింత ఆలోచించి కదిలిన పరమేష్టి తన భార్య లోపలికి రావడంచూసి కంగారుపడ్డాడు. డాక్టర్‌ని చూశాడు. ఆ చూపు చూసి కలవరపడ్డాడు కలవరం!

"నేనిక్కడికొస్తున్న సంగతి ఎవరికీ చెప్పలేదే".

"లేదు కాబట్టే వచ్చా"

"ఎలా"

"మీ ఆచూకీ తెలుసుకోలేకపోతే గూగుల్ నేవిగేషనే వృథా".

"ఏవిటండీ పరమేష్టిగారూ! చాలాసింపుల్, డ్రైవర్‌కి ఫోన్‌చేసి ఉంటుంది" అన్నాడు కలవరం కలగచేసుకుని.

"అది కాదండీ! ఎప్పుడూలేంది నా గురించి ఇంత శ్రద్ధ ఎందుకొచ్చిందో అని" అన్నాడు పరమేష్టి.

"నేను వచ్చింది మీగురించి కాదు" అంది పంపరపనస.



"అలా ఉండాలమ్మా, దెబ్బకొడితే పడగ పగలాలి" అంటూ వచ్చింది కలవరం భార్య జాంబవతి.

"అదేదో సీరియల్ డైలాగ్ ఇక్కడ నప్పదేయ్" అన్నాడు కలవరం.

"ఇంతకీ ఈయనగారు ఆయనగారేనా!"

"ఆయనగారే"

'మీతో ఏంపని పడిందో"

"మనసున్న మనుషులకు నాలాంటి వాళ్ళతో ఏవో పనులు పడకపోతే నేనుండేదెలా. అద్సరేగానీ! పరమేష్టి గారూ, ఈవిడ నా భార్య. పేరు జాంబవతి. బ్రహ్మాండ భూమండల తెలుగుతెర ప్రేక్షక మహిళా సమాఖ్య, అధ్యక్షురాలు. నయన చంద్రిక అని బిరుదు కూడా ఉంది" చెప్పాడు కలవరం.

అర్థం కానట్లు చూశాడు పరమేష్టి.

"ఎపిసోడ్ నంబర్ చెబితే డైలాగులతోసహా కథ చెప్పడం, ఏ ఎపిసోడ్‌లో కథ ఏ మలుపు తిరిగిందో చెప్పడం, ఎప్పుడు ఎవరు ఏ డ్రస్సు వేసుకున్నారో, ఏ నగలు పెట్టుకున్నారో....

వాళ్ళకు ఏవేవో పోటీలుంటాయండీ.. దాన్నిబట్టి బిరుదులిచ్చుకుంటారు. పదవులు పంచుకుంటారు" చెప్పాడు కలవరం.

ఇక అక్కడ తన ఉనికి ఉండకూడదనుకున్నాడు పరమేష్టి.

●●●

"జాంబవతిగారింట్లో లాన్లో టీవీ, కిచెన్లో టీవీ, బాతురూంలో టీవీ, టెర్రెస్ మీద టీవీ..."

"చెప్పింది చాలు, చెప్పాలనుకున్నదేంటో అర్థమైంది. నాకున్నది ఈ ఒక్క ఇల్లు. అది నీ పేరుమీద రాస్తా. ఉద్యోగం మానేసి సెటిల్‌మెంట్ డబ్బులన్నీ నీ ఒడిలో పోస్తా, ఆ తర్వాత నీ ఇష్టం..." చెప్పాడు పరమేష్టి.

"మరి... మీ సంగతి" అడిగింది పంపరపనస!

"తోటలో ఉన్నా ఒకటే, పేటలో ఉన్నా ఒకటే అన్నారుగా, ఆకలేస్తే ఓ మెతుకు, దాహమేస్తే ఓ నీటి బొట్టు వెతుక్కుంటూ నా దారిలో నేను పోతా" అన్నాడు.

"అంతదాకా వద్దులెండి! ఏదో మా సమాఖ్యకు సెక్రెటరీగా ఎన్నుకున్నారని, 'వీక్షణా విలక్షణ' అని బిరుదు కూడా ఇచ్చారని, అన్నానంతే" అంది కొద్దిగా చిరునవ్వు కనిపిస్తూ.

"టీవీ చెడిపోతే బాగు చేయించలేదని భర్తను చితకబాదిందని, ఓ భార్య ఉదంతం డ్రైవర్

చెబితే విని, మతి గతితప్పి మాట్లాడాన్లే అన్నాడు పరమేష్టి, చిరునవ్వుకి చిరునవ్వు బదులిస్తూ.

"నేను పూజగదిలో ఉన్నంతసేపూ ఆ టీవీ సౌండ్ కాస్త తగ్గించు" అని భార్యకు చెప్పి, పూజ గది ముందు కళ్ళుతిరిగి పడ్డాడు పరమేష్టి. కోలుకోడానికి రెండు నిమిషాలు పట్టింది.

•••

"అయ్యా! మీకు షుగర్‌వ్యాధి పెద్దఎత్తులో ముదిరిపోయింది. ఇప్పటిదాకా, ఒకసారైనా పరీక్ష చేయించుకోవాలన్న ధ్యాస ఎందుకు రాలేదో! అయిందేదో అయింది. మించిపోయిందేం లేదు. మిగిలింది చేదు! పొద్దునొకటి, రాత్రి ఒకటి మాత్ర, మీ నిత్యకృత్యం కావాల్సిందే".

నా దేహంబునేల ఈ మధుమేహంబు ఏ విధి మోహించే

తీపి తిని ఎరుగనివాడ, నన్నీ రోగంబేల ఏ లీల ఆవహించె

ఉన్నపళాన, నా ఆనందగతికి ఈ విషాద గీత మెవ్వరాలపించే

చేయందగనిదేది లేదు, చేదు కలవాటు పడి యెద ఈ క్షణము నుంచే!

పరిసరాలు పట్టించుకోకుండా పద్యం పాడాడు పరమేష్టి. షుగర్ పేషంట్లు చప్పట్లు కొట్టారు.

"ఏవండీ! మీ పద్యం వినకుండా ఆ టీవీకి అంటుకుపోయినావిడ మీ ఆవిడే కదా" అడిగాడు డాక్టరు.

"వేరే చెప్పాలా! దానికేదన్నా మందుంటే చెప్పండి డాక్టర్" దీనంగా అన్నాడు పరమేష్టి.

"సర్లెండి! ఆవిడ ముందున్నది మా ఆవిడే!" చెప్పాడు డాక్టరు.

"అదయింతరువాత నా గురించి అడిగితే, ఇంటికి వెళ్ళానని చెప్పండి డాక్టర్" అని పరమేష్టి వస్తుంటే 'మా ఆవిడ అలవాటు మాన్పించాలనే టెన్షన్‌కే నాకు షుగరొచ్చిందండీ బాబూ, అన్నాడు డాక్టర్.

"ఆఁ!" అని మెట్టుజారాడు పరమేష్టి. వెంటనే నిలదొక్కుకున్నాడు.

•••

"అయ్యా! మా ఆడవాళ్ళని టీవీలకు ఎందుకని కట్టి పడేస్తున్నారని రచయితల్ని అడిగినా, దర్శకుల్ని అడిగినా, అసలు మీరు డబ్బులెందుకు యిస్తున్నారని ప్రకటనకర్తల్ని అడిగినా, ఆఖరికి ఛానెళ్ల యజమానుల్ని ఇదేంటని ప్రశ్నించినా అందరూ అటూ ఇటుగా ఒకే రకమైన జవాబు చెప్పారని, మన కలవరం గారి విశ్లేషణ ఈ సాయంత్రం ఉందట. కలవరం గారో 'పీడ' పురుగు, ఆయనకేం పని లేనట్టుంది. మీరేమన్నా చూస్తారా ఏం, మీరూ ఆయనలాంటాయనే కదా" చెప్పింది పంపరపనస. ఆ ప్రోగ్రాం పేరు "బాగొకరికి, బాధొకరికి" అట అంటూ.

"ఆ సంగతి తర్వాత! ముందు మనం అర్జంటుగా మీ ఊరు వెళ్ళాలి. బయల్దేరు" అన్నాడు పరమేష్టి.

"ఉన్నట్టుండి, అత్తగారింటిమీద మోజెందుకు పుట్టిందో మీకు" అంది.

"వెళ్తే నీకే తెలుస్తుంది. కదులు తొందరగా"

"ఎందుకో చెప్పండి కాస్త"

"ఎట్టిపరిస్థితుల్లో ఇప్పుడు చెప్పేదికాదు.

**పరమేష్టి, పంపరపనస దంపతులు. పరమేష్టికి ఉద్యోగంలో ఎంతో గౌరవంతోపాటు పబ్లిక్‌తో టచ్ ఉండే ఇతర వ్యాపకాలెన్నో ఉన్నాయ్. లేనిది మనశ్శాంతే. ఎందుకంటే పంపరపనస బ్రహ్మాండ భూమండల తెలుగుతెర ప్రేక్షక మహిళా సమాఖ్య సెక్రటరీ! టీవీ బద్దలై పోయేలా సీరియల్స్ చూస్తుందిమరి! కానీ అంతలోనే పరమేష్టికి టీవీ సిగ్నల్స్‌రానిచోటకు ట్రాన్స్‌ఫర్ కావడంతో అసలు కథ మొదలైంది. అప్పుడు భార్య ఏం చెప్పింది? పరమేష్టి ఏం చేశాడు?**

రైలు మిస్సయితే ఇప్పట్లో ఇంకోటి లేదు. కారు రిపేరులో ఉంది. టాక్సీకి అయిదు వేలవుతుంది"

భర్తవెంట బయల్దేరింది పంపరపనస!

•••

ఇంటిముందు జనం! 'ఇంట్లో బంధువుల కిటకిట! జరిగిందేంటో కనిపించింది.

"అమ్మా!"

అంటూ ఏడ్చింది! ఏడుస్తూనే ఉంది!

ఏడుస్తూనే 'టీవీ ఎవర్రా ఆపింది' అని అరిచింది.

మళ్లీ ఏడుస్తూనే ఉంది!

ఎంతసేపు, రోజులు గడిచాయి. ఏడుపులు నవ్వుల ముచ్చట్లయ్యాయి!

రెండురోజులు అదనంగా ఉన్నారు.

రిపేరు పూర్తయిందని తెలిసి డ్రైవర్ని కారు తీసుకురమ్మని చెప్పారు ఫోన్లో.

వస్తుంటే! "ఎంత మంచివారండీ మీరు. కారులో టీవీ పెట్టించారు" అంది. డ్రైవర్ నవ్వుని అద్దంలోంచి చూశాడు పరమేష్టి.

•••

ఓ పెద్ద షాపింగ్‌మాల్‌కి వెళ్ళివచ్చింది పంపరపనస. తెచ్చిన ప్యాకేజీ సోఫాలో పడేసింది. కాళ్ళుకడుక్కుని, తల్లి ఫోటోముందు నించుని తదేకంగా చూస్తూ కారుతున్న కన్నీటిని ఆపకుండా అలాగే ఉండిపోయింది. భర్త గమనిస్తున్నాడన్న ఆలోచనలో లేదు. పరమేష్టి దగ్గరగావచ్చి భుజంమీద చేయివేసి, కళ్ళు తుడిచాడు. భార్య సాధారణ స్థితిలో లేదు. పడుకో బెట్టాడు.

•••

"ఆకస్మికంగా నా భార్యలో వచ్చిన ఆశాజనకమైన మార్పు" అంటూ వాట్సప్‌లో, ఫేస్‌బుక్‌లో మెసేజ్‌లు పంపాడు. గంటలోనే అనూహ్యమైన స్పందన వచ్చింది. తొంభైతొమ్మిది శాతం పురుషులే ఉన్నారు. అందరూ ఎలావచ్చింది మార్పు అనేవాళ్ళే, అదేదోచెప్పి పుణ్యం కట్టుకోండి అనీ, విడిగా వచ్చి కలుస్తాం సంగతి చెబితే పెద్ద ఎత్తున పారితోషికం ఇస్తాం అనీ అనేవాళ్ళే!

పరమేష్టి ఆలస్యం చేస్తున్నకొద్దీ సంఖ్య పెరుగుతూనే ఉంది!

•••

"ఏమండీ, మీరెక్కడికి వెళ్తే అక్కడికి వస్తాను" అని ఏదో చెప్పబోతున్న పంపరపనస, డాక్టర్ కలవరం, షుగర్ డాక్టర్ భార్యలతో రావడం చూసి ఆగింది. భర్తలలో ఆనందం భార్యలలో కనిపించడం లేదు!

"నీవు సమాఖ్య ద్రోహివి! నీ విద్వత్తుకిమెచ్చి నిన్ను సెక్రటరీ చేస్తే వెన్నుపోటు పొడుస్తావా" అని ఏవేవో మాటల్ని ఇటుకలుగా జేరుస్తున్నది జాంబవతి. పంపరపనస గౌతమ'బుద్ధి'గా చిరునవ్వునే సమాధానంగా ఇస్తోంది.

•••

మాల్‌లో షాపింగు పూర్తి చేసుకుని, ప్యాకింగుల్ని కారులో పెట్టమని డ్రైవర్‌కి చెప్పిన పంపరపనస కెవ్వున కేకపెట్టి, ఎగిరిగంతేసి పడింది! తనకు దర్శనమైంది పదేళ్లుగా సాగుతున్న సీరియల్లో అత్తాకోడళ్ల పాత్రధారిణులు. టీవీలో చూసినట్లు ఏ మాత్రం లేరు. వయసు తక్కువతో చెరగని నవ్వుతో ఉన్నారు. కోడలుపాత్ర మోడ్రన్ డ్రస్సులో ఉంది. సెల్ఫీ ప్లీజ్ అంది పంపరపనస.

"మేం మీతో ఫోటో దిగడం మొదలుపెడితే అది మా సీరియల్ లాగానే ఎడ తెగదు. కాబట్టి వద్దు. వీలైనప్పుడు మళ్లీ కలుద్దాం" అన్నారు వాళ్ళు.

అయితే వాళ్ళిద్దరూ నిజజీవితంలో తల్లీకూతుళ్లని తెలిసి షాకయింది పంపరపనస! ఆ షాక్‌తో ట్రీట్‌మెంటయిందని ఆనందపడ్డాడు పరమేష్టి ప్రశాంత చిత్తంగా! ఆ సంగతే భర్తలకు చెప్పాడు! వాళ్ళూ ఆ కోవలోనే ఆలోచించడం మొదలుపెట్టారు.



**బాలీవుడ్‌ను గడగడలాడించిన సంఘటన ఒకటి 1987లో జరిగింది. భారతదేశంలో సినీ ప్రేమికులందరూ నిశ్చేష్టులై నిలిచిపోయారు ఆ వార్త తెలియగానే.**

**పదిహేనేళ్లుగా బాలీవుడ్ సంగీత సామ్రాజ్యాన్ని ఏలుతున్న క్యాసెట్‌కింగ్, 'టి' సిరీస్ అధినేత గుల్షన్‌కుమార్‌కు, 12-8-1997 నాటి ఆ మంగళవారం, అమంగళంగా సమాప్తమైంది. ఆరోజు లోకండ్ వాలాలోని తన ఇంటికి దగ్గరలోని, తనే రినోవేట్ చేసిన, శివుడి గుడికి వెళ్ళాలని పూజా సామగ్రినంతా సిద్ధం చేసుకున్నాడు. ఇంట్లో నుంచి కాలు బయటపెట్టాడు. ఇక అది ఆఖరు సారి ఇంట్లోకి అడుగు పెట్టడమని ఊహించలేదు.**

గుడిలో శివుడికి అభిషేకం చేసుకుని, బయటకు వచ్చి తన కారు దగ్గరికి ఓ పది అడుగులు వేశాడో లేదో, ఒక బక్క పలుచని పొడవాటి వ్యక్తి వచ్చి కుడి కణతకు తుపాకీ గురిపెట్టడంతో గుల్షన్ కుమార్ నివ్వెరపోయి, ఏం చేస్తున్నావ్! అని



అతన్ని ప్రశ్నించాడు. వాడు వెటకారంగా 'భూమ్మీద చేసిన పూజలు చాలు, ఇక పైకిపోయి చేసుకో!' అంటూ తన 9 ఎం.ఎం. పిస్టల్‌తో కాల్చాడు. అప్పటికే, అలర్ట్ అయిన గుల్షన్ తల పక్కకు తిప్పడంతో గురితప్పి నుదుటికి రాసుకు పోయింది. కిందపడిన గుల్షన్‌కుమార్ తనను శివుడు రక్షించాడని అనుకుని, గుడిపక్కనే ఉన్న గుడిసెలవైపు పరుగెత్తటం ప్రారంభించాడు. ఈ లోపల బయట కాపుకాస్తున్న మరో ఇద్దరు దుండగులు, పరుగెత్తుకుంటూ వస్తున్న గుల్షన్ కుమార్‌ను చూసి ఆయనమీద గుళ్ళవర్షం కురిపించారు. అతని ఛాతిలో, వీపులో పదహారు గుళ్ళు పంప్‌చేశారు. అప్పటికీ, కొన ప్రాణాలతో ఉన్న గుల్షన్‌కుమార్ గుడిసెల్లోకి దూరి ప్రాణాలు కాపాడుకోవాలని ప్రయత్నించాడు కానీ ఆ గుడిసెలవాళ్ళు ప్రాణభయంతో ఆయన ముఖం మీదే తలుపులు మూసేయడంతో నడిరోడ్డుమీద ఒక చిన్నగోడ పట్టుకుని అక్కడే కుప్పకూలిపోయాడు.

ఒక మసాలా బాలీవుడ్ సినిమాలో మాదిరిగానే ఆయన పట్టుకున్న గోడమీద కాళీమాత బొమ్మ, ఆ తల్లిపాదాల దగ్గర గుల్షన్‌కుమార్ పడి ఉండగా దారినపోయేవాళ్ళు పోలీసులకు, అంబులెన్సుకు ఫోన్ చేశారు. కానీ, హాస్పిటలుకు వెళ్ళే లోపే అతని ప్రాణాలు పోయాయి.

విచిత్రం ఏమిటంటే, జీర్ణావస్థలో ఉన్న ఆ శివుడు గుడిని గుల్షన్ కుమార్ ప్రపంచంలో కెల్లా ఖరీదైన మార్బుల్ పరిచి పునర్నిర్మించాడు. అప్పటి నుండే ఆ గుడికి భక్తులు రావడం మొదలైంది. చుట్టుపక్కల దుకాణాలు వెలిశాయి. చాలామందికి జీవనోపాధి లభించింది. అయినా వాళ్ళే ఆయనను తమ ఇళ్ళల్లోకి రానీయకుండా, ముఖంమీదే తలుపులు వేసేశారు. ఆయనను నిర్దాక్షిణ్యంగా మృత్యుముఖంలోకి నెట్టేశారు.

అడిగినంత మొత్తం ప్రొటెక్షన్ మనీ ఇవ్వలేదని మాఫియా, ఈ ఘాతుకానికి ఒడిగట్టింది.

గుల్షన్‌కుమార్ హత్యతో బాలీవుడ్ వణికి పోయింది.

అయితే, గుల్షన్‌కుమార్ స్నేహితులకు మాత్రం ఇట్లాంటి సంఘటన ఎప్పుడో ఒకప్పుడు జరుగుతుందని ముందే తెలుసు. వాళ్ళ అనుమానానికి కారణం, గుల్షన్‌కుమార్ పేరు, మాఫియా హిట్ లిస్టులో ఉండడమే! అప్పటికే పది కోట్ల ప్రొటెక్షన్ మనీ ఇవ్వాలని మాఫియా నుండి రెండు మూడు సార్లు బెదిరింపులు వచ్చాయని, కానీ ఆయన వాటిని సీరియస్‌గా తీసుకోలేదని అతని సన్నిహితులు పోలీసులకు చెప్పారు. కొంతమంది ఆయన ఐదు కోట్లు అంతకుముందే ఇచ్చాడని, మిగిలిన ఐదు కోట్లు మాత్రం ఇవ్వడానికి ఇష్టపడనందునే మాఫియా ఈ 'హిట్'కు సుపారీ ఇచ్చిందని అభిప్రాయ పడ్డారు.

అయితే ఇది మాఫియా పని కాదని, వ్యాపార సంబంధమైన కక్షలతో, జంట సంగీత దర్శకులు 'నదీం-శ్రవణ్'లలో ఒకరైన నదీం ప్లాన్ చేసి గుల్షన్‌కుమార్‌ను హత్యచేయించాడని కొందరు అంటారు. అదెంతవరకు నిజమోగానీ, ఆ హత్య జరిగిన నాటి నుండి 'నదీం' భారతదేశంలో అడుగు పెట్టలేదు.

అలా, ఢిల్లీ వీధుల్లో పళ్ళరసాలు చేసి అమ్మే బండి స్థాయి నుండి, అప్పట్లోనే 350 కోట్ల రూపాయల సంగీత సామ్రాజ్యాన్ని స్థాపించి, క్యాసెట్ కింగ్ అని పేరు గాంచిన గుల్షన్‌కుమార్ నడిరోడ్డు మీద, మాఫియా చేతుల్లో, నికృష్టంగా



## జరిగిన కథ

ఆస్కార్ అవార్డుల పోటీల్లో అతడి చిత్రం ఎంపికైన సందర్భంగా అమెరికా వెళుతున్నాడా తెలుగు దర్శకుడు. విమానంలో కూర్చుని గతం గుర్తుచేసుకున్నాడు. జూనియర్ ఆర్టిస్టు హత్యాయత్నం కేసులో దర్శకుడికి, డీసీపీ పుష్పాకిరణ్ ప్రమేయంతో, లిఫ్ట్ ఇస్తాడు నిర్మాత. దాంతో సినిమా నిర్మించేందుకు సన్నద్ధమవుతాడు దర్శకుడు. నటి జలజ హత్యకేసులో సయీమ్‌ని ఎన్‌కౌంటర్ చేస్తారు. హీరోగా రాం, హీరోయిన్‌గా శ్రావణిని సెలెక్ట్ చేస్తాడు. షూటింగ్ మొదలవుతుంది. క్రమంగా శ్రావణి పట్ల ఆకర్షితుడవుతాడు. డైరెక్టర్‌కి తన గతమేమిటో చెప్పి, అతడినుంచి దూరంగా వెళ్ళిపోతుంది శ్రావణి. నవీన్ కూడా తనకో కమిట్‌మెంట్ కావాలని అడిగాడని శ్రావణి చెప్పడంతో, నవీన్‌ని పక్కకు తప్పిస్తాడు డైరెక్టర్. రామప్పలో తిరిగి షూటింగ్ ప్రారంభమవుతుంది. ఆ రాత్రి అభిషేకంగారు తన గురించి చెబుతూ, సినీఫీల్డులోకి మాఫియా ఎంట్రీ గురించి చెప్పడం మొదలుపెడతాడు.

ఆ తర్వాత.....

బలయ్యాడు.

బాలీవుడ్ చరిత్రలో ఇది ఒక విషాద సంఘటన. ఒక బ్లాక్‌మార్క్. కాలా దబ్బా.

అలాగే హృతిక్ రోషన్ నటించిన 'కహో నా ప్యార్‌హై' సినిమాకు సంబంధించిన ఓవర్సీస్ హక్కులు తమకు ఉచితంగా ఇవ్వాలని హృతిక్ తండ్రి రాకేష్ రోషన్‌ను బెదిరించడం, ఆయన దానికి ఒప్పుకోకపోవడంతో, ఆయన మీద 'సుపారీ' ఇచ్చారు. దుబాయ్ స్థావరంగా ఉన్న మాఫియా, ఆయనను చంపడానికి పాకిస్థాన్‌లో ప్రణాళిక రచించింది. కానీ, రాకేష్ ప్రాణాలతో బయట పడ్డాడు. కానీ తరువాత వాళ్ళతో సంధి చేసుకున్నారని అంటారు.

టాలీవుడ్‌లో కొన్ని సినిమాల్లో హీరోయిన్‌గా నటించిన మందాకిని, దావూద్ ఇబ్రహీం ప్రియురాలే. మందాకిని ముందుగా బాలీవుడ్‌లో రాజ్ కపూర్ చిత్రం 'రాం తేరీ గంగా మైలీ' వంటి హిట్ సినిమాలో నటించింది. అలాగే మోనికా బేడీ, నొటోరియస్ మాఫియా లీడర్ అబూ సలేంతో సహజీవనం చేసేది. మోనికాబేడీ నటించిన చిత్రాలన్నీ 1995 నుంచి 2000 వరకు నిర్మించినవే. అంతకుముందు నుంచే అబూసలేంతో కలిసి జీవిస్తున్న మోనికాబేడీ 2002లో దొంగ పాస్‌పోర్ట్ మీద తమ దేశంలోకి ప్రవేశించినందుకు గాను 'పోర్చుగల్' దేశంలో పోలీసులకు

# సినీవాలి

17

-ప్రభాకర్ జైని సెల్: +91 90308 83785

# బాలీవుడ్‌లో అందాల ఆ'కృతి'

**వెం**డితెరమీద ఎన్ని ఫ్లాపులు ఎదురైనా సక్సెస్ మీద కృతి కర్బందాకు ఆశ చావలేదు. బాలీవుడ్‌లో హాట్ సీన్లు చేసేసి స్టార్ హీరోయిన్ బిరుదు కొట్టేద్దామనుకుంది. కానీ ఆ ఆశ అడియాసే అయింది. దాంతో ఎక్స్‌పోజింగ్ మీద దృష్టి పెట్టింది. ఒక్క తెర మీదే కాకుండా బయట కూడా ఎక్స్‌పోజింగ్ చేస్తోంది. ఏ ఈవెంట్‌కి అయినా ఉల్లిపొరలాంటి దుస్తులు వేసుకుని వచ్చేస్తోందట! నటనలో సత్తా చూపించాలే తప్ప ఇలా అందాలను ఎగ్జిబిషన్‌లో పెడితే అవకాశాలు రావు అని బాలీవుడ్ జనాలు అంటున్నారు. ఆ అదృష్టం ఒక్క సన్నీకే దక్కిందనీ, అందరికీ దక్కాలంటే కష్టమని కూడా అంటున్నారు.



పట్టుబడి, ఆ దేశంలోనే తన ప్రియుడైన అబూ సలేంతో కలిసి జైలుశిక్ష కూడా అనుభవించింది. అదే నేరానికిగాను భారతదేశంలో కూడా 2006లో పట్టుబడి ఐదు సంవత్సరాలు జైలులో గడిపింది.

కానీ టాలీవుడ్‌కు, మాఫియాకు నేరుగా సంబంధాలున్నాయని ఇంతవరకు నిరూపించబడలేదు. కానీ ఈమధ్య మన హీరో హీరోయిన్ల పేర్లు డ్రగ్ మాఫియా వ్యక్తుల దగ్గరున్న డైరీల్లో దర్శనమిస్తున్నాయి.

పోలీసుల అంచనాల ప్రకారం టాలీవుడ్‌లోని చిన్నాపెద్ద కలిసి ఉన్న 3000 మంది నటీనటుల్లో, ముఖ్య సాంకేతిక నిపుణుల్లో 30% మంది డ్రగ్స్‌కు అలవాటు పడ్డారని, లేకపోతే, ఇంత పెద్దఎత్తున డ్రగ్స్ టాలీవుడ్‌కు అడ్డాలుగా ప్రసిద్ధి చెందిన ప్రాంతాల్లోనే ఎందుకు దొరుకుతాయని ప్రశ్నిస్తున్నారు.

కానీ, టాలీవుడ్ పెద్దలు ఈ వాదనను కొట్టిపడేస్తున్నారు. మహాఅయితే ఓ ముప్పై నలభై మంది మత్తు పదార్థాలకు బానిసలై ఉంటారని, వారిని పక్కా ఆధారాలతో పట్టుకొని శిక్షించాలనీ లేకపోతే ఇండస్ట్రీమీద బురద చల్లడం మానుకోవాలని సినీ నట సంఘ నాయకులు హెచ్చరించారు కూడా.

హైదరాబాదులోని దాదాపు పది పబ్బులు డ్రగ్స్‌కు అడ్డాలుగా పేరు పడ్డాయి. వాటిని పోలీసులు ఎప్పుడూ అబ్జర్వ్ చేస్తూనే ఉంటారు.

హైదరాబాదు నగరం కాస్మోపాలిటన్ సంస్కృతి అలవరచుకున్నప్పటి నుంచి, ఆధునిక, పాశ్చాత్య జీవితానికి సంబంధించిన దుర్గుణాలు కూడా వచ్చి పడుతున్నాయి.

ఈ మధ్య వ్యభిచారుల డెన్‌మీద దాడిచేస్తే, ఆ దాడుల్లో సినీతారలు పట్టుబడడంతో టాలీవుడ్ విస్తుపోయింది.

అదే సినిమా ప్రపంచపు చీకటి కోణం.

సినీ వినీలాకాశంలో తారలుగా పెరుగుతున్నప్పుడు, వీళ్లల్లో చాలామంది, ఒక లైఫ్‌స్టైలుకు అలవాటు పడతారు.

ఫైవ్‌స్టార్ హోటల్స్, పడవల్లాంటికార్లు, ఫ్లైట్లు, పార్టీలు, పిక్నిక్కులు, కాస్మెటిక్స్, మేకప్పులు, రకరకాల సెంట్లు, డిజైనర్ డ్రెస్సులకు బానిసలవుతారు.

**సినీ వినీలాకాశంలో తారలుగా పెరుగుతున్నప్పుడు ఒక్కొక్కరు ఒక్కో లైఫ్‌స్టైల్‌కు అలవాటు పడతారు. పబ్బులు, పార్టీలు, మందు, మత్తు, మగువ ఇలా... సినిమా ఛాన్సులున్నంతవరకు, డిమాండ్ ఉన్నంతవరకు ఇవన్నీ ప్రొడ్యూసరో, ఎవరో ఒకరు భరిస్తారు. కానీ ఒకసారి లైంలైట్ నుంచి తప్పుకుంటే.. డిమాండ్ తగ్గిపోతే... ఏమిటి వాళ్ళ పరిస్థితి? ఆకాశం నుంచి ఒక్కసారిగా నేలమీదకు జారిన వారి భవితవ్యం ఏమిటి?**

నటులైతే, తాగుడుకు, డ్రగ్సుకు, అమ్మాయిలకు అలవాటు పడతారు.

సినిమా ఛాన్సులున్నంత వరకు, డిమాండ్ ఉన్నంత వరకు, నీ మీద రూపాయి ఖర్చుపెడితే, పది రూపాయలు వస్తున్నంతవరకు, ఇవన్నీ ప్రొడ్యూసరో, ఎవరో ఒకరు భరిస్తారు.

ఆ లైం లైటు నుండి తప్పుకోగానే, ఆ దేదీప్యమానమైన లైట్ల వెలుతురు పడక, వారు మసకబారి పోగానే సమస్యలు ప్రారంభమవుతాయి.

నువ్వు కనపడగానే, అంగరంగవైభోగంగా ఆహ్వానించి అక్కున చేర్చుకునేవారు, పక్కకు తప్పుకుంటారు. ఎక్కడ నువ్వు సహాయం చేయమని అడుగుతావోనని నీ ఫోన్లు ఎత్తకుండా, నువ్వు ఇంటికి వెడితే లేరని చెప్పిస్తారు. వారి అదృష్టం బాగోలేక ఎదురుపడితే, 'కలువ్, చూద్దాం, పరిస్థితి బాగోలేదు, ఆరోగ్యం బాగా చూసుకో, చిన్న మీటింగుంది, నీకేంటయ్యా' వంటి పడికట్టు పరామర్శలు చేస్తారు. నీ ఇంటి డోర్‌బెల్లు మోగుతుందేమోనని నువ్వు ప్రతీరోజు ఎదురు చూస్తుంటావు. ఎవరి ఫోన్ మోగినా, నీ ఫోనేనని భ్రమపడుతుంటావు. నీ ఇంటి ముందు నుండి ఏ కారు పోయినా, నీ ఇంటి ముందే ఆగుతుందని ఎదురు చూస్తుంటావు.

కానీ, నీ పతనం ప్రారంభమయిందని గ్రహించవు.

ఆకాశం మీది తారలు నేలమీదికొచ్చి, నేల మీద జీవనం గడపలేక, మురికి దారులగుండా ఆకాశాన్ని ఎక్కాలని చేసే ప్రయత్నం విఫలమై నరక కూపాలైన వ్యభిచార కొంపలపాలవుతారు.

దివంగతులైన అలాంటి నటులూ ఉన్నారు.

అవకాశాలు వచ్చినపుడు, డబ్బులు చేతిలో ఆడుతున్నప్పుడు చక్కగా ఇన్వెస్ట్ చేసి భవిష్యత్తును సెక్యూర్ చేసుకునే వాళ్ళు, అవకాశాలు కోల్పోయిన తర్వాత కూడా, అదే స్థాయి జీవన విధానాన్ని మెయింటెయిన్ చేస్తూ గౌరవప్రదంగా బ్రతుకు గడుపుతారు.

ఇప్పటి నటీనటుల్లో చాలామంది మంచి వ్యాపార దృక్పథంతో డబ్బులు కాపాడుకుంటున్నారు. దీపం ఉండగానే ఇల్లు చక్కదిద్దుకుంటున్నారు. ఇంతకుముందు టాలీవుడ్ హీరోయిన్లకు కుటుంబ పెద్దల సహకారం, అండ ఉండేవికావు. కానీ ఇప్పుడలా కాదు. విద్యావంతుల కుటుంబాల నుండి వచ్చిన హీరోయిన్లకు తల్లిదండ్రులు - సలహా, సంప్రదింపులు జరిపి వచ్చిన డబ్బులను లాభం వచ్చే రియల్ ఎస్టేట్, జ్యుయలరీ, హోటల్, జిమ్స్, గార్మెంట్ పరిశ్రమల్లో ఇన్వెస్ట్ చేసేందుకు తోడ్పడుతున్నారు.

టాలీవుడ్‌లోని సభ్యులందరూ, శోభన్‌బాబును నిత్యం తలుచుకోవాలి. ఆయన తనతో కలిసి పని చేసిన వాళ్ళందరికీ బలవంతంగానైనా, వచ్చిన డబ్బుల్లో సగం ధనాన్ని భూమి మీద పెట్టుబడి పెట్టమని సలహా ఇచ్చేవారు. ఆయన సలహా విన్న వాళ్ళు, పాత మహాబలిపురం రోడ్డులో ఎకరాల కొద్దీ భూములు, చెన్నైనగరంలో బిల్డింగులు, ఇళ్ళు, ఆఫీసులు, కమర్షియల్ కాంప్లెక్సులు కొనుక్కుని జీవితంలో స్థిరపడ్డారు. ఆయన సలహా పాటించిన వారిలో చంద్రమోహన్, తమిళనాడు దివంగత ముఖ్యమంత్రి జయలలిత కూడా ఉన్నారు.

ఆయన సలహాను ఇప్పటికీ చాలామంది హీరో

హీరోయిన్లు పాటిస్తున్నారు. అలా చేయనివాళ్ళు వ్యసనాలకు లోనైనవాళ్ళు ఆర్థిక ఇబ్బందులకు లోనై, డిప్రెషన్లకు గురై కాలగర్భంలో కలిసిపోతున్నారు".

అభిషేకంగారి అప్రతిహతం ఉపన్యాసాన్ని ఆపకపోతే తెల్లవారేసరికి కూడా కొనసాగుతూనే ఉంటుందని,

"సరేనండీ! థాంక్స్.. మళ్ళీ రేప్పొద్దున్నే షూటింగ్ ఉంది కదా, గుడ్‌నైట్!" అని చెప్పి లేచి నిలబడ్డాను.

అభిషేకంగారి ప్రసంగం ఎక్కడో ప్రారంభమై, ఎటో వెళ్తుంది. ఎక్కడ ముగుస్తుందో కూడా తెలియదు.

అభిషేకంగారు కొంచెం నిరాశ చెందారు. కానీ, ఆయనక్కూడా కొంచెం మత్తు దిగడంతో దాన్ని పూరించాలని బయల్దేరాడు.

నేను మంచం మీద పడుకుని ఆయన చెప్పిన విషయాల గురించి ఆలోచిస్తూనే నిద్రలోకి జారిపోయాను.

•••

మరునాడు షూటింగ్ అంతా సీరియస్ మూడ్‌లోనే జరిగింది. రాత్రి జరిగిన సంఘటనతో హీరో హీరోయిన్లతో పాటు నా మూడ్ కూడా పాడయింది. లక్కీగా ఆ రోజు హెవీ సీన్లు లేవు. మాబ్ సీన్స్, స్టూడెంట్స్ అంతా కలిసి రామప్ప దేవాలయ శిల్పసౌందర్యాన్ని చూపించే సీన్లు ఉండడంతో సులభంగానే, ఏ అవాంఛనీయ సంఘటనలు లేకుండానే షూటింగ్ పూర్తయింది.

రామప్ప నుంచి హైదరాబాదుకు తిరిగొచ్చాక రాం, రీటా కొన్ని రోజులు కన్పించలేదు. వాళ్ళిద్దరూ గోవాకు వెళ్ళారని తెలిసింది.

నేను కూడా ఉస్మానియా యూనివర్సిటీలో షూటింగ్ చేయడానికి పర్మిషన్ సంపాదించడానికి నానా కష్టాలు పడాల్సి వచ్చింది. మంత్రి చుట్టూ, ప్రిన్సిపల్ సెక్రటరీ చుట్టూ, యూనివర్సిటీ రిజిస్ట్రార్ చుట్టూ తిరగాల్సి రావడంతో చాలా చిరాకుగా ఉంది. అందరూ వేదికలెక్కి అది చేస్తామని, ఇది చేస్తామని ఉపన్యాసాలు ఇస్తారు కానీ నిజంగా సహాయం చేసే సమయానికి ఎవ్వరూ ముందుకు రారు. చివరకు, రోజుకు యాభైవేల రూపాయల అద్దెకట్టే షరతుమీద పర్మిషన్ లభించింది.

ఈ లోపల ఎన్నోసార్లు ఫోన్‌చేస్తే మూడు రోజుల తర్వాత రాం, గోవా నుంచి వచ్చాడు. కానీ అతని ప్రవర్తన బాగా మారిపోయింది. అంతకు ముందున్న వినయం స్థానే నిర్లక్ష్యం కొట్టొచ్చినట్టు కన్పిస్తోంది. నాకు గత రెండు సినిమాల అనుభవం అదే నేర్పింది. ఒక్క సినిమా సగంలోకి వచ్చాక, మనం అవకాశం ఇచ్చిన నటీనటులే మన ముందు ఫోజులు కొడతారు. ఎందుకంటే మనం వారిని, సగం వరకు షూటింగ్ జరిగిన తరువాత తీసేయలేము. ఆ సమయానికి వాళ్ళకు మేనేజర్లతో, ప్రొడక్షన్ డిపార్ట్‌మెంట్ వాళ్ళతో కెమెరామెన్లతో పరిచయాలు పెరిగి టాలీవుడ్ అంతా తనకోసమే ఎదురు చూస్తుందన్న ఫీలింగ్‌లోకి వచ్చేస్తారు. మన సినిమాలో నటించడం వల్ల పాపులారిటీ సంపాదించుకున్న వారికి మిగతా సినిమాల ఆఫర్లు ఆకర్షణీయంగా కనిపిస్తాయి.

అభిషేకం గారు కూడా అదే అన్నారు.

"సార్! 'రాం' రెండు సినిమాల్లో బుక్ అయ్యాడట సార్! కారు కూడా కొన్నాడు" అని అన్నాడు.

"ఓహో!" అనుకున్నాను.

అది సహజం. ఎందుకంటే ఒక సినిమా పూర్తి కావొస్తుంటే, ఆ నటుల్లో ఆత్మవిశ్వాసం పెరుగుతుంది. అంతకుముందు అవకాశాల కోసం తిరిగినప్పుడు ఉండే బేలతనం, అగమ్యగోచరంగా ఉన్న భవిష్యత్తు, ఒక సినిమా పూర్తి కాబోతుండేసరికి మాయమవుతాయి. తనను నమ్మి తీసిన సినిమా అతనిలో ధైర్యాన్ని, ఏ పాత్రనైనా చేయగలననే విశ్వాసాన్ని నింపుతాయి.

ఇట్లాంటప్పుడే వాళ్ళ వ్యక్తిత్వం, క్యారెక్టర్ బయటపడుతుంది. ఆ ఆత్మవిశ్వాసం గర్వంగా మారకుంటే నాలుగు కాలాల పాటు ఇండస్ట్రీలో నిలబడతారు. లేదంటే, అంతకుముందు వచ్చి

## సినీవాలి
## కూపన్ నెం.15 విజేత

### గట్టుపల్లి భారతి
**పొన్నపూడి,**
**శ్రీ పొట్టి శ్రీరాములు నెల్లూరు జిల్లా**

**ఈవారం సినీవాలి చదివారు కదా!**
**మా ప్రశ్నకు మీ జవాబు క్రింది కూపన్‌లో స్పష్టంగా రాసి**
**కూపన్‌ని కత్తిరించి మాకు పంపండి. లక్కీడిప్‌లో ఫ్యాన్సీ చీర గెలుచుకోండి!**

## సినీవాలి -17 (8-2-2017)

మా ప్రశ్న: ఏ యూనివర్సిటీలో సినిమా షూటింగ్ జరిగింది?

మీ జవాబు----------------------------------------------------------------

చిరునామా----------------------------------------------------------------

-------------------------------------------------------------------------

----------------------------------------పిన్----------------------ఫోన్‌నెం.----------------------

**ఈ కూపన్‌ను 7 ఫిబ్రవరి 2017 తేదీలోగా మా కార్యాలయానికి పంపగలరు.**

మా చిరునామా: నవ్య వీక్లీ, ఆంధ్రజ్యోతి బిల్డింగ్స్, ప్లాట్ నెం. 76, రోడ్ నెం 70, అశ్వనీ లే అవుట్, హుడా హైట్స్, జూబ్లీ హిల్స్, హైదరాబాద్-33

వివాహాది శుభకార్యాలకు కంచిపట్టు చీరల నిలయం పి.యన్.మూర్తి క్లాత్‌స్టోర్స్ మెయిన్ రోడ్, హన్మకొండ వారి సౌజన్యంతో...

పోయిన, ఎంతోమందిలా, వన్‌టైం వండర్‌లాగా, కాలగర్భంలో కలిసిపోతారు.

అభిషేకం గారు ఏదో చెప్పాలని తటపటాయిస్తున్నారు.

"సార్! మన హీరో చెడిపోతున్నాడు సార్! ఎవరో అతన్ని చెడగొడుతున్నారు సార్! మనోడు రాత్రిళ్ళు బంజారాహిల్స్ రోడ్లమీద కాపు కాస్తున్నాడు సార్!"

"అంటే?"

"అంటే ఏముంది సార్, కాల్‌గర్ల్స్‌కు బదులు కాల్‌బాయ్స్ అన్నమాట!"

"ఛీ, ఛీ!" అన్నాను.

"అవును సార్! ఇప్పుడు ఇదే పెద్ద ప్రొఫెషన్ సార్!" అన్నాడు.

"అభిషేకం గారూ! ప్లీజ్, ఇక ఈ టాపిక్ వదిలేయండి" అన్నాను.

•••

ఉస్మానియా యూనివర్సిటీలో షూటింగ్ అనుకున్నంత సాఫీగా జరగలేదు. మొదటి రోజునే అడుగడుగునా ఆటంకాలు... స్టూడెంట్స్ రకరకాల అభ్యంతరాలు చెప్పారు. కానీ, నేను అందరినీ కలిసి, యూనివర్సిటీ యాజమాన్యం ఇచ్చిన పర్మిషన్ చూపించి, ఇది ఒక విద్యార్థి యూనివర్సిటీ జీవితం గురించి తెలియచెప్పే ఒక గొప్ప నవలను బేస్ చేసుకుని తీస్తున్న సినిమా అని చెప్పి ఒప్పించాను. నాకు తెలిసిన పాత మిత్రులను కూడా రంగంలోకి దించాను. ఒకసారి వాళ్ళు మా కాన్సెప్టును అర్థం చేసుకున్న తర్వాత బాగా కోఆపరేట్ చేశారు. చాలామంది అక్కడక్కడా నటించారు కూడా! కానీ షూటింగ్ జరుగుతున్నంత సేపు కొంచెం టెన్షన్‌గానే ఉంది. యూనివర్సిటీ యాజమాన్యం కూడా ముందే కండీషన్ పెట్టింది. 'విద్యార్థులు అభ్యంతరం చెపితే తమ బాధ్యత ఏమీ ఉండదన్నది' ఆ కండీషన్.




అన్ని కష్టాలు పడినా, ఉస్మానియా యూనివర్సిటీలో షూటింగ్ చేయడం ఒక మధురమైన అనుభూతి.

పల్లెటూరి నుంచి వచ్చిన హీరోను ఆ ఎత్తయిన భవనాలు, విశాలమైన కారిడార్లు, పుష్టిగా, బలంగా, ఆ భవంతిభారాన్ని మోస్తున్నట్టున్న స్తంభాలు - మరో లోకంలోకి తీసుకువెళ్తాయి. ఇక్కడ ఉన్నతమైన భవంతులే కాదు ఆదర్శాలు, విలువలు, అభిరుచులు ఉంటాయనీ, కుల, మత, పేద, ధనిక భేదాలు లేని విద్యార్థి వర్గం ఉంటుందనీ ఆశిస్తాడు. కానీ, అతని ఆశలు మొదట్లోనే కల్లలవుతాయి.

ఇక్కడ భవనాలే ఉన్నతమైనవి తప్ప మనుషులు, వారి మనస్తత్వాలు కాదని ఆవేదన చెందుతాడు.

తను బి.ఏ చదువుతున్నప్పుడు యూనివర్సిటీలో చదవాలని కలలు కనేవాణ్ణి, కానీ, ఇక్కడకు వస్తే, ఇక్కడ మరో రకం రాజకీయాలు రాజ్యమేలుతున్నాయని చింతిస్తాడు.

దానికి తోడు, నూతన యౌవనంలోని సెక్స్ కోరికలు, మొట్టమొదటి సారిగా చూసిన సిటీ అందాలు, సీతాకోకచిలుకల్లాంటి యౌవనంతో మిసమిసలాడుతున్న అమ్మాయిలు, విశాల ప్రపంచానికి గవాక్షాల్లాంటి అనేక పుస్తకాలు ఒకవైపు అతన్ని ఒక సుందర ప్రపంచంలో విహరింపచేస్తుంటే; మరోవైపు, పల్లెటూళ్ళో తన తల్లిదండ్రులు పడే ఈతి బాధలు, తన చదువుకోసం, ఇంట్లో కుదువ పెట్టడానికి ఇంకేమీ మిగలక పోవడంతో, అమ్మ కాళ్ళకు ఉన్న వెండి కడియాలు అమ్మి డబ్బులు తెచ్చి ఇచ్చిన నాన్న జ్ఞాపకాలు, ముంచుకొస్తున్న పరీక్షల్లో ఎలా రాస్తానోననే భయాలు, ఒకవేళ పరీక్ష పాసయినా, ఇన్నివేల మంది డిగ్రీలు పుచ్చుకుంటుంటే తనకు ఉద్యోగం దొరకదేమోనన్న చింత అతనికి మనఃస్థిమితం లేకుండా చేస్తాయి.

ఒకానొక సమయంలో, హాస్టల్ వార్డెన్, మెస్ బిల్లు కట్టలేనందుకు పెట్టిన కంచం తీసేసి మెస్ నుండి వెళ్ళగొడితే, అవమానభారంతో యూనివర్సిటీ బిల్డింగ్ పైకెక్కి, ఆత్మహత్య చేసుకోవాలనుకుంటాడు. మిత్రులు అతన్ని ఓదారుస్తారు. అక్కున చేర్చుకుని వారిస్తారు.

ఈ సమయంలోనే సెకండ్ హీరోయిన్‌తో చిన్న ప్రేమకథ. ఆ అమ్మాయి అప్పటి రోజుల్లోని స్టాండర్డ్స్ ప్రకారం మోడ్రన్ గర్ల్. చనువుగా తిరుగుతుంది. యూనివర్సిటీలో అతని క్లాస్‌మేట్స్ ఆమె గురించి తప్పుగా మాట్లాడితే, హీరో వాళ్ళతో గొడవ పడితే, ఫైటింగ్ వరకు వస్తుంది పరిస్థితి. ఎప్పటి నుంచో, యూనివర్సిటీలో రగులుతున్న గ్రూపు రాజకీయాలు, ఈ సంఘటనతో పరాకాష్టకు చేరుకుంటాయి.

పొద్దున్న జరిగిన ఈ సంఘటన తర్వాత, హీరోయిన్ కోరిందని, తనకు అస్సలు ఇష్టం లేని గుర్నాథం దగ్గర ఐదు రూపాయలు తీసుకుని 'కాగజ్ కే ఫూల్' అనే సినిమాకు వెళతాడు. అక్కడ హీరోయిన్ తన అమెరికా ఫ్రెండుతో వెళ్ళిపోతుంది. హీరోకు అతని గురువు కలిసి హిత బోధ చేస్తాడు.

క్యాంపస్‌కు వస్తుంటే అమ్మా నాన్నలు గుర్తుకొస్తారు.

హాస్టల్లో రమేష్ చూపించిన బిచ్చగత్తె నగ్న ఫొటోలను చూసేసరికి అతని చిన్ననాటి ప్రియురాలు 'రత్తి' గుర్తుకొస్తుంది. తనను ఎంతగానో ప్రేమించిన రత్తిని, కులాలు వేరని, పెళ్ళి చేసుకోనని చెప్పడం, తన కళ్ళముందే ఊరి దొర రత్తిని ఎత్తుకెళ్లి మానభంగం చేస్తుంటే, పిరికివాడిలా నిస్సహాయంగా నిలబడడం, రత్తి తన కళ్ళముందే వ్యభిచారం చేయడం, చివరికి రచ్చబండ దగ్గర ఊరి నుంచి వెలివేయడం - అన్నీ గుర్తుకొచ్చి 'నేనొక యూస్లెస్ యింపొటెంట్ ఫెలో'నని బాధపడడం వంటి సీన్లు యూనివర్సిటీలోని ఆర్ట్స్ కాలేజీ కారిడార్లలో, లైబ్రరీలో, హాస్టల్స్‌లో, ఛాయ్ అడ్డాలలో, యూనివర్సిటీలో జనరల్‌గా విద్యార్థులు ఎక్కడైతే గుమికూడతారో, అవే ప్రదేశాలలో షూట్ చేశాము.

చివరకు రెండు గ్రూపుల మధ్య జరిగిన పోరాటంలో రౌడీగ్యాంగ్ పారిపోతుంది.

తన జీవితంలో ఒక్కరోజున జరిగిన సంఘటనలు తన దృక్పథంలో మార్పు తేవడంతో హీరో ప్రశాంతంగా నిద్రకు ఉపక్రమిస్తాడు.

ఆందోళనకరమైన కలతో దినచర్య ప్రారంభమయిన ప్రోటగానిస్ట్, ఒక రోజు కథ, సరిగ్గా విశ్లేషించుకుంటే సమస్యలన్నీ దూదిపింజల్లా తేలిపోయి, ప్రశాంతంగా నిద్రకు సిద్ధపడడంతో సినిమా ముగుస్తుంది.

యూనివర్సిటీ నేపథ్యంలో జరిగే కథను క్యాంపస్‌లోనే తీయాలని నా పట్టుదల. ఎన్ని కష్టాలు పడి అయినా సరే, అక్కడే చేశాము.

నేను అనుకున్న విధంగా, యూనివర్సిటీ శిల్పకళా వైభవాన్ని, గంభీరతను సంతరించుకున్న భవనాలను లోపలినుంచి, గత యాభై సంవత్సరాల్లో షూట్ చేయగలిగింది మేమే! అదో గర్వకారణం.

అలా, యూనివర్సిటీ షెడ్యూల్ సంతృప్తికరంగా ముగిసింది.

ఈ షెడ్యూలుతో షూటింగ్ దాదాపు పూర్తయినట్టే.

ఇక మిగిలింది ప్యాచ్‌వర్క్.

***(ఇంకా వుంది)***

# హోమియోకేర్ ఇంటర్‌నేషనల్‌లో

## 'ఆస్టియో ఆర్థరైటిస్'కు సరైన వైద్యం

డా. శ్రీకాంత్ మోర్లావర్
CMD
హోమియోకేర్ ఇంటర్‌నేషనల్



మన శరీర ప్రతి కదలికలో 'కీళ్ళ' పాత్ర అత్యంత కీలకమైనది. అంతటి ప్రాధాన్యం సంతరించుకున్న 'కీళ్ళ' పరంగా ఏ చిన్న మార్పు ఏర్పడినా అది మన కదలికలను కష్టతరంగా మార్చి, రోజువారీ దినచర్యల నిర్వహణలో సైతం తీవ్ర ఇబ్బందులను కలుగజేస్తుంది. అలాంటి మార్పుల వలన తలెత్తే ఆస్టియో ఆర్థరైటిస్ సాధారణంగా ఎక్కువ మందిలో కనిపిస్తుంది. కొందరిలో వయస్సు పైబడటం వలన ఈ వ్యాధి ఏర్పడితే, మరికొందరిలో కీళ్ళకు దెబ్బతగలటం, కొన్ని అసాధారణ కదలికలు, జీవక్రియల అసమతుల్యతలు, కీళ్ళు సంక్రమణకు గురికావడం మొ॥గు కారణాలతో పాటు కొన్ని ఇతర వ్యాధులకు గురి అయిన కారణంగా కూడా 'ఆస్టియో ఆర్థరైటిస్' ఏర్పడే అవకాశం ఉంది. కాబట్టి దీనిని యుక్తవయస్సు వారిలో కూడా ఎక్కువగా గమనించడం జరుగుతోంది. దీర్ఘకాలికంగా ఈ వ్యాధికి గురికావడం వలన, ఇది కీళ్ళను పూర్తిగా దెబ్బతీసి అంగవైకల్యానికి గురిచేసే ప్రమాదం పొంచి ఉంటుంది. ఇతర వైద్యవిధానాల మేరకు నొప్పి నివారణకు ఉపయోగించబడే మందుల వలన కేవలం తాత్కాలిక ఉపశమనం తప్పించి పూర్తిగా వ్యాధి నయం కాబడే అవకాశం లేదు. కానీ సరైన హోమియో చికిత్స ద్వారా ఏ వయస్సుల వారికైనా ఈ వ్యాధి నుండి పూర్తిగా ఉపశమనం లభించే అవకాశం ఉంది. ఆర్థరైటిస్ అనగా కీళ్ళు శోథమునకు గురికావడం. సుమారు 100 రకాలుగా కనిపించే ఈ తరహా సమస్యలలోకెల్లా 'ఆస్టియో ఆర్థరైటిస్' ప్రధానమైనది మరియు సాధారణమైనది.



Healthy joint Osteoarthritis

**'ఆస్టియో ఆర్థరైటిస్' అనగా:** కీళ్ళలోని కార్టిలేజ్ అనే మృదులాస్థి అరుగుదలకు గురి అయి, తద్వారా చుట్టూ ఉన్న కణజాలంపై ప్రభావం చూపడాన్ని ఆస్టియో ఆర్థరైటిస్ అంటారు. ఇది ఒక 'డీ జనరేటివ్ డిసీజ్'. ఇది సాధారణంగా 40 సం॥ల వయస్సు దాటిన వారిలో ఎక్కువగా కనిపిస్తుంది. పురుషులతో పోలిస్తే స్త్రీలలో, ముఖ్యంగా నెలసరి ఆగిపోయిన మహిళలలో ఎక్కువగా గమనించవచ్చు. మోకాళ్ళలో ఎక్కువగా కనిపించే ఈ సమస్య వలన – చేతివ్రేళ్ళు, వెన్నుపూస, తుంటి ప్రాంతం, కాలివ్రేళ్ళు, తదితర ప్రాంతాలు 'ఆస్టియో ఆర్థరైటిస్'కు గురయ్యే అవకాశం ఉంది. సాధారణంగా కీళ్ళలోని (ఉదా: మోకాళ్ళలో) రెండు ఎముకల చివరి భాగాలు కలిసే ప్రాంతం 'కార్టిలేజ్' అనే నున్నటి మృదులాస్థితో కప్పబడి ఉంటుంది. ఈ రెండు ఎముకలు ఒకదానిపై మరొకటి తేలికగా మరియు పరస్పరం మృదువుగా కదిలేందుకు గాను ఆ ఏర్పాటు సహాయపడుతుంది. ఇంతేకాకుండా అది ఒక "షాక్ అబ్‌సార్బర్" మాదిరిగా కూడా పనిచేస్తుంది. మోకాళ్ళ అంతర్ నిర్మాణంలో భాగంగా మోకాలి జాయింట్‌ను చుడుతూ సైనోవియం అనే పొర ఉంటుంది. ఈ సైనోవియం పొర సైనోవియల్ ఫ్లూయిడ్ అనే ముఖ్య ద్రవాన్ని విడుదల చేస్తుంటుంది. ఈ సైనోవియం పొరను చుడుతూ క్యాప్సుల్ అనే మరొక గట్టి పొర ఏర్పడి ఉంటుంది. ఇది మోకాలి జాయింట్‌ను స్థిరంగా ఉంచేందుకు దోహదపడుతుంది. ఇవే కాకుండా మోచిప్ప లేదా పటెల్లా, టెండాన్స్ మరియు వివిధ లిగమెంట్లు, కండరాలతో మోకాలి జాయింట్ ఎంతో పటిష్టంగా నిర్మితమై ఉంటుంది. 'ఆస్టియో ఆర్థరైటిస్' మొదలైన కొన్ని రోజులకు కార్టిలేజ్ క్రమంగా అరిగిపోవడం ప్రారంభమవుతుంది. దీంతో అది క్రమేణా పలుచగా మారుతుంది. దీనివలన ఎముకలలో కణజాలం శోథమునకు లేదా వాపునకు గురి కావడం జరుగుతుంది మరియు ఎముకల చివరి భాగాలు అదనంగా పెరుగుతాయి. వీటిని 'ఆస్టియో ఫైట్స్' అని అంటారు. వీటి ప్రభావం చేత సైనోవియం పొర కొంచెం ఉబ్బి అదనపు ద్రవాన్ని విడుదల చేస్తుంది. దీనివలన కీళ్ళ ప్రాంతంలో వాపు ఏర్పడుతుంది మరియు ఆ రెండు ఎముకలు ఒకదానితో మరొకటి రాపిడికి గురికావడం వలన తట్టుకోలేనంత స్థాయిలో తీవ్రమైన నొప్పి ఉంటుంది.

**కారణాలు:** 40 సం॥ వయస్సు పైబడిన వారిలో – ముఖ్యంగా పురుషుల కంటే స్త్రీలలో ఎక్కువగా వస్తుంది. • పూర్వం కీళ్ళకు ఏదైనా దెబ్బ తగలడం • అధిక బరువు కలిగి ఉండటం • కాళ్ళ ఎదుగుదలలో హెచ్చుతగ్గులు ఉండటం • కీళ్ళపై అధిక ఒత్తిడి కలిగించే పనులు చేయడం • కొన్ని ఇతర వ్యాధులు (ఉదా: రుమటాయిడ్ ఆర్థరైటిస్) కలిగి ఉండటం మరియు వంశపారంపర్యత వంటి అంశాలన్నీ ఈ వ్యాధికి గల కారణాలుగా చెప్పవచ్చు.

**లక్షణాలు:** కీళ్ళనొప్పులు, కీళ్ళవాపు, చేతితో తాకితే కీళ్ళు వేడిగా అనిపించడం • కీళ్ళు బిగువుగా మారడం, ముఖ్యంగా ఉదయాన్నే నిద్ర లేచిన తరువాత కొంత సమయం నడక కష్టంగా అనిపించడం • క్రింద కూర్చునేటప్పుడు – లేచేటప్పుడు ఇబ్బంది కలగడం • కీళ్ళ దగ్గర రాపిడి శబ్దాలు వినిపించడం • తీవ్ర నొప్పి మూలంగా నడకలో వ్యత్యాసం కనిపించడం వంటి లక్షణాలను గమనించవచ్చు. • వెన్నెముక 'ఆస్టియో ఆర్థరైటిస్'కు గురి అయితే చేతులు–కాళ్ళు బలహీనపడటం, మొద్దుబారటం మరియు తిమ్మిర్లు వంటి లక్షణాలు కనిపిస్తాయి.

**వ్యాధి నిర్ధారణ పరీక్షలు:** రోగి లక్షణాలను బట్టి మరియు రక్తపరీక్ష, మోకాలు నుండి కొద్దిగా ద్రవాన్ని తీసి పరీక్షించడం, X-Ray, MRI, CT-Scan వంటి పరీక్షలు నిర్వహించడం ద్వారా ఆస్టియో ఆర్థరైటిస్‌ను నిర్ధారించవచ్చు.

**హోమియోకేర్ ఇంటర్‌నేషనల్ వైద్యం:** జెనెటిక్ కాన్స్టిట్యూషనల్ చికిత్సా విధానం ద్వారా – 'ఆస్టియో ఆర్థరైటిస్'ను తగ్గించడంలోను మరియు కీళ్ళ కదలికలను సురక్షితంగా ఉంచడంలోనూ హోమియోకేర్ ఇంటర్‌నేషనల్ ఎంతో కాలంగా మంచి ఫలితాలను సాధిస్తూ వస్తోంది. కేవలం నొప్పి, వాపు వంటి లక్షణాలను తగ్గించడమే కాకుండా, రోగి మానసిక–శారీరక లక్షణాలను పరిగణనలోకి తీసుకొని ప్రభావవంతమైన చికిత్స ఇవ్వటం ద్వారా వ్యాధిని సంపూర్ణంగా నయం చేయవచ్చు మరియు వ్యాధి తీవ్రత పెరగకుండా కాపాడవచ్చు.




# జి.పి.ఎస్!

**కారు హాస్పిటల్‌లోకి వేగంగా వచ్చింది. ఓ యువతి భోరున విలపిస్తూ కారులోంచి దిగింది. రక్తమోడుతున్న ఒక యువకుణ్ణి ఎమర్జెన్సీ వార్డుకు తరలించారు సిబ్బంది. వాచ్‌మన్ అభ్యర్థనతో ఆ అమ్మాయి మళ్ళీ కారు దగ్గరకు వచ్చింది. అడ్డంగా ఉన్న కారు పార్కింగ్ ప్లేస్‌లో పెట్టకుండా ఉడాయించింది. శవాన్ని ఆమె హాస్పిటల్‌లో వదిలి పారిపోయిందా? అది హత్యకేసేనా? డిటెక్టివ్ శరత్ పరిశోధన ఏ తీరుగా సాగింది?**

**కారు వేగంగా వచ్చి హాస్పిటల్ ముందు ఆగింది.**

**కారులో వచ్చినవాళ్ళ తొందరేమిటో ఆ వేగమే అందరికీ స్పష్టంగా తెలియజేసింది.**

**అంతా పక్కకు జరిగారు. చేస్తున్న పనులు ఆపి ఆవైపు చూడసాగారు. అందమైన యువతి కారులోంచి బైటకు దూకింది. కంగారుగా ఉంది. ఏడుస్తూ లోపలకు పరుగెత్తింది.**

**కాస్సేపటికి నర్సులు, హాస్పిటల్ పనివాళ్ళు స్ట్రెచర్ పట్టుకొచ్చారు.**

కారు మరోతలుపు తెరచి సీటులో వాలిపోయిన ఓ యువకుణ్ణి బైటకు లాగారు. అతడి శరీరం రక్తసిక్తమయి ఉంది. అతడి శరీరంలో ప్రాణం లేదని చూసేవాళ్ళందరికీ తెలుస్తోంది.

ఆమె ఏడుస్తూ స్ట్రెచర్‌వెంట పరుగెత్తింది. కారు దారికి అడ్డుగా ఉండటంతో కాసేపటికి సెక్యూరిటీగార్డు ఆమెను బైటకు తీసుకువచ్చాడు.

ఆమె కారులో కూర్చుని స్టార్ట్ చేసింది. గార్డు చూపించిన స్థలంలో కారు ఆపకుండా కారును వేగంగా ఎక్సిట్ గేట్‌వైపు దూకించి క్షణాలలో అదృశ్యమైపోయింది.

•••

కేసు జటిలంగా ఉంది. ప్రియుణ్ణి కాల్చిచంపి తనని తాను కాల్చుకుందని తెలుస్తోంది. కానీ అర్థంకానిదేమిటంటే, అతణ్ణి కాల్చిచంపి, అక్కడే తనని తాను కాల్చుకోవచ్చు. కాల్చి, అతన్ని ఆస్పత్రికి తెచ్చి, చనిపోయాడని నిర్ధారించుకుని, మళ్ళీ దూరంగా వెళ్ళి తననితాను కాల్చుకుంది. ఎందుకని?' డిటెక్టివ్ శరత్‌ని ప్రశ్నించాడు ఇన్‌స్పెక్టర్ విజయ్.

అసిస్టెంట్ రామువైపు చూసి, 'వివరాలు కనుక్కున్నావా?' అని అడిగాడు.

'ఎస్ బాస్' అన్నాడు రాము. చెప్పటం ప్రారంభించాడు.

'బాస్.... అమ్మాయిపేరు ఆరతి. వివాహిత. ఆమె భర్త హరి. ఆస్పత్రిలో మరణించిందిమాత్రం ఆమె ప్రియుడు రఘు. ఆమెకు హరితో పెళ్ళి జరిగి ఇంకా ఏడాది కాలేదు.

హత్య జరిగిన సమయంలో ఆరతి భర్త ఆఫీసులో ఉన్నాడు. భార్య ఆత్మహత్య విషయం తెలిసి పరుగెత్తుకొచ్చాడు. వార్తతెలిశాక హరి మౌనంగా ఉండిపోయాడు. వీళ్ల సంబంధం గురించి అతడికి తెలిసినట్టులేదు. రఘుతో పరిచయంకూడా ఉన్నట్టు లేదు. విషయం తెలిసి 'షాక్'కు గురైనట్టు కనిపించాడు. ఏమీ మాట్లాడలేదు'.

విజయ్‌వైపు తిరిగాడు శరత్. 'పరిశోధన ఫలితమేమిటి?' అడిగాడు.

'తుపాకీపై ఆరతి వేలిముద్రలు దొరికాయి. రఘుని కాల్చిందీ, ఆరతి కాల్చుకున్నదీ ఒకే తుపాకీ. తూటాలు మ్యాచ్ అయ్యాయి. రఘు కూడా వివాహితుడే. విషయం తెలిసి అతడి భార్య కూడా 'షాక్'కు గురైంది. అయితే హత్య సంఘటన లేక ఆరతితో సంబంధం...ఈ రెంటిలో ఏ విషయం ఆమెకు ఎక్కువ షాక్ ఇచ్చిందో తెలియటంలేదు' చెప్పాడు విజయ్.

'నేనోసారి హరిని, రఘు భార్యని ప్రశ్నించి కారును పరిశీలిస్తాను, ఆ తర్వాతే ఒక నిర్ణయం తీసుకుందాం' అన్నాడు శరత్ లేస్తూ.

•••

'ఆమె ఆత్మహత్య వార్త షాక్‌నిస్తే, రఘుతో సంబంధం ఇంకా షాకిచ్చింది. మాపెళ్ళి జరిగి ఏడాది కాలేదు. అంతలోనే ఆమె వేరేవాడితో సంబంధం పెట్టుకోవడం అంటే, ఆ దోషం నాదే. ఆమెను ఆకర్షించలేక పోయినట్టున్నాను' హరి మాటల్లో విషాదంతో పాటు పరాజయాన్ని స్వీకరిస్తున్న భావం ధ్వనించింది. అతడివైపు జాలిగా చూశాడు శరత్.

'పెళ్ళికిముందే అతడితో సంబంధం ఉంది. రఘు వేరే పెళ్ళి చేసుకున్నాకనే ఆమె మిమ్మల్ని చేసుకుంది' అతడి బాధ తగ్గించటానికి చెప్పాడు శరత్.

హరి తల ఎత్తలేదు. అప్పటివరకూ మౌనంగా ఉన్న హరి తండ్రి తన కొడుకు భుజంమీద చెయ్యి వేసి, 'అమ్మాయి అమాయకంగా కనిపించింది. మావాడు ఇష్టపడ్డాడు. కానీ ఇంత మోసం అనుకోలేదు. ముఖంచూసి మోసం గ్రహించలేం కదా' అని మళ్ళీ ఆయనే అడిగాడు, 'మా కారు మాకెప్పుడిస్తారు?'

'కొన్ని ఫార్మాలిటీస్ ఉన్నాయి. అవి పూర్తయ్యాక ఇచ్చేస్తారు' చెప్పాడు శరత్.

•••

రఘు భార్య మాట్లాడలేకపోతోంది. ఆమె కన్నీళ్ళు కారుస్తోంది. అతికష్టంమీద అంది, 'ఆ రాక్షసి చచ్చిపోతే పోయింది, ఆయన్ని చంపాల్సిన అవసరం ఏముంది? బహుశా, ఇక ఆమెని కలవనని చెప్పి ఉంటారు. ఆయనకి నేనంటే ప్రాణం. నిన్ను కలిసిన తరువాత ఇంకెవరినీ కలవాలనిపించటంలేదు అనేవాడు' అంది ఏడుస్తూ. శరత్ ఆలోచిస్తూ వచ్చేశాడు.

•••

'బాస్... తుపాకీ ఆమె మామ పేరుమీద రిజిస్టరైంది. ఇదిగో ఫోను కాల్ డీటెయిల్స్' జాబితా అందించాడు రాము.

వెంటనే ఫోన్ చేసి అడిగాడు శరత్, 'మీరు తుపాకీ ఎక్కడ దాచేవారు?'

'ఎవరికీ అందకుండా దాచేవాణ్ణి. కానీ న్యూ ఇయర్ రోజు బెంగళూరులో ఆడవాళ్లపై జరిగిన అత్యాచారం చూశాక ధైర్యంగా ఉంటుందని నా కోడలికి నేనే ఇచ్చాను. ఆమె ఆఫీసు నుంచి వచ్చే సరికి చాలా లేటవుతుంది. అందుకే ఇచ్చాను. ఇలా వాడుతుందనుకోలేదు' హరితండ్రి సమాధానమిచ్చాడు.

ఫోను పెట్టేసి ఆలోచిస్తూ కూచున్నాడు శరత్.

'ఇకనిన్ను కలవను అని ఉంటాడు రఘు. ఆరతి భరించలేక కోపంతో కాల్చింది. తరువాత భయపడి, బాధతో ఆస్పత్రికి తెచ్చింది. రఘు చచ్చిపోయాడని తెలిశాక, జైలుకెళ్ళాలనే భయంతో ఆత్మహత్య చేసుకుని ఉంటుంది, సింపుల్ బాస్' చెప్పాడు రాము.

'ఆ ఫోటోలు ఇటియ్యి' అడిగాడు శరత్.

రఘు శవం ఫోటోలు చూసి, కళ్ళు మూసుకుని ఆలోచించాడు శరత్. తర్వాత రాముతో అన్నాడు, 'సొంతకారు డ్రైవ్‌చేసుకుని వెళుతూ, రఘును తోవలో ఎక్కించుకుంది. నిర్మానుష్యంగా ఉండే ప్రదేశానికి వెళ్లారు. ఇద్దరిమధ్య మాట మాట పెరిగింది. ఆమె కోపంతో కాల్చింది. అతడు ఆమెవైపు తిరిగి ఉండాలి. అతన్ని తీసుకొచ్చినపుడు కారులో శవం ఏ పొజిషన్‌లో ఉందో తెలిస్తే బాగుండు. అప్పుడు జరిగిన హడావిడి వల్ల ఎవ్వరూ చెప్పలేక పోతున్నారు'.

'అంటే ఎవరో హత్యచేసి ఉంటారన్న ఆలోచనలో ఉన్నావా బాస్?' అడిగాడు రాము. శరత్ లేచి నిలబడ్డాడు. 'కారును పరిశీలిద్దాం పద' అన్నాడు.

•••

కారు లోపల డ్రైవర్ పక్కన సీటును, రక్తం మరకల్ని జాగ్రత్తగా పరిశీలించాడు శరత్.

డ్రైవర్‌వైపు, కారు లోపల క్షుణ్ణంగా పరిశీలించాడు. అతని దృష్టి డాష్‌బోర్డ్‌పై పడింది. అతని కళ్ళు చిన్నవయ్యాయి.

డ్రైవర్ సీటువైపు వెళ్ళి డాష్‌బోర్డు, డ్రైవర్



పానెల్, స్టీరింగ్‌వీల్ జాగ్రత్తగా పరిశీలించాడు. నెమ్మదిగా పానెల్ స్క్రూలువిప్పి పరిశీలించాడు.

శరత్ భృకుటి ముడిపడింది. పానెల్‌లో వ్రేలాడుతున్న వైరును పట్టిచూశాడు. వేలితో దాన్ని అనుసరిస్తూ పోయాడు. డాష్‌బోర్డు కిందవైపు వేళ్ళు కదిపాడు. అతడు ఊహిస్తున్నది తగిలింది.

సంతృప్తిగా నిట్టూర్చాడు శరత్.

'కారు మెకానిక్‌ను పిలవాలి' అన్నాడు.

అతడివైపు ప్రశ్నార్థకంగా చూశాడు విజయ్.

'అమ్మాయిది ఆత్మహత్య, కానీ రఘుది హత్య అని అనుమానించవచ్చు' అన్నాడు శరత్.

●●●

'జీపీఎస్ అంటే గ్లోబల్ పొజిషనింగ్ సిస్టమ్. ఈ మధ్య బాగా ప్రాచుర్యం పొందింది. ప్రైవేట్ టాక్సీ కంపెనీలు పెరిగిన కొద్దీ మాకు రద్దీ పెరిగింది. టాక్సీ కదలికలు, పెట్రోలు ఎంత ఖర్చవుతోంది? డ్రైవర్లు పర్సనల్ పనులూ చేసుకుంటున్నారా? వంటివి కనుక్కోవటానికి 'జీపీఎస్' బాగా పనికొస్తుంది' చెప్పాడు జీపీఎస్ యంత్రాల దుకాణం యజమాని.

'వీటిని కంపెనీలేకాక వ్యక్తులు కూడా కొంటారు కదా, ప్రైవేటు వాహనాల కోసం?' అడిగాడు శరత్.

'కొంటారు సార్. డ్రైవర్‌ను పెట్టుకున్నవాళ్ళు కార్లలో ఫిట్ చేయించుకుంటారు. అలాగే భార్యలపై అనుమానం ఉన్నవారు కూడా కారులో జీపీఎస్ డివైజ్ పెట్టిస్తారు!'.

'కారులో ఎలా ఫిట్ చేస్తారు?'

'దీన్లో మూడు వైర్లుంటాయి. ఒకటి ఎర్త్‌వైర్. ఒకటి ఏంటెన్నా, ఇంకోటి జీపీఎస్ కన్సోల్. దీన్ని గేరు వైరుకో, ఫ్యూయల్ మీటర్, కార్ బ్యాటరీకో కలిపేస్తాం. అంతే, కారు కదలగానే మీటర్ పని చేస్తుంది. దానినుంచి ఉపగ్రహానికి సంకేతం వెళ్తుంది. దాన్నుంచి కంప్యూటర్‌కి, మొబైల్‌కి సంకేతం వెళ్తుంది. కంప్యూటర్‌లో, మొబైల్‌లో వ్యక్తికి ప్రత్యేకంగా ఓ సైటు, విత్ పాస్‌వర్డ్ ఇస్తాం. దాని ద్వారా కారు ఎప్పుడు, ఎక్కడ ఉందో సులభంగా తెలుసుకోవచ్చు'.

'ఇలాంటి జీపీఎస్ డివైజ్‌ను హరి అనే వ్యక్తి కొన్నాడా?' హరి వివరాలు ఇచ్చాడు శరత్.

కాస్సేపు రిజిస్టర్ వెతికి చెప్పాడు దుకాణం యజమాని 'రెండు వారాల క్రితం తీసుకున్నాడండి'.

●●●

'నా కంప్యూటర్‌లో జీపీఎస్ సిస్టమ్ వివరాలా? నాకు తెలియదే' ఆశ్చర్యంగా అడిగాడు హరి.

'నీకు భార్యమీద అనుమానంవచ్చి కారులో జీపీఎస్ పెట్టించావు. ఆమె ఆ రోజు బయలుదేరగానే జీపీఎస్ ద్వారా ఆమెకారును వెంబడించావు. ఆమె రఘుని కలవటం చూసి, కోపంతో కాల్చి చంపావు..' కోపం నటిస్తూ అన్నాడు శరత్.

'నాకేం తెలియదు, తెలియదు..' దాదాపుగా ఏడుస్తూ అన్నాడు హరి.

అతడిని పరిశీలనగా చూశాడు శరత్. ఇంతలో ఎవరో మెట్లమీద నుంచి వస్తున్న చప్పుడు వినిపించింది. వెంటనే శరత్, హరి పెదవులపై చేయి వేసి, గదిలో పరదామాటుకి లాక్కెళ్లాడు. అయోమయంగా చూస్తున్న హరికి 'నిశ్శబ్దం' అని సౌంజ్ఞ చేశాడు.

ఎవరో గదిలోకి వచ్చిన శబ్దం..! కంప్యూటర్ దగ్గరకు వెళ్ళి కుర్చీలో కూర్చున్న శబ్దం వినిపించింది. తెర పక్కకు తొలగించి చూశాడు శరత్. కంప్యూటర్ తెరపై జీపీఎస్ సైట్ తెరచి ఉంది. కారు ఎక్కడ ఉందో చూస్తున్నాడు హరివాళ్ల నాన్న.

'కారు ఇంకా పోలీసు కస్టడీలోనే ఉంది' తెర బైటకు వస్తూ అన్నాడు శరత్.

ఆయన ఉలికిపడ్డాడు. కంప్యూటర్ మానిటర్ ఆఫ్ చేయబోయాడు.

'నాన్న!' అన్నాడు హరి.

'చెప్పండి... ఎందుకు చంపారు మీ కోడల్ని?' అడిగాడు శరత్.

●●●

'కోడలి ప్రవర్తనపై అనుమానం వచ్చింది హరి తండ్రికి. రాత్రి ఆలస్యంగా ఇంటికి రావటం, హరి వెళ్ళగానే, ఆమె వెళ్ళిపోవటం ఆయనకి అనుమానం కలిగించింది. ఆయన ఆర్మీలో పని చేశాడు. కోడలు కారులో జీపీఎస్ పెట్టించాడు. ఆరోజు కొడుకు ఆఫీసుకి వెళ్ళగానే కోడలు వెళ్ళిపోవటం గమనించి, తుపాకీతో టూ వీలర్ మీద వెంబడించాడు. రఘుని ఆమె పికప్ చేసుకోవటం చూసి కోపం పట్టలేకపోయాడు. వాళ్లు నిర్మానుష్య ప్రదేశంలో ఆగగానే వెళ్ళి రఘుని కాల్చి చంపాడు. 'నీకు బ్రతికే అర్హత లేదని' కోడలి పైకి తుపాకీ విసిరి వెళ్ళిపోయాడు. గ్లవ్స్ వేసుకోవడంవల్ల తుపాకీపై వేలిముద్రలు పడలేదు. అయితే రఘుని బ్రతికించాలన్న ఆశతో ఆరతి ఆస్పత్రికి పరుగుతీసింది. రఘు మరణించటంతో ఆమె ఆత్మహత్య చేసుకుంది. హరితండ్రి కొడుకు పేరుతో జీపీఎస్ కొని, తన మొబైల్ నంబరు ఇచ్చాడు. దాంతో అతనిపై అనుమానం వచ్చింది' కేసును వివరించాడు శరత్.

**-కస్తూరి మురళీకృష్ణ,**

**సెల్: 98496 17392**





# సెల్యులాయిడ్‌పై స్పోర్ట్స్ లైఫ్

**లైఫ్ ఈజ్ ఎ గేమ్, ప్లే ఇట్ అన్నారు.**
**జీవితం ఓ ఆట. ఆ ఆటలో సాహసమే ఒక బాట.**
**ఆటలే జీవితంగా, ఆటలే లక్ష్యంగా బతికి, చరిత్ర సృష్టించేవారు ఎందరో.**
**అలాంటివారి జీవిత కథలను రీల్ లైఫ్‌గా మారుస్తూ వెండితెర కొత్త పుంతలు తొక్కుతోంది.**
**చిన్న బడ్జెట్ చిత్రాలు ఒకవైపు, వినోదాత్మకమైన ఫుల్ కామెడీ చిత్రాలు మరోవైపు, బాహుబలి వంటి భారీబడ్జెట్ గ్రాఫిక్ సీక్వెల్‌చిత్రాలు ఇంకోవైపు ప్రేక్షకులను అలరిస్తున్న వేళ...**

కమర్షియల్ వాల్యూస్‌తో సందేశాత్మకమైన క్రీడా చిత్రాలు, బయోపిక్స్ అడపాదడపా బాక్సాఫీసు వద్ద సంచలనం సృష్టిస్తున్నాయి. చిత్ర కథా రచయితల భిన్న ఆలోచనా ధోరణికిది తార్కాణం. 'సుల్తాన్', 'దంగల్' వంటి తాజా చిత్రాలు కోట్లు కొల్లగొట్టి హల్‌చల్ చేశాయి. ప్రాంతీయభాషల్లోనూ కలెక్షన్లు సాధిస్తున్నాయి. దీనిపై ఓ లుక్...

కులం, మతం, భాష, దేశం వంటి అడ్డుగోడలు లేని అపురూప శక్తి క్రీడ. విశ్వసౌభ్రాతృత్వానికి చిహ్నం. మానవాళి సమైక్యతకు ప్రతిబింబాలు. నిరంతర పరిశ్రమతో జీవితాన్ని శోధించాలనే స్థిర సంకల్పంతో ముందుకు దూసుకుపోతున్న క్రీడాకారుల స్ఫూర్తిని, వారి బయోపిక్స్‌ను సెల్యులాయిడ్‌పైకెక్కించడం మన దేశంలో క్రీడారంగానికి గొప్ప శుభశకునం.

## ట్రెండ్ సెట్టర్

ఫుల్‌లెంగ్త్ కమర్షియల్ స్పోర్ట్స్ బ్యాగ్రౌండ్ చిత్రాలకు ఈ శతాబ్దారంభంలో లగాన్ చిత్రం శ్రీకారం చుట్టి ఒక ట్రెండ్ సెట్ చేసింది. అశుతోష్ గోవారికర్ దర్శకత్వంలో 2001లో సంచలనం సృష్టించిన చిత్రం 'లగాన్'. 25 కోట్ల ఖర్చుతో 70 కోట్లు రాబట్టి చిత్రపరిశ్రమ భ్రమలను పటాపంచలు చేసింది. సినీ రచయితల ఆలోచనలో మార్పు తెచ్చిన చిత్రమిది. కరువుతో అల్లాడిపోతున్న ప్రాంతంలో మూడేళ్లపాటు పన్ను వసూళ్లు రద్దు చేసేందుకు క్రికెట్ ఆటలో తమను గెలవాలని బ్రిటీషర్లు వేసిన పందెం, ఆ పందెంలో గ్రామస్థులు విజయం సాధించడమే ఈ చిత్రం. క్రికెట్‌పై భారతీయులకున్న ఆసక్తిని గమనించి తీసిన చిత్రమిది.

## ఫోగాట్ సిస్టర్స్ గాథ

తీవ్ర వివక్షగల వెనుకబడ్డ రాష్ట్రం హరియాణ. ఆనాటి సాంఘిక పరిస్థితుల్ని అధిగమించి తన కుమార్తెలను మల్లయోధులుగా తీర్చిదిద్దిన ఓ తండ్రి యదార్థగాథ 'దంగల్' చిత్రం. నితేష్ తివారీ దర్శకత్వంలో 2016 డిసెంబరు 21న విడుదలైన ఈ చిత్రం టాక్ ఆఫ్ ది కంట్రీ! భివానీ జిల్లా, బలాలీ నివాసి మహావీర్‌సింగ్ ఫోగాట్‌కు ఆరుగురు ఆడపిల్లలు. వారిలో మొదటి ఇద్దరు కుమార్తెలు గీత, బబిత. మహావీర్ మిగిలిన కుమార్తెలు ప్రియాంక, రీతూ, వినేష్, సంగీతా ఫోగాట్‌లు. వీరిలో గీతా ఫోగాట్, బబితకుమారి ఫోగాట్ సిస్టర్స్ వాస్తవగాథ 'దంగల్' చిత్రం.

ఆడపిల్లలపట్ల చిన్నచూపు ఉన్న పరిస్థితుల్లో, ఆడపిల్లల్ని మల్లయుద్ధ నిపుణులుగా తీర్చిదిద్దడం పెద్ద సాహసమే. మహావీర్‌సింగ్ ఫోగాట్ చాలా చైతన్యవంతంగా, అడ్వాన్స్‌గా ఆలోచించాడు. స్వతహాగా అతడో మల్లయోధుడు. జీవితంలో తన కల నెరవేరలేదు. తన కుమార్తెలను మల్లయుద్ధ నిపుణులుగా తీర్చిదిద్ది తన



కల సాకారం చేసుకుంటాడు. తండ్రిగా అమీర్ ఖాన్, కుమార్తెలుగా ఫాతిమా సనా, సాన్యా మల్హోత్రా నటించారు. నితేష్‌తివారీ, పీయూష్ గుప్తా, శ్రేయాస్‌జైన్, నిఖిల్‌మెహరోత్రా బృందం దీన్ని బాలీవుడ్ చిత్రకథగా తీర్చిదిద్ది కాసులు పండించుకుంది. దేశంలో కోట్లాదిమంది ఆడపిల్లలకు, తల్లిదండ్రులకు స్ఫూర్తినిచ్చిన చిత్రం! క్రీడలంటే కేవలం క్రికెట్ మాత్రమే కాదని చాటి సంచలనం సృష్టించింది. దేశవిదేశాల్లో 300 కోట్లు పైగా వసూలు చేసి రికార్డుల్ని అధిగమించింది. అలాగే, 2016 జూలైలో విడుదలైన భారతీయ రొమాంటిక్, స్పోర్ట్స్ డ్రామా చిత్రం 'సుల్తాన్'. సల్మాన్‌ఖాన్, అనుష్కశర్మలతో 70 కోట్ల పెట్టుబడితో కుస్తీని ప్రధానాంశంగా తీసుకుని నిర్మించిన ఈ చిత్రం 500 కోట్లు వసూలు చేసింది. తమ చిత్రం కంటే దంగల్ అద్భుతంగా ఉందని సల్మాన్ ఖాన్ వ్యాఖ్యానించడం ఒక హైలైట్!

## చక్‌దే ఇండియా

2007 నాటి ఇండియన్ స్పోర్ట్స్ చిత్రం 'చక్‌దే ఇండియా'. దేశంలో ఒక క్రీడా పండుగను సృష్టించిన చిత్రమిది. భారత్-పాక్ మధ్య హాకీ వరల్డ్‌కప్ మ్యాచ్ సీన్లతో నిర్మించిన అద్భుత




చిత్రం. షారుఖ్ ఖాన్ నటించిన అత్యంత ప్రజాదరణ పొందిన చిత్రం. నేషనల్ ఫిలిమ్ అవార్డు సంపాదించింది. 2016 ఢిల్లీ స్వాతంత్య్ర దినోత్సవ ఫిలిమ్ వారోత్సవాల్లో ప్రదర్శితమైంది. అకాడమీ ఆఫ్ మోషన్ పిక్చర్ ఆర్ట్స్ అండ్ సైన్సెస్ వారు ఈ చిత్ర కథను తమ 'మార్గరెట్ హెర్రిక్ లైబ్రరీ'లో భద్రపరిచారు. 20 కోట్ల బడ్జెట్‌తో హిందీ, ఇంగ్లీషులో విడుదలై 127 కోట్లు వసూలు చేసింది.

## మిల్కాసింగ్, మేరీకోమ్

గొప్ప క్రీడాకారులుగా ఎదగాలంటే ఎంత కష్టపడాలో; కోట్లాదిమంది కరతాళ ధ్వనులు, ప్రశంసలు, పతకాలు, అవార్డులు దక్కించుకోవాలంటే ఎంత చిత్తశుద్ధి, ఏకాగ్రత అవసరమో




తెలియజెప్పే బయోపిక్ 'భాగ్ మిల్కా భాగ్'. మిల్కాసింగ్, ఆయన కుమార్తె సోనియా సన్వాల్కా కలిసి రచించిన 'ది రేస్ ఆఫ్ మై లైఫ్' పుస్తకం ఆధారంగా ప్రసూన్‌జోషి రచించిన కథ ఇది. రాకేష్ ఓంప్రకాష్ మెహ్రా దర్శకత్వంలో 2013లో వచ్చిన ఈ బ్లాక్‌బస్టర్‌మూవీలో మిల్కాసింగ్‌గా ఫర్హాన్‌అక్తర్ అద్భుతంగా నటించారు.

మణిపూర్ బాక్సర్ మేరీకోమ్ జీవితాన్ని దేశంలోని గ్రామీణప్రాంత ప్రజలకు సైతం తెలిసేట్టు చేసింది సినీమీడియా. మాంగ్టే చుంగ్నే జంగ్ మేరీకోమ్, ఒలింపిక్స్ కాంస్యంతోపాటు అనేక పోటీల్లో 12కు పైగా స్వర్ణపతకాలు సొంతం చేసుకున్నారు. ఓమంగ్‌కుమార్ దర్శకత్వంలో మేరీకోమ్‌గా ప్రియాంక చోప్రా నటించిన ఈ చిత్రం 2014లో విడుదలైంది. 15 కోట్లతో నిర్మించిన ఈ చిత్రం 87 కోట్ల రూపాయలు వసూలు చేసింది. నగేష్ కుకునూర్ దర్శకత్వంలో వచ్చిన అద్భుత చిత్రం 'ఇక్బాల్'. నజీరుద్దీన్‌షా నటించిన గొప్ప చిత్రమిది. బిపాసాబసు, జాన్ అబ్రహాం నటించిన ఇండియన్ స్పోర్ట్స్ మూవీ 'గోల్'. వివేక్ అగ్నిహోత్రి దర్శకత్వంలో ఫుట్‌బాల్‌పై తీసిన బాక్సాఫీస్ హిట్ చిత్రమిది.

## బయోపిక్స్

క్రీడాకారుల నిజ జీవిత కథలు సెల్యులాయిడ్‌పై చాలానే ఉన్నాయి. భారతసైన్యంలో పనిచేసిన సైనికుడు, జాతీయ, అంతర్జాతీయ పోటీల్లో స్టీపుల్‌చేజ్‌లో పాల్గొన్న అథ్లెట్ పాన్‌సింగ్ తోమర్ యదార్ధగాథను టిగ్మాన్సుధూలియా కథ, దర్శకత్వంలో నిర్మించిన అద్భుత హిందీ చిత్రం 'పాన్‌సింగ్ తోమర్'. బాక్సాఫీస్ హిట్ చిత్రమిది. కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వంతో నీరజ్‌పాండే నిర్మించిన 'ఎం.ఎస్.ధోని' చిత్రం తమిళ, తెలుగు, మరాఠీ భాషల్లోకి కూడా డబ్‌చేశారు. 104 కోట్లతో నిర్మించిన ఈ చిత్రం రెట్టింపు వసూళ్ళు చేసింది.

జట్టుకు ద్రోహం చేశాడనే పేరుతో కెరీర్‌కు దూరమైన క్రికెటర్ అజారుద్దీన్ జీవితం ఆధారంగా వచ్చిన చిత్రం 'అజార్'. కథ రజత్ అరోరా, దర్శకుడు టోనీ డిసౌజా. ఇందులో ఇమ్రాన్‌హష్మి అజార్‌గా, నర్గీస్‌ఫక్రి సంగీతబిజిలానీ (అజార్ రెండోభార్య)గా నటించారు.

ఇక క్రికెట్ దేవుడు టెండూల్కర్ జీవిత కథ తెరకెక్కుతోంది. బాల్యంలో సచిన్‌గా అతడి కుమారుడే నటిస్తున్నాడు. టెన్నిస్‌తార సానియామీర్జా, కోచ్ పుల్లెల గోపీచంద్ చిత్రాలకూ సన్నాహాలు జరుగుతున్నాయి. ప్రవీణ్ సత్తార్ దర్శకత్వంలో తెలుగు, హిందీ, ఆంగ్ల భాషల్లో గోపీచంద్ చిత్రం నిర్మిస్తున్నారు. చైనా, జపాన్, ఐర్లాండ్, స్కాట్లాండ్ దేశాల్లో ఈ చిత్ర నిర్మాణానికి ప్లాన్ చేశారు. పారా ఒలింపిక్స్‌లో హై జంప్‌లో గోల్డ్ మెడల్ సాధించాడు మరియప్పన్ తంగవేలు. దేశమంతా అతడికి జేజేలు కొట్టింది. ఇప్పుడీ సూపర్‌స్టార్ జీవిత కథ ఇంగ్లీషు, తమిళ భాషల్లో తెరకెక్కుతోంది. రజనీకాంత్ కుమార్తె ఐశ్వర్యాధనుష్ స్వీయ దర్శకత్వంలో నిర్మించే ఈ చిత్రం ఫస్ట్‌లుక్ ట్విటర్‌లో విడుదలైంది. ఒక పారా ఒలింపియన్ జీవితాన్ని తెరకెక్కించడం ఇదే.

## తెలుగు చిత్రాలు

క్రీడాస్ఫూర్తిని, ప్రేమకథను మిళితం చేసిన తెలుగు కమర్షియల్ చిత్రాలూ ఉన్నాయి. 'అమ్మ నాన్న ఓ తమిళమ్మాయి' చిత్రంలో కిక్‌బాక్సింగ్, 'తమ్ముడు' చిత్రంలో బాక్సింగ్‌ను హైలైట్ చేశారు. జగపతిబాబు, కల్యాణి కామెడీ చిత్రం 'కబడ్డీ కబడ్డీ', 'గోల్కొండ హైస్కూల్', నటుడు ప్రకాష్ రాజ్ దర్శకునిగా నిర్మించిన చిత్రం 'ధోని', నితిన్ హీరోగా రగ్బీ ఆటను, గ్యాంగ్‌స్టర్స్‌ను మిళితం చేసిన 'సై' చిత్రాలు తెలిసినవే. క్రికెట్, ఫుట్‌బాల్, బ్యాడ్మింటన్, కబడ్డీ, సైకిల్‌పోటీలతోపాటు రిక్షా పోటీలు, రెండెడ్లబండి పోటీలు వంటి అనేక అంశాలను 82 యేళ్ళ తెలుగు చిత్రపరిశ్రమ కథల్లో ఎప్పటికప్పుడు ఉపయోగించుకుంటూనే ఉన్నారు. పరుగుల రాణి అశ్వనీ నాచప్ప జీవిత కథా




చిత్రంలో ఆమే స్వయంగా టైటిల్‌రోల్ పోషించారు.

## ఫుట్‌బాల్‌పై 35 చిత్రాలు

ప్రపంచవ్యాప్తంగా ఫుట్‌బాల్‌పై 35 పైగా చిత్రాలొచ్చాయి.

ఫ్రెడ్డీ జో స్టెయిన్‌మార్క్ యదార్థ కథ ఆధారంగా వచ్చిన 'మై ఆల్-అమెరికన్', 2015లో విడుదలైంది. జిమ్ డెంట్ రాసిన 'కరేజ్ బియాండ్ ది గేమ్' ఆధారంగా ఈ చిత్రాన్ని నిర్మించారు. Aaron Eckhart, Finn Wittrock ఈ చిత్రంలో ప్రధానపాత్రలు పోషించారు.

ఆఫ్రికన్ అమెరికన్ కోచ్ హెర్మన్‌బూన్ జీవిత కథ 'రిమెంబర్ ద టైటాన్స్'. వాషింగ్టన్ డి.సి సబర్బన్ ప్రాంతంలో ఉన్న టి.సి.విలియమ్స్ హైస్కూల్‌లో వివక్షకు గురైన నల్లజాతీయుల ఫుట్‌బాల్ టీమ్‌ను ప్రవేశపెట్టేందుకు ప్రయత్నించి విజయం సాధిస్తాడు. 1986లో విడుదలైన పద్నాలుగేళ్ళ బాలిక కామెడీ, ట్రాజిక్ చిత్రం 'లూకాస్', గొప్ప ఆటగాడు కావాలనుకుని మిల్లుకార్మికునిగా మిగిలిపోయిన క్రీడాకారుడి చిత్రం 'ఆల్ ద రైట్ మూవ్స్'.

'ది కంబ్యాక్స్' కామెడీ చిత్రాన్ని బ్రిటన్, ఫిన్లాండ్, ఆస్ట్రేలియా, న్యూజిలాండ్ తదితర దేశాల్లో 'స్పోర్ట్స్ మూవీ'గా పిలుస్తారు. మరో ఫ్యామిలీ, స్పోర్ట్స్ కామెడీ చిత్రం 'ది గేమ్ ప్లాన్'. లాస్ట్ బోయ్ స్కౌట్, 'ఫ్లాష్‌గోర్డన్'.... ఇలా ఆణిముత్యాల్లాంటి విదేశీ చిత్రాలెన్నో.

## మార్షల్ ఆర్ట్స్ చిత్రాలు

మార్షల్ ఆర్ట్స్‌లో హాలీవుడ్ చిత్రాలు వందలాదిగా విడుదలయ్యాయి. బ్రూస్‌లీ 'ఎంటర్ ది డ్రాగన్' ఆనాటికీ ఈనాటికీ ఆల్ టైమ్ రికార్డే! ప్రపంచవ్యాప్త ప్రజాదరణ పొందిన జాకీచాన్ చిత్రాలు ఎన్నో ఉన్నాయి. ఇలాంటి ఆల్ టైమ్ రికార్డ్ మార్షల్‌ఆర్ట్స్ చిత్రాలు 250కి పైగా ఉన్నాయి. వీటిల్లో కుంగ్ ఫూ - యోగా రెంటినీ మిక్స్ చేసి తీసిన చిత్రాలెన్నో ఉన్నాయి. కమర్షియల్ వాల్యూస్, క్రీడాస్ఫూర్తి కలగలిసిన భారతీయ చిత్రాలు ఇప్పుడు ఒక కొత్త ట్రెండ్. దేశం ఒలింపిక్స్‌లో రాణించడానికి కొత్త క్రీడాకారులు తయారు కావడానికి ఇలాంటి చిత్రాలన్నీ స్ఫూర్తినిస్తాయి.

-రామ్మోహన్



# ఈ కాలం పిల్లలు

-డా. శ్రీమతి కొఠారి వాణీ చలపతిరావు

**హైటెక్‌సిటీలో త్రీ బెడ్రూమ్ డీలక్స్‌ఫ్లాట్. ఆ సంవత్సరమే కొత్తగా సమీర్, సాధ్వి దంపతులు దాన్ని కొన్నారు. ఇద్దరూ సాఫ్ట్‌వేర్ ఇంజనీర్లు. అక్కడికి దగ్గరలోనే ఒక పెద్ద మల్టీనేషనల్ కంపెనీలో పనిచేస్తున్నారు. అక్కడ పనిచేస్తున్నప్పుడే ప్రేమించి పెళ్ళిచేసుకున్నారు. 'ప్రేమించి' అనటం కన్నా ఒకర్నొకరు ఇష్టపడి, అభిప్రాయాలు, అభిరుచులు షేర్ చేసుకుని, భవిష్యత్ ప్రణాళిక చర్చించుకుని 'ఇద్దరికీ జోడీ సరిపోతుంది..అంతా ఓకే ' అనుకున్న తర్వాతనే పెళ్ళి చేసుకున్నారు.**

వాళ్ళ దృష్టిలో ప్రేమ అంటే పరస్పరం కలిసి కూర్చుని మాట్లాడుకుని ఒక ఇంట్లో, ఒక కప్పు కింద సుఖంగా, సంతోషంగా దాంపత్య జీవితం గడపటానికి కావాల్సిన లైఫ్‌స్టైల్‌కి ప్లాన్ వేసుకోవడమే. కుదిరితే ఓ.కే లేకుంటే బై...బై! అంతేగానీ ప్రేమ అంటే పెళ్ళికి ముందే పార్కులు, సినిమాలకు తిరిగేసి అవకాశం దొరికితే హద్దులు మీరేసి ఆ తరువాత మోజు తీరాక 'నువ్వు నాకొద్దు' అని ఎవరో ఒకరు అనేసి సమస్యలు కొనితెచ్చుకోవటం కాదు. 'ప్రేమ' అంటే మెచ్యూర్డ్ యువతకు 'ఫిజికల్ ఎట్రాక్షన్' కాదు. కలిసిన రెండు మనసులు లైఫ్ పార్ట్‌నర్స్ కావటానికి చేసుకునే అరేంజ్‌మెంట్. సమీర్, సాధ్విల ప్రేమ అలాంటిదే గనుక వాళ్ళ పెళ్ళికి ఇరుపక్షాల పెద్దలూ అంగీకరించారు. వాళ్ళ పిల్లల తెలివితేటలు, ఆలోచనా విధానం, ప్రవర్తనా నియమాలమీద వాళ్ళకు ఉన్న నమ్మకమే ఎలాంటి అభ్యంతరాలకు తావివ్వలేదు.

వాళ్ళేం చేసినా అది డిగ్నిఫైడ్‌గా, రెస్పెక్టబుల్‌గా ఉంటుందన్నది వాళ్ళ గట్టి నమ్మకం.

ఆ తర్వాత సమీర్, సాధ్వి పెళ్ళి చేసుకుని జీవిత భాగస్వాములయ్యారు. రెండు సింగిల్ బెడ్రూమ్ ఫ్లాట్స్‌లో విడివిడిగా ఉండేవాళ్ళు ఇప్పుడు ఒక్కటయ్యారు. ఇద్దరికీ జీతం లక్షల్లోనే. అందుకే వెంటనే ఒక లగ్జరీ కారు కొన్నారు. ఆ మరుసటి సంవత్సరమే కోటి రూపాయలుపెట్టి త్రీ బెడ్రూమ్ ఫ్లాట్ కొనుక్కున్నారు. గృహప్రవేశానికి తన నేటివ్‌ప్లేస్ నుంచి తల్లిదండ్రులను తీసుకొచ్చిన సమీర్ వాళ్ళకు ఒక బెడ్రూమ్ కేటాయించాడు. ఆ రోజు నుండీ వాళ్ళను అక్కడే ఉంచుకున్నాడు. తండ్రి జయరామ్ రిటైర్ అయ్యాడు. తల్లి అహల్య కీళ్లనొప్పులతో బాధపడుతూ ఉంటుంది. అందుకే ఇక నుంచి వాళ్ళ బాధ్యత తను తీసుకోవాలని నిర్ణయించుకున్నాడు. ఇల్లు, ఇల్లాలు, కారు సమకూర్చుకోవటం కోసమే ఎదురుచూస్తున్నాడు. సాధ్వికి ఈ విషయం ముందే చెప్పాడు సమీర్. 'అది మన బాధ్యత' అంటూ మనస్ఫూర్తిగా తన అంగీకారం తెలియజేసింది. 'నువ్వు మీ తల్లిదండ్రులను తెచ్చుకుంటే నేనూ మా తల్లిదండ్రులను తెచ్చుకుంటాను' అని పోటీకి రాలేదు. ఎందుకంటే సాధ్వికి ఇద్దరు అన్నలు ఉన్నారు. అల్రెడీ వాళ్ళే తమ తల్లితండ్రుల్ని చూసుకుంటున్నారు. కనుక తన అవసరం అక్కరలేదు. కానీ జయరామ్, అహల్యలకు సమీర్ ఒక్కడే కొడుకు.

ఉన్న ఊరు, అలవాటైన ఇల్లూవాకిలీ వదిలి కొడుకు దగ్గరకువచ్చి ఇప్పటినుండే అతనికి భారం కావడం నిజానికి వాళ్ళకు ఇష్టం లేదు. ఆ మాటే చెప్పినప్పుడు సమీర్ 'ససేమిరా' అనటంవల్ల రావలసి వచ్చింది. విశాలమైన ఆ గదులు, ముట్టుకుంటే మాసిపోతాయేమో, నడిస్తే అద్దంలాంటి ఆ ఫ్లోరింగ్‌మీద ఎక్కడ మరకలు పడతాయో అన్నట్టుగా అందం, రిచ్‌నెస్ కలగలిసిన ఆ ఫ్లాట్ చూసి



ఆశ్చర్య పోయారు వాళ్ళిద్దరూ. కప్ బోర్డ్‌లూ, వార్డ్రోబ్‌లూ, షో కేసులూ, వాష్ బేసిన్లూ ఏవి ఎక్కడ ఉండాలో అక్కడ ఉన్నాయి. మాడ్యులర్ కిచెన్‌లో ఏ సామాన్లు ఎక్కడ ఉండాలో అక్కడ చేతికి అందుబాటులో...ఒక్కటీ బైటకు కనిపించకుండా క్యాబినెట్లలో ఉన్నాయి. ఒక్క స్పూన్ కూడా అటు నుంచి ఇటు రాకుండా ఎక్కడివి అక్కడే నీట్‌గా సర్ది ఉన్నాయి. బాత్‌రూమ్‌లు సైతం తెల్లగా వెన్నెల్లా మెరుస్తున్న టైల్స్‌తో, కమోడ్లతో బాత్ టబ్‌లతో తళతళలాడుతున్నాయి. ప్రతిరూమ్‌లో ఖరీదైన ఫర్నీచర్, షో పీస్‌లూ, అందమైన పెయింటింగ్స్ చక్కగా అలంకరించబడి ఉన్నాయి. ఆ డెకరేషన్ చూస్తుంటేనే ఆ ఇంటి యజమానుల ఈస్థటిక్ సెన్స్, గృహాలంకరణపై ఉన్న ఆసక్తి కొట్టొచ్చినట్టు కన బడుతున్నాయి. భర్తతో కలిసి ఇల్లంతా తిరిగిన అహల్య స్వర్గంలాంటి ఆ ఫ్లాట్ చూసి ఆశ్చర్య పోయింది. "ఇంటికి కోటి రూపాయలు అయింద న్నారు. ఇంకా ఈ ఫర్నీచర్, డెకరేషన్‌కి ఇంకెంత అయి ఉంటుందో!" అంది బుగ్గలు నొక్కుకుంటూ.

"సంపాదించుకుంటున్నారు. ఖర్చుపెట్టుకుంటున్నారు. ఈ తరం కుర్రాళ్ళ లైఫ్‌స్టైల్ ఇదీ...!' లైఫ్ ఉన్నది ఎందుకు ఎంజాయ్ చేయడానికే కదా...!' ఇప్పటి యువతరానిది అదే పాలసీ. చూసి ఆనందించడం, మన పిల్లల ప్రతిభకు మనం గర్వించడం...అంతే మనం చేయవల్సిందీ, చెయ్యగలిగిందీ...!" అన్నాడు జయరామ్. ముప్ఫైఏళ్ళ మీ సర్వీస్‌లో ముక్కీ మూలిగీ ఓ రెండొందల గజాల జాగా కొని ఓ చిన్న డాబా ఇల్లు కట్టగలిగాం మనం. అదీ ఆ ఊళ్ళో కాబట్టి అప్పుడు పది లక్షలకు వచ్చింది" అంది అహల్య భర్తవంక చూస్తూ.

"మరి ఇప్పుడు మన అబ్బాయి జీతంతో పోలిస్తే నా జీతం ఎంతనీ! నాది సంవత్సరం మొత్తం కలి పినా వాడి నెల జీతం కన్నా తక్కువేనేమో! పైగా వాళ్ళు ఇద్దరు సంపాదిస్తున్నారు. అదీగాక అప్పటి మన ఆలోచనా విధానానికి ఇప్పటి పిల్లల ఆలో చనా విధానానికి చాలా తేడా ఉంది. నాకు వచ్చేజీతం ఆ ఇరవై, ముప్ఫైవేలల్లోనే సాధారణ జీవితం గడుపుతూ సమీర్‌ను ఇంజనీరింగ్ చదివించాను. కొంత డబ్బు మిగిలినా నాకు ఖర్చుపెట్టాలని పించేది కాదు. కన్నబిడ్డకు కొంతైనా కూడబెట్టి ఇవ్వాలనిపించేది. పిత్రార్జితంగా వాడికి ఇల్లూ, వాకిలీ, కొంత క్యాష్ జమ చేయాలనిపించేది. అందుకోసం నా అవసరాలు, ఖర్చులు మానుకుని బ్యాంకులో డబ్బులు క్రెడిట్ చేసిన సందర్భాలున్నాయి. నిన్నూ అలాగే ' పొదుపు పొదుపు' అంటూ సాదాజీవి తానికే అలవాటు చేశాను. ఇప్పుడు నా కొడుకు స్వయంగా సమకూర్చుకున్న ఈ వైభోగం చూస్తుంటే అప్పటి నాపిచ్చి ఆలోచనలకు ఇప్పుడు నాకే నవ్వొస్తోంది. వాడి సంపాదన ముందు వాడికి నేను జీవితం మొత్తం కూడబెట్టి ఇద్దామనుకున్న ఆస్తుల విలువ ఎంత తక్కువో అనిపిస్తోంది" అన్నాడు జయరామ్. "అప్పుడు మనం అనుకున్నామా వీడింత ప్రయోజకుడవుతాడని!"

"అలా అంటావా, ఇప్పుడు నీ కొడుకును అడిగి చూడు రేపు నీకు పుట్టబోయే కొడుకుకోసం ఎంత దాచిపెడుతున్నావ్? అని! 'నేను కూడబెట్టేదేమిటి? వాడే సంపాదించుకుంటాడు, కూడబెట్టి ఇవ్వాలనే కాన్సెప్ట్ రాంగ్ నాన్నా!' అంటాడు. అందుకనే వీళ్ళ లైఫ్‌స్టైల్ ఇలా ఉంటుంది!" అని జయరామ్ అంటుండగానే సమీర్, సాధ్వి అక్కడికి వచ్చారు.

"నాన్నా, మీరు ఇక్కడ ఉన్నారా, ఇలారండి మీ బెడ్రూమ్ చూపిస్తాను" అంటూ ముందుకు నడి చాడు. పెద్దవాళ్ళిద్దరూ వాళ్ళను అనుసరించారు. కర్టెన్ తొలగిస్తూ లోపలికి అడుగుపెట్టి విశాలమైన, సౌకర్యవంతమైన ఆ రూమ్‌చూసి ఆశ్చర్యపోయారు ఇద్దరూ. ధారాళంగా చల్లటి గాలి రావటానికి పెద్ద పెద్ద కిటికీలూ, వాటికి పెల్‌మెట్స్ నుంచి వేళ్ళా డుతూ లైట్ కలర్ సిల్కిష్ కర్టెన్లు, పెద్ద డెకొలామ్ మంచం, కుషన్ డన్‌లప్ పరుపులు, వాటిమీద ఆకర్షణీయమైన బెడ్‌షీట్, కంఫర్టు...బెడ్ పక్కనే అటూ ఇటూ రెండు డెకొలమ్ సైడ్ పీసులు, ఏసీ, చిన్న ఫ్రిడ్జ్, పుస్తకాల ర్యాక్, టీవీ, మ్యూజిక్ సిస్టమ్ అన్నీ ఉన్నాయి. లేనివి లేవు! అవన్నీ చూస్తుంటే తామిద్దరి సుఖం, సౌకర్యం కోసం వాళ్ళు ఎంత శ్రద్ధ చూపిస్తున్నారో అన్నీ చేతికి అందేలా అందుబా టులో ఉంచి తమకు ఏ కష్టం కలగకుండా ఎలా ఏర్పాటు చేశారో అర్థమైంది జయరామ్‌కి. అదే అర్థం వచ్చేలా భార్య అహల్య వంక చూశాడు. ఆమె ఏదో కొత్తలోకంలో ఉన్నట్టు అందులో మునిగి పోయి ఉంది తన్నుతాను మరిచి!

"నాన్నా, మా ఆలోచనలకు అందినంతవరకు మీ రూమ్ ఇలా ఏర్పాటు చేశాం. ఒక్కసారి అవన్నీ చూసుకుని ఇంకా ఏమైనా కావాల్సినవి ఉంటే అడ గండి" అన్నాడు సమీర్.

"ఇంకా ఏం కావాలిరా, కావాల్సిన వాటికన్నా అన్నీ ఎక్కువగా ఉన్నాయి" అని పైకి అని, మన సులో "నాన్నా సమీర్, నీ కోసం నేను ఏదో చేయా లనుకున్నాను. కానీ నువ్వే నాకు, మీ అమ్మకు ఎంతో చేస్తున్నావ్", అనుకున్నాడు భావోద్వేగంతో.

"మామయ్యా!, మీరు బుక్స్ బాగా చదువుతా రని సమీర్ చెప్పాడు. అందుకే రామాయణ భార తాలతో పాటు నవలలు, కథల పుస్తకాలు తెలు గువీ, ఇంగ్లీషువీ తెచ్చిపెట్టాను. ఆ క్యాబినెట్‌లో చాలా సీడీలున్నాయి. మీకు ఏది కావాలంటే అది పెట్టుకోండి. ఇంకా ఏమన్నా కావాలంటే అడగండి!" అంది సాధ్వి.

ఆ అభిమానం జయరామ్‌ని ఉక్కిరిబిక్కిరి చేసింది. "అలాగేనమ్మా, చాలా థాంక్స్!" అన్నారు సమాధానంగా. ఆ రాత్రి ఉయ్యాలలా పైకీ కిందకీ కదులుతున్న మెత్తటి పరుపులమీద పడుకుని భార్యవంక చూస్తూ "అహల్యా..! ముసలితనం రెండో బాల్యం అంటారు కదా. ఆ విధంగా మనం మళ్ళీ పిల్లలం అయిపోయామే! అప్పుడు మన పిల్ల వాడికి మనం అమ్మానాన్నలమై అన్నీ సమకూర్చి పెట్టి పెంచి పోషించాం. ఇపుడు వాడు, వాడి భార్య మనకు అమ్మానాన్నలై ఎంచక్కా అన్నీ సమకూర్చి మనల్ని పసిపిల్లల్లా చూస్తూ పోషించబోతున్నారు. కాలం చాలా విచిత్రమైనది కదూ!" అన్నాడు.

అహల్య సమాధానం చెప్పలేదు. ఏదో ఆలో చనల్లో మునిగిపోయి ఉంది. అది తెలియక నిద్ర

పోయిందేమో 'నిద్ర సుఖమెరుగదు అంటారుగానీ నిద్ర కూడా సుఖం మరుగుతుందని తను నిరూపిస్తోంది' అనుకున్నాడు తనలో తను నవ్వుకుంటూ.

●●●

సమీర్, సాధ్వి ఇద్దరూ ఇంటి బడ్జెట్ ప్రణాళిక సిద్ధం చేయడంలో ఒకర్ని మించిన తెలివితేటలు మరొకరివి! అందుకే ఇద్దరూ కలిసి రెండు మేధావి బుర్రలూ ఉపయోగించి ఇద్దరి సంపాదననూ, 'దీనికింత, దానికంత' అంటూ పంపిణీ చేయడం ప్రారంభించారు. అందులో ప్రెజెంట్ ఎక్స్‌పెండీచర్, ఫ్యూచర్ ఎక్స్‌పెండీచర్, సేవింగ్స్, లగ్జరియస్ లైఫ్ స్టైల్ షాపింగ్ వంటి ఎక్స్‌ట్రా ఎక్స్‌పెండేచర్, సోషల్ వర్క్‌కోసం ఛారిటీఫండ్ కూడా చివరగా కేటాయించడంతో ఆ సంవత్సరం బడ్జెట్ తయారైపోతుంది. మధ్యలో వచ్చే అనుకోని ఖర్చులకోసం కొంతడబ్బు వేరుగా పెట్టడం జరుగుతుంది. దాంతో బడ్జెట్ ప్లాన్ పూర్తయిపోతుంది. పెళ్ళై రెండు సంవత్సరాలు అవుతోంది. మరో రెండేళ్ళ తర్వాత బాబుకో, పాపకో జన్మనిచ్చి అమ్మానాన్నలమైపోవాలన్న కోరిక కూడా సమీర్, సాధ్విలో ఉంది. ఎవరైనా ఒక్కరే. ఆ తర్వాత ఫుల్‌స్టాప్' అదీ వాళ్ళ ఫ్యామిలీ ప్లాన్. ప్రతీపనీ ఒక ప్లాన్‌తో సిస్టమాటిక్‌గా ముందుకు సాగే ఆధునిక యుగం యువత మరి వాళ్ళు!

●●●

సమీర్, సాధ్వి ఆఫీస్‌కి వెళ్ళిపోయారు. పొద్దున్న ఏడు గంటలకు బయలుదేరితే మళ్లీ రాత్రి ఏడు గంటలకే వచ్చేది. వారానికి ఐదు రోజులు హెవీ వర్క్. కంప్యూటర్‌మీద నుంచి చూపు పక్కకు తిప్పడానికి కూడా టైమ్ ఉండదు. ఎప్పుడూ ఏవో ప్రాజెక్టు వర్క్‌లూ, గ్రూప్ డిస్కషన్లే. వర్క్ ప్రెజెంటేషన్లే. ఇవిగాక మీటింగ్‌లూ, కాన్ఫరెన్స్‌లూ...! కుర్చీకి అంకితమైపోయి మేధను పనిమీద లగ్నం చేయాలి. ఎవరు ఎంత బాగా వర్క్ చేస్తే, ఎంత మంచి ఫలితాలు తేగలిగితే వాళ్ళకే మంచి కెరీర్. బెస్ట్ ఫ్యూచర్! లేకుంటే వెనకబడితే వెనకే అన్నట్టు ఉంటుంది. పరుగుపందెం లాంటి ఆ జాబ్‌లో ఎప్పుడూ పోటీయే! శక్తిసామర్థ్యాలన్నీ ప్రదర్శిస్తూ అలా

**వాళ్ళిద్దరూ సాఫ్ట్‌వేర్ ఇంజనీర్లే! ప్రేమించి పెళ్ళి చేసుకున్నారు. లక్షల్లో జీతం, పక్కా ప్లానింగ్, కాలానుగుణంగా పథం, పథకం మార్చుకోవడమే వారి లక్ష్యం. ఖరీదైనకారూ, సకల సదుపాయాల ఇల్లూ సమకూర్చుకున్నారు. తల్లిదండ్రులు గర్వంగా ఫీలయ్యారు. అంతా ఓకే. కానీ ఓసారి కొడుకు తీరుచూసి ఆలోచనలో పడ్డాడు తండ్రి. సందేహం వచ్చి ప్రశ్నించాడు. ఇంతకీ ఆ తండ్రి ఏమని ప్రశ్నించాడు? కొడుకు ఏం సమాధానమిచ్చాడు?**

ఎప్పుడూ పరుగెడుతూనే ఉండాలి. లేకుంటే వెనక ఉన్నవాడు స్పీడ్‌గావచ్చి మనల్ని వెనక్కు తోస్తూ తను ముందుకు పరుగెడతాడు. సాఫ్ట్‌వేర్ రంగంలో కెరీర్ అంటే అంతే. ఎప్పుడూ అప్‌డేట్‌గా ఉండాలి. సాఫ్ట్‌వేర్ ఇంజనీర్లు తమ లక్ష్యాలు, గమ్యాలు, తమ వర్క్ పథాన్ని, పథకాల్ని ఎప్పటికప్పుడు మారుతున్న, ఎదుగుతున్న సాంకేతికతకు అనుగుణంగా మలుచుకోవాల్సి వస్తుంది. పొద్దుటినుండీ సాయంత్రం వరకు కుర్చీలో కూర్చుని నడుములు పడిపోతాయి.

కంప్యూటర్ స్క్రీన్‌మీద దృష్టి అదేపనిగా కేంద్రీకరించడం వల్ల కళ్ళు మసకబారిపోతాయి. ఇంటికి వచ్చి మంచం మీదకు చేరేసరికి టోటల్‌గా బాడీ అంతా అలిసిపోతుంది. అందుకే వాళ్ళకు వీకెండ్స్ లోనే ఆటవిడుపు. ఆ రెండు రోజులూ ఔటింగ్స్‌తో పార్టీలతో ఎంజాయ్‌చేసి శరీరాన్ని, మనసును ఉల్లాసపరిచి ఉత్సాహం నింపితేగానీ, మళ్లీ సోమవారం నుంచీ చేయబోయే ఐదు రోజుల కఠిన శ్రమకు శరీరం రీఫ్రెష్ కాదు.

రాత్రి తొందరగా పడుకుని పొద్దున్నే మళ్లీ తొందరగా ఐదు గంటలకే లేస్తుంది సాధ్వి. ఆమెతో పాటే సమీర్ కూడా లేస్తాడు. ఇద్దరూ కలిసి చకచకా ఇంటి పనులు చేసుకుంటారు. సాధ్వి వంటకు ఉపక్రమిస్తే సమీర్ కూరలు తరిగి ఇస్తాడు. ఇద్దరికీ టిఫిన్ బాక్సులు, వాటర్ బాటిల్సూ సిద్ధం చేస్తాడు. తల్లిదండ్రుల కోసం డైనింగ్ టేబుల్‌మీద హాట్ ప్యాక్‌లో కూరలు, అన్నం సిద్ధంచేసి ఉంచుతాడు. వచ్చిన కొత్తల్లో అహల్య అదంతాచూసి బుగ్గలు నొక్కుకునేది. మగవాళ్ళు అలా వంటింట్లో దూరి పనులు చేయడం తను ఎప్పుడూ చూడలేదు. అలా తనూ చేయించలేదు గనుక మనసంతా అదోలా అయ్యేది. ఆ రోజు మాత్రం మోకాళ్ళు, చీలమండలు సహకరించకపోయినా, అలాగే ఈడ్చుకుంటూ వచ్చి "అదేమిటిరా, నువ్వు ఆ పనులు చేస్తున్నావ్.. నేను సాధ్వికి సహాయం చేస్తాను కదా!" అంది. "అమ్మా! చేసినన్నాళ్ళు నువ్వు చేశావు. ఇక రెస్ట్ తీసుకో. ఇప్పుడు చెయ్యాలని నీకున్నా నీ శరీరం సహకరించదు, నువ్వెళ్ళు" అని తల్లికి మర్యాదగా చెప్పి పంపించాడు సమీర్. తల్లీ కొడుకుల సంభాషణవిని తనలో తను నవ్వుకుంది సాధ్వి. ఏదో కొంపలు మునిగిపోతున్నట్టు కుంటుతూనే వేగంగా తన రూమ్‌లోకి వెళ్ళిన అహల్య భర్తను ఉద్దేశించి "చూశారా? మన సమీర్ మగవాడై ఉండీ ఆడవాళ్ళ పనులు వంటింట్లో దూరి ఎలా చేస్తున్నాడో.. నాకెలాగో అనిపించింది. నేను చేస్తానంటే వద్దంటున్నాడు" అంది.

"అహల్యా.. వాళ్ళిద్దరూ వర్కింగ్ కపుల్స్! మారిన కాలానికి అనుగుణంగా అండర్‌స్టాండింగ్‌తో వాళ్ళ పద్ధతిలో వాళ్ళు రోజును ప్లాన్ చేసుకుంటూ ముందుకు వెళుతున్నారు. మధ్యలో ఇప్పుడు నువ్వు దూరి నీ పాత పద్ధతులు, ఆలోచనా విధానంతో వాళ్ళ బుర్రలు తినకు!" అన్నాడు జయరామ్. "ఏం ప్లానులో ఏంటో, ఒక మాటా లేదు, ముచ్చటా లేదు. రోజంతా ఆఫీసులోనే సరిపోతుందా! ఇంటికొచ్చాక అయినా కనీసం వాళ్ళిద్దరూ మాట్లాడుకుంటున్నట్టే కనబడదు. మూతులు బిగించుకుని తలలు వంచుకుని పనిచేసుకోవడం, అంతే! కాస్తంత తీరిక దొరికిందంటే కోడలు ఆ ల్యాప్‌టాప్ ఒళ్ళో పెట్టుకుని చేతివేళ్ళు చకచకా కదిలిస్తూ అందులో ఏంటో చూస్తూ ఉంటుంది. ఏం ఉంటుందండీ అందులో?"

ఆ మాటలకు జయరామ్ నవ్వుతూ "అందులోనా, ప్రపంచం అంతా ఉంటుంది. 'ఇది లేదు, అది లేదు' అన్న మాటే ఉండదు! కోడలు సాధ్వి ఆ ల్యాప్‌టాప్‌లోనే సమస్త వస్తు సమాచారం సేకరిస్తుంది. అందులో వంటలు, పిండి వంటలు, పిల్లలు, వృద్ధులపట్ల తీసుకోవాల్సిన జాగ్రత్తలు, మార్కెట్‌లోకి ఏయే కొత్త ఫర్నీచర్, గాడ్జెట్స్ వచ్చాయో తెలుసుకోవడం, ఆన్‌లైన్ షాపింగ్ చేయడం, అన్ని బిల్లులూ పే చేయడం వంటి పనులన్నీ హాయిగా ఇంట్లో సోఫాలో కూర్చునే చేసుకోవచ్చు. మొన్న ఒకరోజు రాత్రి నేను 'ఈ రోజు నాకు తినటానికి ఏమీ పెట్టొద్దమ్మా. మధ్నాహ్నం తిన్నదే అరగలేదు' అన్నాను కదా, వెంటనే ఆ ల్యాప్‌టాప్ ఆన్‌చేసి తేలికగా అరిగే ఆహారం ఏమిటో, ఓల్డేజ్ వాళ్ళకు ఏం ఫుడ్ పెట్టాలో అందులో చూసింది. అప్పటినుంచీ అన్నం తగ్గించి పుల్కాలు హాట్‌ప్యాక్‌లో పెడుతోంది. దుంప కూరలు చేయకుండా ఆకుకూరలు చేస్తోంది. పెరుగు బదులు మజ్జిగ టేబుల్‌మీద పెడుతోంది. రెండు రోజులనుంచీ నీకైతే ఎలా ఉందోగానీ నాకైతే హాయిగా

కవిత

## నిప్పు రాజేసిన నీళ్లు!!

గతాన్ని
అనుభవాల
గడ్డపారతో
గుద్దుతుంటే
కాలమనే బలిపీఠం
దద్దరిల్లింది
కలి, కాలమనే
ఉరుము ఉరిమి
జీవితంలో
'జీవి' అనే మొక్కను
నాశనం చేసింది.
కన్నీళ్లకు కరిగిన
రాళ్లే
నిప్పును రాజేసిన
నీళ్లు
కడగండ్ల వానకు తడిసి
ముద్ద అయిన తనువు
నివురు కప్పిన నిప్పులా
జ్వలిస్తూనే ఉంది.

-మొవ్వ రామకృష్ణ
సెల్: 98490 06421

ఉంది!" అన్నాడు జయరామ్.

"నాకు గూడా పొట్ట బరువుగా ఉండకుండా తేలిగ్గా ఉంటోంది!" అంది అహల్య పొట్టపట్టుకుంటూ.

"చూశావా? మన కోడలు సాధ్వి చదువుకున్న అమ్మాయి గనుక చాలా తెలివిగా పనులు చక్క బెడుతోంది."

"అది నిజమేగానీ శని, ఆది వారాలు వస్తే మాత్రం ఇద్దరూ ఇంట్లో కనబడేదే తక్కువ! షాపింగ్, పార్టీలు, హోటళ్ళు అంటూ అస్తమానం బయట తిరుగుతూనే ఉంటారు. నా అనుమానం ఏమిటంటే క్లబ్బులకు, పబ్బులకు కూడా వెళుతున్నారేమోనని!"

"హద్దుల్లో ఉన్నంత వరకు జీవితాన్ని ఎలా అయినా ఎంజాయ్ చేయొచ్చు. వాళ్ళు ఈ మోడ్రన్ జనరేషన్ వాళ్ళు! ఈ కాలానికి తగ్గ సరదాలు, కోరికలు వాళ్ళు తీర్చుకుంటుంటే తప్పేముందీ? వారంలో ఐదు రోజులు ఊపిరి సలపని పనులు వాళ్ళకు! వారాంతపు సెలవుల్లో అందుకే కాస్త రిలాక్స్ అవుతారు, ఆ విధంగా. లేకుంటే జీవితంలో ఆనందం, చురుకుదనం లేకుండా ఘనీభవించిపోతుంది. శారీరకంగా, మానసికంగా కూడా యువతకు అకాల వృద్ధాప్యం వచ్చేస్తుంది. అవునూ, చురుకుదనం అంటే గుర్తొచ్చింది. కోడలు ఎంత యాక్టివ్‌గా నిముషాల్లో పనులు చకచకా చేసేసుకుంటోందో చూశావా? ముచ్చటేస్తుంది చూస్తుంటే...!" భార్య ముఖంవంక చూస్తూ ప్రశంసాపూర్వకంగా అన్నాడు జయరామ్.

"నిజమేగానీ ఆ డ్రస్సులే... లూజ్‌గా ఉండే మెత్తటి కాటన్ పైజామాలు, షర్టులు వేస్తుంది. ముఖాన బొట్టూ, చేతికి గాజులూ ఉండవు. పుస్తెలతాడు కూడా తీసి డ్రెస్సింగ్ టేబుల్ అరలో పెడుతుంది. ఆఫీసుకు వెళ్ళేటప్పుడు వేసుకుంటుంది అంతే. జీన్స్ పాంట్లూ, టీషర్టూ వేసుకుంటుంది' ఎంచక్కా చీర కట్టుకుని వెళ్ళొచ్చు కదమ్మా' అని చెబుదామని అనుకుంటాను గానీ మళ్ళీ నా కెందుకులే అని ఊరుకుంటాను."

"మంచి పని చేస్తున్నావ్. అలాగే ఉండు. పొరపాటున కూడా వాళ్ళ జీవన విధానంలో తల దూర్చకు. వాళ్ళ లైఫ్‌స్టైల్ వాళ్ళది' అనుకుని వాళ్ళ స్వేచ్ఛకు ఆటంకం కలిగించకుండా ఉండు! వీలైతే కనీసం నీ ఆలోచనల్ని, ఊహలనైనా నీ పరిధి లోంచి బైటకుతెచ్చి మోడ్రన్ సొసైటీని చూసి ఆనందించు! మనం మారలేకపోవచ్చుగానీ, కనీసం మారిన సొసైటీని అందులో ఫాస్ట్‌గా దూసుకెళుతున్న యువతరాన్నిచూసి ఆనందించగలం కదా! ప్రయత్నం చెయ్యి!" అన్నాడు జయరామ్ భార్య కళ్ళల్లోకి సూటిగా చూస్తూ. ఆ మాటలు కొత్తగా అనిపించాయి అహల్యకు.

●●●

"ఏమండీ! మీకీ విషయం తెలుసా?" అంటూ పేపర్ చదువుతూ వాలుకుర్చీలో కూర్చున్న భర్త జయరామ్‌ని ఉద్దేశించి అంది అహల్య. 'మళ్ళీ ఏదో వార్త మోసుకొచ్చినట్టుంది న్యూస్ ఛానల్! అక్కడి నుంచి ఇక్కడికి వార్తలు మోయటమే తన పని!' అని మనసులో అనుకుని భార్య వంక చూస్తూ 'ఏ విషయం?' అని అడిగాడు.

"మన కొడుకు జీతం కన్నా కోడలు జీతం ఎక్కువట. వాళ్ళు మాట్లాడుకుంటుంటే విన్నాను!"

"అయితే ఏంటట? అందులో అంతగా ఆశ్చర్య పోవాల్సింది ఏముంది?"

"అయ్యో కొడుకులిద్దరూ ఒకేరకం. వాడికీ అంతే, చీమ కుట్టినట్టుగా కూడా లేనట్టు కనబడింది వాడి మాటల్లో" "అహల్యా, పాత ఆలోచనా విధానానికి స్వస్తిచెప్పి కొత్తగా ఆలోచించడం అలవాటు చేసుకోమని చెప్పానా? లేదా?' ఆడవాళ్ళ కన్నా మగవాళ్ళు ఎక్కువ అని అనుకుంటూ ఉండటం వల్లనే ఈ విషయం నీకు అంత ఆశ్చర్యం కలిగించేదిగా ఉంది. 'ఇద్దరూ ఒకటే' అనుకో, అప్పుడు నీ మనసు ఇలా ఆలోచించడం మానేస్తుంది!" అన్నాడు జయరామ్.

"నేను ఏం మాట్లాడినా మీరు విమర్శిస్తూనే ఉంటారు. నేను అనే ఒక్కముక్కకు పెద్ద చాట భారతం చదువుతారు" అంది చేతులు తిప్పుతూ అహల్య.

"నువ్వు పనికొచ్చే మాటలు మాట్లాడితే ఎందుకంటాను?"

"రేపటి నుంచీ వాళ్ళిద్దరూ యోగా క్లాసులకు వెళతారట. ఆఫీసులో గంటల తరబడి కూర్చుని కూర్చుని వ్యాయామం లేకపోవటం వల్లనే బరువు పెరుగుతున్నారట!"

"గుడ్!"

"ఎప్పుడెళతారూ. పొద్దున్న లేచింది మొదలు ఉరుకులూ పరుగులేనాయె. టైమ్ ఎక్కడ దొరుకుతుందీ?"

"మనసుంటే మార్గం ఉంటుందిలే. ఈ కాలం కుర్రవాళ్ళు అందరూ యోగా గురించి బాగా స్టడీ చేసి ఇప్పుడు ఆ బాట పడుతున్నారు"

"ఇంకో విషయం తెలుసా మీకు. కోడలు చూడటానికి అంత మోడ్రన్‌గా ఉంటుందా, రకరకా ఇంగ్లీషు మాట్లాడుతుందా...?"

"నీతోనా?"

"నాతో కాదు. నాతో తెలుగులోనే మాట్లాడుతుంది. అయినా నాకు ఇంగ్లీషు ఏం వచ్చనీ.... నా మొహం! వాళ్ళు ఇద్దరూ మాట్లాడుకుంటుంటే వింటాను. నాకు అర్థం కాకపోయినా వినటానికి బాగుంటుంది...!"

"ఇంతకూ నువ్వు చెప్పాలనుకున్న వార్త ఏమిటి?"

"ఆ.... ప్రతి శనివారం కోడలు గుడికి వెళుతుందట. ఈ వీధిలోనే వెంకటేశ్వరస్వామి గుడి ఉందట కదా! నేను నడవలేనని నన్ను రమ్మనటం లేదట! అన్నిటికన్నా విచిత్రమైన విషయం ఏమిటంటే మన అబ్బాయి కూడా కోడలితో గుడికి వెళతాడట!"

## కూతురి ప్రేమకు తండ్రి డైరెక్షన్

*నిజజీవితంలో కాదులెండి. తెర మీద! సినిమాల్లో తండ్రి దర్శకత్వంలో నటించే కూతుళ్ల సంఖ్య తక్కువే! కానీ అర్జున్ మాత్రం తన కూతురు ఐశ్వర్యను డైరెక్ట్ చేయబోతున్నాడు. ఐశ్వర్య కోలీవుడ్‌లో గ్రాండ్‌గా ఎంట్రీ ఇచ్చినా వర్కవుట్ కాలేదు. దాంతో ఇతర దర్శకుల చేతుల్లో తన కూతురును పెట్టడంకన్నా తనే డైరెక్ట్ చేసి ఆమెకు లైఫ్ ఇవ్వాలని డిసైడయ్యాడట! అదీ ఓ మంచి ప్రేమ కథతో. ఇలా కూతురు ప్రేమను తండ్రి డైరెక్ట్ చేయబోతున్నాడన్న మాట! కూటి కోసం కోటి కష్టాలు అన్నట్టు, కూతురి కోసం తండ్రి కష్టాలు పడుతున్నాడన్నమాట!*



“ఈ కాలం యువత గురించి నువ్వు అసలు కన్నా అధికంగా ఏదేదో ఊహించుకుంటూ ఉండటం వల్లనే వాళ్ళు చేసే ప్రతిపనీ ఇలా నీకు ఆశ్చర్యం కలిగిస్తోంది. నీ వ్యతిరేక ఆలోచనలు మానేయ్. కంప్యూటర్ల ముందు కూర్చుని పనిచేస్తున్నంత మాత్రాన వాళ్ళేం యంత్రాలు కాదు. మనసున్న మనుషులు. వాళ్ళకూ అనుభూతులు, అనుబంధాలు, స్పందనలు, నమ్మకాలు ఉంటాయి” అన్నాడు జయరామ్.

“నిజమే సుమా! అన్నట్టు హావభావాలు వెలిబుచ్చింది అహల్య. అవతలికి వెళ్ళబోతున్న భార్యను ఉద్దేశించి ‘ఈ రోజుకు వార్తలు అయిపోయినట్టేనా, సమాప్తమేనా?’ అన్నాడు నవ్వుతూ.

“సమీర్ రేపటినుంచి పది రోజులు ఆఫీసుకు వెళ్ళడట. ఇంట్లోనే ఉండి అదేంటో ఆ...! వర్క్ ఫ్రమ్ హోమ్ చేస్తాడట...!”

“అలా అని నీకు ఎవరు చెప్పారూ?”

“కోడలు చెప్పింది...!”

“అలానా...?!” అంటూ పేపరువైపు దృష్టి మళ్ళించాడు జయరామ్. అహల్య టీవీ ఆన్ చేసుకుని చూస్తూ కూర్చుంది. భార్య చెప్పినట్టుగానే కొడుకు సమీర్ ఆఫీస్‌కు వెళ్ళకుండా ఇంట్లోనే ఉండటం, అస్తమానం ల్యాప్‌టాప్ ముందు పెట్టుకుని మునివేళ్ళతో కీ బోర్డు టచ్ చేస్తూ గంటల తరబడి ఏదో పని చేసుకుంటూ ఉండటంచూసి జయరామ్ మనసులో ఏవేవో సందేహాలు మెదిలాయి. ఒక్కోసారి కాన్ఫరెన్స్ ఉంది అంటూ ‘తననెవరూ డిస్టర్బ్ చేయొద్దు’ అంటూ తలుపు మూసుకుని తన గదిలో గంటా రెండు గంటలు ఉండిపోవడం కూడా ఆయనను ఆలోచనలో పడవేసింది. ఒకసారి మధ్య హాల్లో సోఫాలో కూర్చుని పని చేసుకుంటూ ఏదో ఫోన్ రావడంతో, ఉన్నట్టుండి ల్యాప్‌టాప్ పక్కనపెట్టి బైట బాల్కనీలోకి వెళ్ళిన సమయంలో జయరామ్ ఒక్కసారి స్క్రీన్‌మీదకు తొంగి చూశాడు. విషయం అర్థమైంది. ఆ సాయంత్రం ‘ఉట్టినే అలా బైటకు వెళ్ళొస్తాను రిలాక్స్ కోసం...!’ అంటూ కారు తీస్తున్న కొడుకుతో “నేనూ రానా!” అని అడిగాడు జయరామ్.

“రండి” అన్నాడు సమీర్.




చల్లటి గాలిలో కారు దూసుకుపోతుంటే హాయిగా అనిపించింది ఇద్దరికీ. రోడ్డుమీద పరుగెడుతున్న వాహనాలు, నడుస్తున్న పాదచారులు, రోడ్డుపక్కన పెద్ద పెద్ద షాపులూ, చిన్నచిన్న బడ్డీకొట్లూ చూస్తూ ఆనందిస్తున్నాడు జయరామ్. నాలుగు గోడల మధ్య నిశ్శబ్దం నుంచి అంత జనసమ్మర్థం మధ్యలోకి వచ్చేసరికి అకస్మాత్తుగా ఏదో ఉత్సాహం మనసులో వచ్చి చేరినట్టు అనిపించింది.

“నాన్నా...మీ ఆరోగ్యం ఎలా ఉంటోంది? ఒకసారి మీరు, అమ్మ కంప్లీట్ హెల్త్ చెకప్ చేయించుకోవాలి. రేపు తీసుకెళ్తాను, వస్తారా? ఇప్పుడు కొంచెం ఫ్రీగా కూడా ఉన్నాను” అన్నాడు సమీర్.

“హెల్త్ బాగానే ఉంది. చెకప్ సంగతి తరువాత చూద్దాం గానీ ఒక్క విషయం అడుగుతాను. సమాధానం చెప్పు. నీ జాబ్‌లో ఏదైనా ప్రోబ్లమ్ వచ్చిందా?”

విషయం తండ్రికి తెలిసిపోయిందని గమనించిన సమీర్ “అవును నాన్నా! ప్రాజెక్టులు ఒకదాని తర్వాత ఒకటిగా ఇన్ని సంవత్సరాలుగా చేస్తున్నవి అయిపోయాయి. స్టాఫ్ ఎక్కువయ్యారు. వర్క్ తక్కువైంది. దాంతో మేనేజ్‌మెంట్ వల్ల స్ట్రెస్, ప్రోబ్లమ్స్ ఎక్కువైపోయాయి. అందుకే ఆ జాబ్ వదిలేశాను.”

“ఇప్పుడు వేరేరకంగా స్ట్రెస్, ప్రోబ్లమ్ కదా?”

“అస్సలు లేదు. చాలా ఫ్రీగా ఉన్నాను. వేరే జాబ్‌కు అప్లయిచేసి ఆన్‌లైన్ ఇంటర్వ్యూలకు అటెండ్ అవుతున్నాను. మీకు చెబితే టెన్షన్ పడతారని చెప్పలేదు అంతే. నేను మాత్రం ఎలాంటి టెన్షనూ పడటంలేదు. ఎందుకంటే ఐ యామ్ వెరీ వెరీ మచ్ కాన్ఫిడెంట్. తెలివితేటలు, టాలెంట్ ఉన్నవాళ్ళకు ఏ కంపెనీ అయినా పిలిచి జాబ్ ఇస్తుందని నాకు తెలుసు. ఆల్రెడీ రెండు కంపెనీలు నాకు ఇంతకన్నా మంచి ఉద్యోగాలు ఆఫర్ చేశాయి. అయినా వాటికన్నా ఇంకా బెస్ట్ కోసం ట్రై చేస్తున్నాను. కాదు వెయిట్ చేస్తున్నాను. అంతే” అన్నాడు సమీర్ నవ్వుతూ.

ఆత్మవిశ్వాసంతో కూడిన ఆ నవ్వు చూస్తుంటే ముచ్చటేసింది జయరామ్‌కు. తన ఆలోచనా విధానానికీ, తన కొడుకు ఆలోచనా విధానానికీ ఉన్న వ్యత్యాసం చూసి కొడుకు ముందు చిన్న పిల్లాడిలా ఫీలయ్యాడు. సమీర్ కెరీర్ ప్రారంభ దశలో ఒకసారి జయరామ్ అలాంటి ఫీలింగ్‌కే గురైన సంఘటన గుర్తొచ్చింది. సమీర్ డిగ్రీ పాసైన కొత్తలో పేపర్‌లో ప్రకటన పడిన ప్రతి కాంపిటీటివ్ ఎగ్జామ్‌రాసి ప్రతి ఇంటర్వ్యూకూ అటెండ్ అయ్యేవాడు. ఒకసారి ఒక నేషనలైజ్డ్ బ్యాంక్‌లో జాబ్ వచ్చింది కూడా! “ఎప్పుడు జాయిన్ కావాలి?” అని తండ్రి అడిగిన ప్రశ్నకు సమీర్ ఆశ్చర్యపోతూ ‘నేను ఆ జాబ్‌లో జాయిన్ అవడం ఏమిటి? ఏదో సరదాకి ఎక్స్‌పీరియన్స్ కోసం ఎగ్జామ్ రాశాను. ఖాళీగానే ఉన్నాను కదా అని ఇంటర్వ్యూకి వెళ్ళాను అంతే. నా లక్ష్యం ఇది కాదు, నా గోల్ వేరే ఉంది” అన్నాడు. ఈసారి ఆశ్చర్యపోవటం జయరామ్ వంతైంది. ‘అదేంటీ, ఉద్యోగాలు దొరకని వాళ్ళు లేదని బాధపడుతుంటే, వచ్చిన ఉద్యోగం వదులుకుంటావా? ఆ తర్వాత పశ్చాత్తాపపడాల్సి వస్తుందేమో ఆలోచించుకో’ అని కొడుకును హెచ్చరించాడు.

‘నెవర్’ అన్నాడు సమీర్ కాన్ఫిడెంట్‌గా.

‘పోనీ వేరే మంచిజాబ్ దొరికేదాకా ఇది చెయ్యొచ్చుగా?’ అన్నాడు జయరామ్.

‘అప్పుడు దాంతో కెరీర్ ఆగిపోతుంది నాన్నా. అందులోనే పడి కొట్టుకుంటూ ఆ తరువాత ముందుకు వెళ్ళలేను. నేనింకా హయ్యర్ స్టడీస్ చదవాలి. పెద్ద మల్టీనేషనల్ కంపెనీలో సాఫ్ట్‌వేర్ ఇంజనీర్‌గా చేరాలి. నా టెక్నాలజీ పరిజ్ఞానంతో కంపెనీకి అద్భుతాలు చేసి చూపించాలి. సాంకేతికతలో మన దేశాన్ని ముందుకు పైపైకి తీసుకెళ్ళడంలో నా పాత్ర నేను పరిపూర్ణంగా పోషించాలి’ అన్నాడు. ఆ మాటలు విని ఆశ్చర్యపోవడమే కాదు, తను కెరీర్ విషయంలో దొరికిన దాంతో సంతోషపడి జీవితమంతా సాదా ఉద్యోగం, గొర్రె తోక జీతంతోనే గడిచిపోవటాన్ని జయరామ్ గుర్తుచేసుకున్నాడు. కారణం కూడా అవగతం చేసుకున్నాడు. ఇన్నేళ్ళ తర్వాత మళ్ళీ ఇప్పుడు అనుకోకుండా అలాంటి సందర్భమే ఎదురైంది. అదే ఆయన్ను విశ్లేషణలో పడేసింది. ‘కాల మహిమో, మారుతున్న జీవన విధానం కారణంగానో ఏమో గానీ ఈ తరం యువత ఆశలలో, ఆశయాలలో, జీవన లక్ష్యాలలో రాకెట్‌లా ముందుకు దూసుకుపోతోంది. ఎన్ని అవరోధాలు, లోపాలు ఎదురైనా అదరక, బెదరక వాటిని అడ్డుకుంటూ సవరించుకుంటూ అధికశ్రమతో అనుకున్నది సాధిస్తోంది. వాళ్ళకు శ్రమ శ్రమలా అనిపించడం లేదు. ఎలాంటి స్ట్రెస్‌కీ, నిరాశకూ లోనుకావడం లేదు. ధైర్యం, ఆత్మవిశ్వాసం, ఆఖండమైన తెలివితేటలు, టెక్నాలజీ ఉపయోగం ఆయుధాలుగా అవలీలగా జీవన పోరాటం సాగిస్తూ విజయాలు స్వంతం చేసుకుంటోంది. ‘పాత’ను పునాదిగా చేసుకుని ‘కొత్త’ ప్రయోగాలు చేస్తూ సరికొత్త సమాజాన్ని సృష్టించబోతోంది’ అనుకుంటూ ఉండగా, “ఏంటి నాన్నా మాట్లాడరేం?” అన్నాడు సమీర్. “గో ఎహెడ్...! ‘శభాష్’ అంటూ కొడుకు భుజం తట్టాడు జయరామ్.

*సెల్: 98492 12448*




## నడుంనొప్పితో అశాంతి!



ఇది చాలామందిలో తరచూ కనిపిస్తూ ఉంటుంది. నడుంనొప్పి వచ్చిన సమయంలోనూ, అది తగ్గే క్రమంలోనూ చికాకు, అశాంతి ఎక్కువగా ఉంటాయి. ఇదే విషయం మీద లండన్ పరిశోధకులు ఓ అధ్యయనం నిర్వహించారు. సుమారు రెండువేల మంది మహిళల మీద వీరు అధ్యయనం నిర్వహించారు. వీరిలో చాలా మంది నడుం నొప్పితో బాధపడుతున్న వారే! నడుంనొప్పి వచ్చిన సమయంలోనూ, తగ్గిన సమయంలోనూ వీరిలో కలిగే మార్పులను గమనించారు. నడుంనొప్పి ఉన్నప్పుడు, తగ్గిన తరువాత కూడా వీరిలో అశాంతి, చికాకు, ఒత్తిడి, ఆందోళనలలో ఏదో ఒక సమస్యను గుర్తించారు. అయితే మానసిక అశాంతికి నడుంనొప్పే కారణమా? అన్నదాన్ని మాత్రం వీరు స్పష్టం చేయలేక పోతున్నారు. దీని మీద ఇంకా పరిశోధనలు నిర్వహిస్తున్నారు.

## ఎక్కువసేపు కూర్చుంటే వృద్ధాప్యం?

పది గంటల కంటే ఎక్కువగా ఒకేచోట కదలకుండా కూర్చునే మహిళ శరీర కణాలు జీవపరంగా ఎనిమిది సంవత్సరాలు ముందుగా వృద్ధాప్య ఛాయలకు లోనవుతున్నట్టు ఇటీవల నిర్వహించిన పరిశోధనలో వెల్లడైంది. కదలకుండా ఎక్కువ సేపు కూర్చునే స్త్రీల డీఎన్ఏ పోచల చివరన ఉండే టెలోమేర్స్ పొడవు తగ్గుతున్న విషయాన్ని వీరు గుర్తించారు. వీటి పొడవు తగ్గడం అంటే వృద్ధాప్యానికి చేరువ కావడమేనని వారు చెబుతున్నారు. ఊబకాయం, మధుమేహం వంటి అనారోగ్య సమస్యల వలన కూడా టెలోమేర్స్ పొడవు క్రమేపీ తగ్గుతుందని వీరు అంటున్నారు. ఇలాంటి వారు రోజుకు 40 నిమిషాలు క్రమం తప్పకుండా వ్యాయామం చేసినా పెద్దగా ఫలితం ఉండకపోవచ్చని అభిప్రాయపడుతున్నారు. టెలోమేర్స్ పొడవు తగ్గడం వలన గుండెజబ్బులు, కేన్సర్ వచ్చే ప్రమాదం కూడా పొంచి వుందని వీరు హెచ్చరిస్తున్నారు. అందుకే స్త్రీలు ఎక్కువసేపు ఒకేచోట కూర్చోకుండా మధ్య మధ్యలో అటూ ఇటూ నడవడమే కాకుండా రోజుకి కనీసం ఓ గంటపాటు వ్యాయామం చేస్తే టెలోమేర్స్ పొడవు తగ్గే ప్రమాదం నుంచి కొంత వరకూ బయటపడవచ్చని వీరు సూచిస్తున్నారు.



## క్యాలరీలు తగ్గిస్తే రోగాలు పరార్!





అవసరానికి మించి ఆహారం తీసుకోవడం వలనే పలు ఆరోగ్యసమస్యలు తలెత్తుతాయన్న విషయం తెలిసిందే! వీటి నుంచి తప్పించుకోవడానికి కచ్చితమైన ఆహార నియమాలు పాటించాల్సిన అవసరం లేదంటున్నారు పరిశోధకులు. రోజూ తీసుకునే క్యాలరీలలో 30% తగ్గించి తీసుకుంటే మధుమేహం, గుండెజబ్బులు తదితర సమస్యల నుంచి 40% వరకూ తప్పించుకోవచ్చంటున్నారు. ఇదే విషయం మీద రీసెస్ మకాకు జాతికి చెందిన కోతుల మీద పరిశోధనలు నిర్వహించారు. వీటికి రోజూ అందించే క్యాలరీలకన్నా 30% తగ్గించి ఇచ్చారు. కొన్నిరోజుల అనంతరం వీటి ఆరోగ్యాన్ని పరిశీలించారు. కోతుల్లో అంతకు ముందు కనిపించిన పలు సమస్యలు దూరం కావడాన్ని గుర్తించడమే కాక కోతుల జీవితకాలం ఆరు సంవత్సరాలు పెరిగిన విషయం గమనించారు. వీటి జీవితకాలానికి, మనుషుల జీవితకాలానికి దగ్గర పోలికలు ఉంటాయనీ, అందుకే వీటి మీద పరిశోధనలు నిర్వహించినట్టు వారు చెబుతున్నారు. మనుషుల్లో జీవితకాలం అంతగా పెరగకపోయినా మూడునుంచి నాలుగు సంవత్సరాలు పెరిగే అవకాశం ఉందని వీరు స్పష్టం చేస్తున్నారు. దీని మీద ఇంకా పరిశోధనలు నిర్వహించాల్సి ఉందంటున్నారు.

## హ్యాండ్‌బ్యాగ్‌తో తలనొప్పి!

రోజూ వారీ కార్యక్రమాల కోసం వెంట తీసుకెళ్ళే హ్యాండ్‌బ్యాగుతో తలనొప్పి తప్పదని నిపుణులు సూచిస్తున్నారు. దీనికి కారణాలను కూడా వారు విశ్లేషిస్తున్నారు. హ్యాండ్‌బ్యాగ్‌లో అవసరానికి మించిన వస్తువులను తీసుకెళ్ళడం వల్ల భుజం, మెడతో పాటు తలనొప్పి వచ్చే అవకాశాలు ఎక్కువని వీరు అంటున్నారు. చాలా మంది రోజు మొత్తంలో ఏదో ఒక సమయంలో తలనొప్పికి లోనవుతున్నారు. దీనికి ఒత్తిడి, వాతావరణంలోని మార్పులు వంటివి కారణమని భావిస్తారు కానీ వారి హ్యాండ్‌బ్యాగే దానికి కారణమన్నది వీరు గుర్తించరనీ, అలాగే హ్యాండ్‌బ్యాగ్ ఎక్కువసేపు ఒకవైపే ఉంచుకోకుండా రెండు చేతుల్లోనూ మార్చిమార్చి తీసుకెళితే సమస్య నుంచి కొంతవరకూ తప్పించుకోవచ్చని వీరు చెబుతున్నారు. ఇంతే కాకుండా హ్యాండ్‌బ్యాగ్‌లో అవసరానికి మించిన వస్తువులను తీసుకెళ్ళకుండా ఉంటే ఈ తలనొప్పి నుంచి కొంతవరకూ తప్పించుకోవచ్చని సూచిస్తున్నారు.



-అవినాష్





# మలివయసులో తోడుగా..

**చిన్ననాటి నుంచి బిడ్డల ఆలనాపాలనా చూసి తీరా మలివయసుకు చేరుకునేసరికి అదేబిడ్డల చేతుల్లో చీత్కారాలు ఎదుర్కొనే ముసలివారు మనచుట్టూ చాలామందే ఉన్నారు. అంతేకాదు మరి కొందరు బిడ్డలైతే తల్లితండ్రులను ఏకంగా బతికుండగానే బస్టాండ్‌లో వదిలేస్తూ ఉంటారు. ఇలాంటి బాధకలిగించే ఘటనలు మన సమాజంలో కోకొల్లలు. ఇక మరికొందరేమో తల్లిదండ్రులను కంటికి రెప్పలా కాచుకుని ఉంటారు. అయితే వృద్ధాప్యంలో మీకు కావల్సిందేమిటి అని మలి వయసు వారిని పలకరిస్తే వచ్చే సమాధానం మాత్రం సమయానికి నాలుగు మెతుకులు పెట్టి కాస్త ప్రేమగా పలకరిస్తే చాలు అని. అదీ నిజమేగా, ఆ వయసులో వారిని అంతకన్నా ఆనందపరిచే అంశం మరోటి ఉండదు కదా!**

మరి అలాంటి చిన్న చిన్న కోరికలకే సంతృప్తి పడే మన ఇంటి పెద్దలను జాగ్రత్తగా కాపాడుకోవాలంటే కేవలం ప్రేమ మాత్రమే అందిస్తే చాలదు, వారి ఆరోగ్యం కాపాడుకోవడమూ ముఖ్యమే. అరవైదాటాక ఆ పెద్దలు చిన్నపిల్లల కిందనే లెక్క. వారికది రెండోబాల్యం! పెద్దయ్యే వరకూ బిడ్డను ఎలా జాగ్రత్తగా పెంచుతామో, వీరినీ అంతే జాగ్రత్తగా సంరక్షించాలి. అందుకే మలివయసు వారికి తోడుగా ఎలా మసులుకోవాలో తెలుసుకోండి!

### పదవీవిరమణ సంకేతం కాదు

మన జీవన పరిస్థితులు, వైద్య సదుపాయాలు మెరుగవుతున్న కొద్దీ ఆయుఃప్రమాణమూ మెరుగవుతోందని కొన్ని రకాల అధ్యయనాలు చెప్తున్నాయి. ఒకరకంగా వైద్యరంగంలో సాధించిన పురోగతే ఇందుకు కారణం. అందుకే ఒకప్పుడు పదవీ విరమణ అంటే మలివయసు కిందకే లెక్క పెట్టేవారు..కానీ ఇప్పుడు పదవీ విరమణ అంటే జీవితంలో మరో దశకు శ్రీకారం చుట్టినట్లుగా భావిస్తున్నారు. అయితే ఆయుః ప్రమాణం పెరగడం మాత్రమే కాదు వ్యాధుల వలలో ఇక్కట్లను అనుభవించే కాలం ఈ వయసు దేనని తాజా అధ్యయనాలు చెబుతున్నాయి.

### తొందర పెట్టకండి..

పెద్దవాళ్ళు ఏ పనులు చేస్తున్నా సరే, వారిని తొందరపెట్టకండి. అరవై దాటాక వారిలో చురుకుదనం కాస్త తగ్గుతుంది. ఏదైనా నెమ్మదిగా చేస్తుంటారు. పూర్వంలాగా చకచకా చేయలేరు. కంగారుపెడితే పని సరిగ్గా పూర్తిచేయలేక అసౌకర్యానికి గురవుతారు. పైగా ఆ వయసులో అనారోగ్య సమస్యలవల్ల కొన్ని పనులు అస్సలు చేయలేరు. ఈ విషయాలన్నీ అర్థం చేసుకుని మెలగాలితప్ప, అన్నీ వేళకు పూర్తికావాలని వారికి హుకుం జారీ చేయకూడదు. అవసరమైతే మన పెద్దవాళ్ళ పనులు మనమే చేసిపెట్టాలి. వీలైనంతవరకు వారికి ఎక్కువపని అప్పచెప్పకపోవడమే మంచిది. ఒకవేళ చెప్పినా వారిని తొందర పెట్టకూడదు.

### ప్రేమను పంచండి

ఎంతకాలం అనుభవించినా, ఇంకా యవ్వనం లోనే ఉన్నామన్న భావన కలిగించే మహత్యం కేవలం ప్రేమకే ఉంది. ప్రేమను స్వీకరించడమే కాదు ఇవ్వడంలో కూడా ఆనందమే ఉంది. ప్రేమభావం ఉత్సాహాన్నిస్తుంది. అందుకే మలివయసులో పెద్దలతో కుటుంబ వివాదాల జోలికి వెళ్ళకపోవడమే మంచిది. ఈర్ష్య, ద్వేషం, అసూయ వంటి వాటికి దూరంగా ఉండి మీ తల్లిదండ్రులకు ప్రేమను పంచండి. మీ పిల్లలకు కూడా వారితో ఎలా నడుచుకోవాలో నేర్పించండి. కన్న బిడ్డలుగా మనం వారికి తగిన గౌరవం ఇవ్వకపోతే మన పిల్లలు, భార్యకూడా వారికి గౌరవం ఇవ్వరు. అందుకే మనల్ని కని పెంచి పెద్దచేసిన మన తల్లిదండ్రులపట్ల కడవరకు ప్రేమగా మెలగాలి. ఆ వయసులో వారికి చాదస్తం ఉంటుంది. కొంతమందైతే ప్రతిదానికీ ఏదో ఒకటి మాట్లాడుతూ ఉంటారు. పదేపదే గతాన్ని గుర్తుచేసే వ్యాఖ్యానాలు చేస్తారు. ఎంత చేసినా ఇంకా చెయ్యాలంటారు. అలాంటి సందర్భాల్లో సహనం కోల్పోవడం సహజం. వారిమీద అరిచేస్తుంటారు. అందుకే పెద్దవారితో మాట్లాడేటప్పుడు, సేవలు చేసేటప్పుడు ఓపిక చాలా అవసరం. మీరు చిన్న

ప్పుడు చేసిన అల్లరికి మీ అమ్మ ఎంతో సహనంగా ఓపికగా ఉంటూ మిమ్మల్ని పెంచింది కదా, ఇది కూడా అలాంటిదే. అంతటి సహనం, ఓపిక మీరు కూడా తెచ్చుకోవాలి. ఆఫీసుకు వెళ్ళేటప్పుడు, వచ్చాక, మధ్యలో ఒకసారి వారిని ప్రేమగా పలకరిస్తే వారు చాలా ప్రశాంతంగా ఉంటారు. పైగా వారికి దిగాలు అనేది ఉండదు.

### టెక్నాలజీ నేర్పండి!

మారుతున్న కాలానుగుణంగా కొన్ని విషయాల్లో మారాల్సి ఉంటుంది. అరవై దాటిన వారికి ఇప్పటి టెక్నాలజీ తెలిసే అవకాశం, అవసరం లేదు. మరిక చెప్పేదేముంది అనుకుంటే మాత్రం తప్పు! మనతో పెద్దవాళ్ళు టచ్‌లో ఉండాలంటే, నిత్యం మనకు కనెక్టయి ఉండాలంటే, కొత్త టెక్నాలజీ వారికి నేర్పాల్సిందే. ఫోన్, మెసేజ్ లాంటివి ఎలా చెయ్యాలో నేర్పించాలి. ఆన్‌లైన్‌లో సరుకులు ఇంటికి తెప్పించుకోవడం, ఆన్‌లైన్ కొనుగోళ్ళను కూడా ఆసక్తిమేరకు వారికి నేర్పించవచ్చు. అత్యవసర సమయాల్లో వాళ్ల పనులు పూర్తిచేయగలుగుతారు. సోషల్ మీడియాలో వృద్ధులకు ఉపయోగపడే అనేక గ్రూపులున్నాయి. తమకు తెలిసినవి ఇతరులకు చెప్పడానికీ, ఇతరులు చెప్పేవి తెలుసుకోవడానికీ అవకాశాలున్నాయి. ఫలితంగా ఒంటరి వృద్ధులకు కొత్త ఫ్రెండ్స్ తోడైతే కాలక్షేపం ఉంటుంది. పెద్దలను ఒంటరిగా వదిలేశామనే బాధా మనకు తగ్గుతుంది.

### ఏదైనా కోర్స్‌లో చేర్చండి

వృద్ధాప్యంలో వాళ్ళకేం చేతనవుతుంది? వాళ్ళేం నేర్చుకుంటారు? అనుకుంటున్నారా! నేర్చుకోవాలనే అభిలాష కనబరిచే పెద్దలను వివిధ రకాల కోర్సుల్లో జాయిన్ చేయొచ్చు. వారిలో నిగూఢమైన అభిరుచులకు ప్రాణం పోసేందుకు అదో సువర్ణావకాశం. యుక్తవయసులో పరిస్థితులు అనుకూలించక వదులుకున్న విద్యలను ఇప్పుడు నేర్చుకోవచ్చు. ఆ అనుభవాలన్నీ ఉపయోగపడేది మీ పిల్లలకే. ఇలా చేయడంవల్ల వృద్ధుల్లో ఉత్సాహం మరింత పెరుగుతుంది. ఆరోగ్యంగా కూడా ఉంటారు.

### ఔటింగ్

వృద్ధులైనంతమాత్రాన బైట తిరక్కూడదనే నియమం ఏదీ లేదు. అలా వెళ్ళాలనే కోరిక వారికీ ఉంటుందికదా! ఉద్యోగ, కుటుంబ బాధ్యతలవల్ల చాలా సంవత్సరాలు స్నేహితులకు, బంధువులకు దూరంగా గడిపే ఉంటారు. ఆ బంధాలు, అనుబంధాలు చిగురించాలన్నా, కంటికి కనిపించని ఆత్మ సంతృప్తి వారికి లభించాలన్నా వారిని బైటకు తీసుకెళ్ళడం ఒక మంచి అవకాశం. స్నేహితులు, మరచిపోయిన దూరపు బంధువుల ఇళ్లకు లేదా బైటి ప్రాంతాలకు తీసుకెళ్లండి! వెళ్ళగలిగితే, వారికి అన్ని సౌకర్యాలూ కల్పించి జాగ్రత్తలు చెప్పి పంపించండి. వీలుంటే కుటుంబమంతా కలిసి విహారయాత్రకు వెళ్లండి. జీవితంలో గడపాలనుకున్న ఆనంద క్షణాలు మళ్లీ వారికి తిరిగొచ్చినట్టవుతుంది. ఈ అనుభూతులు వారికి మానసిక ప్రశాంతత చేకూరుస్తాయి. వారి వారితో ఉండే ఆ సమయం వారికి ఎంతో మధురంగా అనిపిస్తుంది.

### ఆరోగ్యంపై ఎలర్ట్‌గా ఉండండి

వయసు మళ్ళినవారిని ప్రధానంగా బాధించేవి ఆరోగ్య సమస్యలు. మానసిక సమస్యలుంటే, మన ప్రవర్తనతో వాటిని తగ్గించవచ్చు కానీ శారీరక సమస్యల్ని అంత ఈజీగా తగ్గించలేం. అందుకే పెద్దల ఆరోగ్య విషయంలో జాగ్రత్తలు తీసుకోవడం తప్పనిసరి. ఈ విషయంలో కన్నబిడ్డలు ఎలర్ట్‌గా ఉండాలి. నెలకోసారి లేదా మూడునెలలు లేదా ఆరునెలలకోసారి చెకప్‌లు చేయించడం తప్పనిసరి. సరైన మందులు సమయం ప్రకారం వేసుకుంటున్నారో లేదో పరిశీలించాలి. వారికి ఏచిన్న అనారోగ్యం చేసినా కొన్నిసార్లు వేరే సమస్యలోకి దారితీసే ప్రమాదం ఉంటుంది కనుక జలుబు, కండరాల నొప్పులు వంటివాటికి సైతం నిర్లక్ష్యం చేయకుండా డాక్టర్ల సలహా తీసుకోవడం ఉత్తమం.

- విజేత

## లేటు వయసులో లక్కీలాటరీ

ఎప్పుడైనా లాటరీలో కనీసం వందరూపాయలు తగిలినా చాలా హ్యాపీగా ఫీలవుతాం. అలాంటిది ఒకేసారి కోట్ల రూపాయల లక్కీ లాటరీ తగిలితే? ఆ ఆనందాన్ని ఆపడం ఎవరి తరం? ఇప్పుడు అలాంటి సంతోషంలోనే మునిగి తేలుతోంది ఓల్గాబెనో అనే వృద్ధ మహిళ. ఆమెకు 649 నంబర్ టికెట్‌పై లాటరీ తగిలినట్లు 1989లో కల వచ్చిందట. అదే నంబర్ లాటరీ టికెట్ కొనడం మొదలు పెట్టింది. కొన్నేళ్ల క్రితం ఆమె కేన్సర్ బారిన పడింది. ఆ సమయంలో చికిత్స కోసం ఇంటిని కూడా అమ్ముకోవాల్సి వచ్చింది. ఆసమయంలో కూడా లాటరీ టికెట్లు కొనడం మాత్రం ఆమె మానుకోలేదు. ఎట్టకేలకు ఆమె ప్రయత్నం ఫలించింది. అట్లాంటిక్ లాటరీ సంస్థ ఇటీవల ప్రకటించిన విజేతల్లో ఓల్గా కొన్న టికెట్‌కు సుమారు 5.3 మిలియన్ డాలర్ల బహుమతి లభించింది. అంటే 30 కోట్ల రూపాయల పైమాటే. అయితే తనకు లాటరీ వచ్చిందన్న సంగతి మొదట నమ్మలేదట ఓల్గా. ఆమె సోదరి ఆ విషయం చెప్పడంతో ఓల్గా ఆనందానికి పట్టపగ్గాల్లేవు. ప్రస్తుతం మనవళ్ల మనవరాళ్లతో అద్దె ఇంట్లో కాలం గడుపుతున్న




ఓల్గా ఆ సొమ్ముతో కొత్త ఇల్లు కట్టుకోవడంతో పాటు తనకు నచ్చిన ప్రదేశాలు చుట్టి రావడానికి సిద్ధమైపోతోంది.

## పెద్దవాళ్లపై చిన్నచూపే!

ఉమ్మడి కుటుంబాలు కనుమరుగవుతున్న నేపథ్యంలో దేశంలోని వయోవృద్ధుల్లో 50 శాతం మంది వివిధ రకాల వివక్షలకు గురవుతున్నారని హెల్ప్ ఏజ్ ఇండియా సంస్థ సర్వే వెల్లడించింది. ఢిల్లీ, కోల్‌కతా, ముంబయి, బెంగళూరు, చెన్నై, హైదరాబాద్, అహ్మదాబాద్, నాగ్‌పూర్, కాన్పూర్, మధురై నగరాల్లో మధ్యతరగతి, ఉన్నతవర్గాలకు చెందిన చెరో ఇరవై కుటుంబాలను సంస్థ ఎంపికచేసి 200 మంది యువకులను ప్రశ్నించింది. ఆ సర్వేలో వెల్లడైన వివరాల ప్రకారం, దేశ రాజధాని ఢిల్లీలో వృద్ధులు వివక్షకు గురవుతున్నారని 92 శాతం యువత అంగీకరించింది. చెన్నై, హైద్రాబాద్ నగరాలు దీని తర్వాతి స్థానాల్లో ఉన్నాయి. అభివృద్ధి చెందుతున్న భారత్‌లాంటి దేశంలో వృద్ధులపై వివక్ష సహజమని 42 శాతం మంది తెలిపారు. దైనందిన జీవితంలో కోడళ్ళ వల్ల ముసలివారికి సమస్యలు వచ్చాయని 50.02 శాతం మంది, కొడుకులవల్లే తల్లిదండ్రులకు మలివయసు కష్టాలు వచ్చాయని 28 శాతం మంది అభిప్రాయపడ్డారు. పెద్దలను చిన్నచూపు చూసేవారిలో 18 ఏళ్ల నుంచి 34 ఏళ్ల మధ్య వయసున్న వారే అధికంగా ఉన్నట్టు సర్వేలో వెల్లడైంది.



# సాఫ్ట్‌వేర్‌లో సరిగమలు

9

- కంఠంనేని స్వప్న



**సానుభూతిగా చూస్తున్నాడు శ్రీకాంత్.**

**మోకాళ్ళమీద కూర్చుని రెండు చేతుల్లో తలదాచుకున్న అక్షయ్ భుజంమీద ఓదార్పుగా చేయివేశాడు.**

**కొంతమంది చేసే వృత్తి ఎటువంటిదైనా తోటివారంటే ఎంపతీ, మనసులో సున్నితత్వం పోదు. శ్రీకాంత్‌ది కూడా అటువంటి మనస్తత్వమే. ముఖ్యంగా పిల్లలకి సంబంధించిన నేరాల విషయంలో మరింత చలించిపోతాడు. ఆ సమయంలో అతనికి పొద్దున్న స్కూల్‌కి వెళ్తున్న తన పిల్లలు గుర్తొచ్చారు.**

"ఈ పాప నైరాయేనా?" అడిగాడు శ్రీకాంత్.

కాదని తలూపాడు అక్షయ్.

కొద్దిగా రిలీఫ్ ఫీలయ్యాడు శ్రీకాంత్. డెడ్ బాడీస్‌ని వాళ్ళకి సంబంధించిన వాళ్ళు గుర్తించే ప్రతిసారీ అతను, కాదనే మాట వినాలనే కోరుకుంటాడు. గుర్తించిన తర్వాత ట్రామా తట్టుకోవటం మరీ కష్టమనిపిస్తుందతనికి.

మళ్ళీ పాప బాడీమీద దుప్పటి సరిచేసి వార్డ్ బోయ్‌ని శుభ్రం చేయమని ఆదేశించి అక్షయ్‌తో బయటికి నడిచాడు.

"నాలుగు రోజులవుతోంది పాప కనిపించక. కనీసం ఫోను కూడా రాలేదు. నైరాని కూడా ఇలాంటి పరిస్థితిలోనే చూడాల్సి వస్తుందా?" అడిగాడు అక్షయ్.

"అప్పుడే నిరాశ చెందితే ఎలా? క్షేమంగా ఉన్నదని భావిస్తేనే మన ప్రయత్నాలు మనం గట్టిగా చేయగలుగుతాం" చెప్పాడు శ్రీకాంత్.

ఒకపక్క ఫోన్ వస్తుందేమోనని ఎదురుచూస్తూనే మరో వైపు తమ పరిశోధన కొనసాగించారు ఇద్దరూ.

●●●

చాలారోజుల తర్వాత ఆఫీస్‌కి వచ్చాడు హర్ష.

ల్యాప్‌టాప్ ఆన్‌చేసి, తన మేనేజర్‌తో మాట్లాడటానికి వెళ్ళొచ్చేసరికి డెస్క్‌మీద అతని సెల్‌ఫోన్‌లో గులాబీరంగు లైట్ వెలుగుతూ ఆరుతూ కనబడుతోంది.

అజ్ఞాతవ్యక్తి నుంచి మళ్ళీ మెసేజ్ వచ్చినట్లుంది. ఆ మెసేజ్‌కి బ్లింక్ అయ్యే లైట్ కలర్, మెసేజ్ టోన్ వేరేవి పెట్టుకున్నాడతను. వద్దనుకుంటూనే ఆ మెసేజ్‌కి అడిక్ట్ అయిపోతున్నాడు.

గభాల్న ఫోన్ చేతిలోకి తీసుకుని మెసేజెస్ ఓపెన్‌చేసి చూశాడు.

"ఈ జీవితాన్ని మళ్ళీ జీవించే అవకాశం వస్తే ఈసారి నిన్ను ఇంకాస్త ముందు కనుక్కుంటాను. ఇంకాస్త ఎక్కువ సమయం పాటు నిన్ను ప్రేమిస్తాను. యు ఆర్ మై సోల్‌మేట్".

చిర్రెత్తుకొచ్చిందతనికి.

గత కొన్నాళ్ళుగా అక్షయ్ ఎదుర్కొంటున్న సమస్యలతో అతనికి పిచ్చెక్కిపోతోంది. అటువంటి సమయంలో ఫోన్ మోగదు. ఎంత ఎదురుచూసినా మెసేజ్ రాదు.

తీరిగ్గా ఆఫీస్‌లో కూర్చోగానే మెసేజ్. పైగా సోల్‌మేట్ అట. ఎంత తీయటి అబద్ధం. ఆమెకి వీలున్నప్పుడు, తీరిక దొరికినప్పుడు మాత్రమే



తను గుర్తొస్తాడనుకుంటా. ఆ మాత్రానికి అంత పెద్దపెద్ద పద ప్రయోగాలు అవసరమా? పైగా తనెవరో చెప్పకుండా డ్రామా. ఇంకా ముందు నుంచీ ప్రేమించేదట మహాతల్లి. చదువు కూడా చెడగొట్టేదేమో!

"నువ్వు నా నుంచి ఏమి ఆశిస్తున్నావు? స్నేహమా? కెరియర్ గైడెన్సా? లేక మరేదైనానా?" మెసేజ్

పంపాడు.

కాసేపు ఎదురు చూశాడు రిప్లై వస్తుందే మోనని.

మెసేజ్ చదివిందనటానికి గుర్తుగా బ్లూ టిక్ మార్కులు కనబడుతున్నాయి. కానీ జవాబులేదు.

"నీకేమి కావాలో స్పష్టత లేనప్పుడు నన్ను అనవసరంగా డిస్టర్బ్ చేయకు" మెసేజ్ పంపాడు.

ఫోన్ పక్కన పడేసి పనిలో పడ్డాడు.

•••

శ్రీకాంత్ నుంచి మెసేజ్ వచ్చింది అక్షయ్‌కి. 'కాసేపట్లో వచ్చి కలుస్తాననీ, ఇంట్లోనే ఉండమనీ'.

ఎదురు చూడసాగాడు అక్షయ్.

లోలోపల భయంగా ఉంది ఎటువంటి వార్త వినాల్సి వస్తుందోనని.

నైరా వస్తువులు కనబడినప్పుడల్లా అతనిలో బాధ తన్నుకొస్తోంది. ఆమె పాల కప్పు, బౌల్, ప్లేట్, రూమ్ ఏది చూసినా అతనికి కడుపులో పేగుల్ని మెలితిప్పినట్లవుతోంది. చలి, వణకు బయల్దేరు తున్నాయి.

"ఎవరు తీసుకెళ్ళారో... ఎలా ఉందో.. ఎటువంటి పరిస్థితిలో ఉందో.. ఎంత భయపడుతోందో? తనొచ్చి తీసుకెళ్తానని ఎదురు చూస్తోందేమో. ఎత్తుకెళ్ళిన వాళ్ళు ఆమెని హింసించడం లేదుకదా? తనకి చేతులు కట్టేసినట్లుగా ఉందేమిటి? ఇంతపెద్ద ప్రపంచంలో ఎక్కడని వెతకాలి? నైరా తప్పించుకుని రాగలిగితే బాగుంటుంది" ప్రతి క్షణం ఇదే ఆలోచన.

కంటిమీద కునుకు ఉండట్లేదు.

తిండి సహించటం లేదు.

ఇంకొన్నిరోజులు ఇలాగే కొనసాగితే తనకి పిచ్చెక్కటం ఖాయమని అతనికి అర్థమవుతోంది.

తలుపు మీద నెమ్మదిగా కొట్టి లోపలికొచ్చాడు శ్రీకాంత్.

రాత్రీ, పగలూ డోర్ తెరిచే ఉంచుతున్నాడు అక్షయ్. నైరా తప్పించుకుని రాగలిగినా, ఎత్తుకెళ్ళిన వాళ్ళు జాలిపడి వదిలేసినా ఆమె లోపలికి రావటానికి వీలుగా ఉంటుందని అతని ఉద్దేశం.

శ్రీకాంత్‌ని చూడగానే లేచి నిలబడి అడిగాడు అక్షయ్.

"నైరా సంగతి ఏమైనా తెలిసిందా?"

"ఇంకాలేదు. కానీ ఒక ముఖ్యమైన సంగతి. జాగ్రత్తగా వినండి" చెప్పటం మొదలెట్టాడు శ్రీకాంత్.

"మన దేశంలో ప్రతి ఎనిమిది నిమిషాలకు ఒక పిల్లవాడు చొప్పున మాయమవుతుంటారు. వీళ్ళలో సగంమంది ఏమైపోయుంటారో మనకి మిస్టరీగా మిగిలిపోతోంది. మిగిలిన వాళ్ళలో ప్రాణాలతో తిరిగి వచ్చేవారిని వేళ్ళ మీద లెక్కపెట్టొచ్చు.

"పిల్లల్ని ఎత్తుకెళ్ళే ముఠాలకు రకరకాల అక్రమ వ్యాపారాలతో సంబంధముండవచ్చు. పిల్లలతో చేయించే అతి పెద్ద వ్యాపారం వ్యభిచారం. అరబిక్ దేశాలలో ఒంటెలకు కట్టి, కామెల్ జాకీలుగా వాడటానికీ, అవయవాలు అమ్మి వ్యాపారం చేసుకోవడానికీ, ఇంట్లో వారివద్ద నుంచీ డబ్బు గుంజటానికీ, దేవుళ్ళకు బలిచ్చి అతీతశక్తులు పొందవచ్చనే మూర్ఖపు నమ్మకాలతో, ఫ్యాక్టరీలలోనూ, ఇళ్ళలోనూ లేబర్‌గా వాడటానికీ, బిచ్చగాళ్ళుగా మార్చి పిల్లల మీదుండే సానుభూతితో వేసే డబ్బుకోసమో, బలవంతంగా పెళ్ళిళ్ళు చేసుకోవటానికీ, చట్టవిరుద్ధంగా దత్తత చేసుకోవటానికీ, మెడికల్ ప్రయోగాలకీ, నరమాంసం తినేవాళ్ళ కోసమూ, కొన్ని దేశాల్లో సైనికులుగా పని చేయటానికి ఇలా రకరకాల కారణాలున్నాయి".

"నైరాని ఎత్తుకెళ్ళటానికి వీటిలో ఏదయినా కారణమవ్వచ్చు. మరే కొత్త కారణమైనా అయ్యుండవచ్చు. ఏదిఏమైనా మనం ఏ ఒక్కదాన్నీ వదలకుండా అన్ని కోణాలనుంచీ దర్యాప్తు చేద్దాం".

'ప్రస్తుతం ప్రాస్టిట్యూషన్ రింగ్స్ చాలామటుకు ఆన్‌లైన్ రన్ అవుతున్నాయి. వాటికోసం వెబ్‌సైట్‌లు కూడా నిర్వహిస్తున్నారు. రెండురోజుల క్రితం ఇలాంటి ఒక వెబ్‌సైట్‌లో అయిదారేళ్ళ ఆడపిల్ల ఫొటో ఫ్లాష్ చేశారట రోజంతా. న్యూ అరైవల్స్ అని పక్కన అడ్వర్టైజ్‌మెంట్ కూడానట. ఇలాంటివి చెప్పుకోవటానికి కూడా మనం మనుషులుగా పుట్టినందుకు సిగ్గుపడే పరిస్థితి తలెత్తుతోంది".

"ఆ పాప ఒకవేళ నైరా అయ్యుండొచ్చేమో అని ఎంక్వయిరీ చేస్తున్నాం" ముగించాడు శ్రీకాంత్.

"రెండురోజుల క్రితం వేస్తే ఇంకా ఎంక్వయిరీ చేస్తున్నారా?" ఆవేశంగా అన్నాడు అక్షయ్.

"మాకు తెలిసింది ఈరోజే. ఇంకో విషయం! మేము ఈ కేస్ విచారణలో తలదూర్చటానికి కనీసం ఇంకో రెండు వారాలు పడుతుంది. ఈ రాకెట్ వెనక ఎవరైనా పెద్దవాళ్ళుంటే ఎన్నో అడ్డంకులు రావచ్చు. పరిశోధనకి అవసరమయ్యే ఫండ్స్, పర్మిషన్స్, ఆధారాలు ఇవన్నీ తెచ్చుకోవటానికి ఈజీగా ఆ మాత్రం టైమ్ పడుతుంది" తాపీగా చెప్పాడు శ్రీకాంత్.

ఒక్కసారి తలంతా దిమ్మతిరిగినట్లైంది అక్షయ్‌కి.

ప్రభుత్వ రంగంలో పేరుకుపోయిన బ్యూరోక్రసీ కొట్టిన మొదటి దెబ్బ అది.

'కావాలంటే వెబ్‌సైట్ డీటెయిల్స్ నీకు ఇస్తాను. నీవైపు నుంచి నువ్వు ప్రయత్నించవచ్చు. బ్యాక్‌గ్రౌండ్ నుంచి నా సహాయం నీకెప్పుడు అవసరమయినా ఉంటుంది' హింట్ ఇచ్చినట్లుగా చెప్పాడు.

అక్షయ్ కళ్ళల్లో ఆశ.

'అవును. తను ప్రయత్నించొచ్చు. ప్రపంచంలో అందరికంటే ఎక్కువగా నైరాని సంరక్షించాల్సిన బాధ్యత, అవసరం తనకే ఉన్నాయి'.



## జరిగిన కథ

అదో మల్టీ నేషనల్ కంపెనీ! రెండేళ్ళుగా ఆ కంపెనీలోనే పనిచేస్తున్నాడు అక్షయ్. కావ్య కూడా అదే ఆఫీసులో ఫ్రెషర్‌గా జాయినైంది. ఆఫీసులో కొత్తగా చేరిన సీమ, అక్షయ్ స్నేహితురాలని తెలిసి ఉడికిపోయింది కావ్య. అక్షయ్ వాళ్ళ అక్కా, బావ యాక్సిడెంట్‌లో చనిపోయారనే వార్త అతణ్ణి అతలాకుతలం చేస్తుంది. ఇక తనకు మిగిలిన ఒకే ఒక బంధం నైరాని ఎటువంటి లోటు రానీకుండా పెంచాలనుకుంటాడు. ఒక కార్పొరేట్ స్కూల్‌లో జాయిన్ చేస్తాడు. స్కూల్ టైమింగ్స్‌కి అనుగుణంగా తన ఉద్యోగ సమయాలను మార్చుకుంటాడు అక్షయ్. అకస్మాత్తుగా నైరా కనిపించకుండా పోయింది. పోలీస్ కంప్లయింట్ ఇస్తాడు అక్షయ్. ఇన్వెస్టిగేషన్ మొదలవుతుంది. దాంట్లోభాగంగానే నైరా పోలికలతో ఓ పాప దొరికిందని, గుర్తుపట్టడానికి రావలసిందిగా ఇన్‌స్పెక్టర్ నుంచి ఫోన్ వస్తుంది అక్షయ్‌కి.

ఆ తరువాత..

వెబ్‌సైట్ లింక్ ఇచ్చి శ్రీకాంత్ వెళ్ళిపోయాక, అక్షయ్ తన రీసెర్చ్ మొదలెట్టాడు. వెబ్‌సైట్‌లో లిస్ట్‌చేసిన నంబర్‌కి ఫోన్ చేశాడు.

చాలాసేపు ఫోన్ రింగ్ అయింది.

ఎవరూ ఎత్తట్లేదు.

రెండు నిమిషాలాగి మళ్ళీ ట్రై చేశాడు.

జవాబు లేదు.

ఏమిచేయాలో అర్థం కావట్లేదు అక్షయ్‌కి.

మళ్ళీ దారులు మూసుకున్నట్లుగా అనిపిస్తోంది.

ఆలోచనలో పడ్డాడు.

'వెబ్‌సైట్‌ని హ్యాక్‌చేసి చూస్తే? మరేదైనా నంబర్ దొరకొచ్చేమో?'

ఫోన్‌లో బ్లింక్ అవుతున్న లైట్ కనబడింది. మరుక్షణం మెసేజ్ టోన్ వినపడింది.

యథాలాపంగా తెరిచి చూశాడు.

వాట్సాప్ మెసేజ్...

"కాల్ చేయొద్దు. వాట్సాప్ మెసేజ్ ఓన్లీ" అని ఉంది.

ఆ నంబర్ తను ఇందాక ప్రయత్నించిన నంబరే!

ఉలికిపడ్డాడు.

'టెక్నాలజీ ఇలా పనికొస్తుందా? వాట్సాప్ ఫౌండర్ జాన్‌కామ్‌కి ఈ విషయం తెలిస్తే ఉరి వేసుకుంటాడేమో!'

మెసేజ్ పంపాడు.

యు.ఎస్. నుంచి ఫ్రెండ్ వస్తున్నాడు. ఏవయినా మంచి డీల్స్ ఉంటే చెప్పు.

'ఎక్కడికి పంపాలి?' వెంటనే రిప్లయ్ వచ్చింది.

'ముందు నీ దగ్గర ఎవరెవరున్నారో ఫొటోస్ పంపు'.

టక టకా ఫొటోలు డౌన్‌లోడ్ అవటం మొదలెట్టాయి.

'ఇంకా మంచివాళ్ళు లేరా?'

'రేటెక్కువ అవుతుంది సార్!'

"ఫర్వాలేదు, పంపు ముందు.'

మరో రెండు ఫొటోస్ వచ్చాయి.

చక్కటి, అందమైన అమ్మాయిలు.

'వీళ్ళకిదేమి ఖర్మో! ఎందుకీ వృత్తిలోకి దిగారో?' అనిపించింది అతనికి.

**ప్రతీ క్షణం నైరా గురించే ఆలోచిస్తున్నాడు అక్షయ్. ఎలా ఉందో, ఎవరు తీసుకెళ్లారో, ఎంతగా భయపడుతోందో... ఆలోచనలతో బుర్ర వేడెక్కిపోతోంది. ఇలానే ఉంటే పిచ్చెక్కడం ఖాయం అనుకున్నాడు. ఆలోచనలతో సతమతమవుతుండగానే తలుపు తట్టిన చప్పుడైంది. నెమ్మదిగా లోపలికొచ్చిన వ్యక్తిని చూసి, దిగ్గున లేచి నిలబడ్డాడు అక్షయ్.**

**ఇంతకూ ఆ వచ్చిన వ్యక్తి ఎవరు? నైరాయేనా?**

అప్పుడు తట్టింది అతనికి 'వీళ్ళూ బాధితులే అయ్యుండొచ్చు'.

'వీళ్ళంతా కాదు. ఇంకా ఎక్సాటిక్!'

అప్పుడొచ్చాయి ముగ్గురు చిన్నపిల్లల ఫోటోలు.

అంతా ఆరేడేళ్ళలోపు వాళ్ళే. అయితే మొహాలు కనపడకుండా అస్పష్టంగా ఉన్నాయి. ఎడిట్ చేసి మొహాలు కనబడకుండా చేసినట్లున్నారు.

'వీళ్ళలో ఎవరు?' మెసేజ్ వచ్చింది.

రక్తం మరుగుతోంది అక్షయ్‌కి.

'ఇంతేనా? ఇంకా ఏమీ ఫొటోస్ లేవా?' అడిగాడు.

'ఇప్పటికింతే. మళ్ళీ ఫ్రెష్‌స్టాక్ వచ్చే నెల వస్తుంది' జవాబొచ్చింది.

రేట్ ఫైనల్ చేసుకున్నాడు.

ఏ మాత్రం భయం లేకుండా పబ్లిక్‌గా, నిస్సిగ్గుగా జరుగుతున్న ఆ వ్యాపారం చూస్తే అతనికి అనిపించింది, ఎవరో బాగా పలుకుబడి ఉన్న వాళ్ళ అండదండలు ఉండి ఉంటాయని. అందుకే పోలీస్ డిపార్ట్‌మెంట్ కూడా వెంటనే జోక్యం చేసుకోవడానికి సందేహిస్తోంది.

ఫోన్ పక్కన పడేస్తుండగా బ్రోకర్ పంపిన మూడు పసిపిల్లల ఫొటోల్లోనూ ఒకటి మగపిల్లవాడిది అయి ఉండటం జ్ఞాపకం వచ్చి ఒళ్ళు జలదరించిందతనికి.

"మగపిల్లలకి కూడా రక్షణ లేదు. ఈ రకమైన సమానత్వం వచ్చిందేమిటి?"

•••

ఆ రాత్రి అక్షయ్ ఒక టీవీ ఛానల్ ఇన్‌పుట్ ఎడిటర్‌ని కలిశాడు.

జాతీయంగా ఉన్న ఛానల్ అది.

అప్పుడప్పుడే తెలుగురాష్ట్రాలలో పాపులర్ అవుతోంది.

కాంపిటీషన్ తట్టుకోవటానికి సంచలనాత్మకమైన స్టింగ్ ఆపరేషన్లు చేయటానికి ముందుంటారని పేరుంది వాళ్ళకు.

విషయం విని చప్పరించేశాడతను.

"ఇందులో న్యూస్ ఏముందయ్యా? సెన్సేషనల్ న్యూస్ కావాలి. ప్రతిరోజూ, ప్రతి ఛానల్‌లో ఆఖరికి చిన్నాచితకా వెబ్‌సైట్స్‌లో కూడా ఇటువంటి న్యూస్ వస్తూనే ఉంటుంది".

"ఇది అటువంటి న్యూస్ కాదు. 'ఇళ్ళ మధ్యలో బ్రోతల్‌హౌస్ నడుపుతున్న మహిళ' లాంటి న్యూస్ కాదు. ఈ ఆపరేషన్‌లో ఒక ధ్యేయం ఉంది. కిడ్నాప్‌కి గురయిన ఒక చిన్నపిల్లని రక్షించే ప్రయత్నం ఉంది. మీకు ఇంజనీరింగ్ చదివే కూతురుంది. సడన్‌గా ఆ అమ్మాయి మాయమైతే తట్టుకోగలరా?" అడిగాడు అక్షయ్.

కళ్ళజోడు ముక్కు మీదకు జార్చి, తలొంచి సాలోచనగా చూశాడు అక్షయ్‌వైపు.

'ఎక్కడన్నావు పని చేసేది?'

చెప్పాడు అక్షయ్.

'అబ్బో, అయితే సాఫ్ట్‌వేర్ పరిజ్ఞానం బాగా ఉండి ఉండాలే?'

అక్షయ్ మాట్లాడలేదు.

డైరెక్ట్‌గా పాయింట్‌లోకి వచ్చాడతను.

"నేను నీకు తోడుగా ఇద్దరు మనుషుల్ని, ఈ స్టింగ్ ఆపరేషన్‌కి అవసరమయ్యే పరికరాల్ని అరేంజ్ చేస్తాను. దానికి బదులు నాకో పని చేసిపెట్టాలి?"

తను అతనికి చేయగలిగే పని ఏముంటుందో అర్థం కాలేదు అక్షయ్‌కి.

"నాకొక ఈ-మెయిల్ హ్యాక్ చేసిపెట్టాలి" చెప్పాడు.

అతను అడుగుతున్న ఈ-మెయిల్ ఒక సెంట్రల్ మినిస్టర్‌ది!

ఆలోచనలో పడ్డాడు అక్షయ్. తను అనవసరంగా ఊబిలోకి దిగట్లేదు కదా!

"ఐ ప్రామిస్, లైవ్ టెలికాస్ట్ వేస్తాను నీ ఆపరేషన్ మొత్తం!"

'డీల్!' చేయి కలిపాడు అక్షయ్.

అక్షయ్ బయటికి నడుస్తుండగా అడిగాడతను.

'ఇంత రిస్క్ చేస్తున్నావు, ఆ పిల్లల్లో నైరా లేకపోతే?'

ఒక్కక్షణం ఆలోచించి చెప్పాడు అక్షయ్.

"ఎవరిబిడ్డ రక్షించబడుతుందన్నా నేను రిస్క్ తీసుకోవటానికి రెడీయే!"

•••

ఆ రాత్రి ఫేస్‌బుక్‌లో నైరా ఫోటో అప్‌లోడ్ చేశాడు హర్ష.

'నా ఫ్రెండ్ మేనకోడలు నైరా వారం నుంచీ కనిపించడం లేదు. ఇంట్లోకి జొరబడి ఎత్తుకుపోయారు ఎవరో దుండగులు, వారం క్రితం. వయసు అయిదేళ్ళు. ఎత్తు మూడడుగులు. తెలుగు, ఇంగ్లీషు

## మరో ఇరవై ఏళ్లు గ్యారంటీ!

ఈ మాట అన్నది హీరో కాదు, హీరోయిన్. బాలీవుడ్ హీరోయిన్ సన్నీలియోన్! ఇప్పుడిప్పుడే తన మీదున్న పోర్న్‌స్టార్ ముద్రను తుడిచేసుకుంటూ బాలీవుడ్‌లో దూసుకుపోతున్న సన్ని ఫ్యూచర్ మీద బోలెడంత ధీమాగా ఉంది. తను ఇక్కడికి వచ్చిన కొత్తలో మహాఉంటే రెండేళ్లకు మించి ఉండదని అన్నారనీ, కానీ ఐదు సంవత్సరాలు ఉండడమే కాదు, స్టార్ హీరోల సినిమాల్లో అవకాశాలు వస్తున్నాయని చెబుతోంది. మరో ఇరవై సంవత్సరాలు బాలీవుడ్‌లోనే కచ్చితంగా ఉంటానని స్పష్టం చేస్తోంది. వచ్చిన వెంటనే తట్టా బుట్టా సర్దేసుకుంటానని చాలామంది అనుకున్నారనీ, వారి ఆలోచనలు, మాటలు తారుమారు అయ్యాయనీ అంటోంది. షారూఖ్ పక్కన చేసింది ఒక్క సాంగే అయితే ఏం? స్టార్ హీరో సినిమాలో చేసినట్టే కదా! మిగతా స్టార్ హీరోలు కూడా నాకు అవకాశం ఇస్తారు అంటూ వారి ముందరి కాళ్లకు బంధాలు వేసే ప్రయత్నం చేస్తోంది.

భాషలు మాట్లాడుతుంది. నైరా తల్లిదండ్రులు ఈ మధ్యే యాక్సిడెంట్‌లో చనిపోయారు. మీలో ఎవరికైనా ఆమె ఆచూకీ తెలిస్తే సంప్రదించవలసిన నంబర్లు కింద లిస్ట్ చేస్తున్నా. ప్లీజ్, ఈ పోస్ట్ మీ పేజీల్లో కూడా షేర్ చేయండి.

గంట తర్వాత చూస్తే రెండు లైకులు, పది షేర్స్ కనబడ్డాయి.

కిడ్నాప్ అయిందనే పోస్ట్‌కి లైక్ కొట్టే వాళ్ళని ఏమనాలో అర్థం కాలేదు అతనికి.

అప్పుడు రంగంలోకి దిగింది సీమ.

తన పేజ్‌లో షేర్ చేసింది.

ఆమె ఫేస్‌బుక్ పేజ్‌కి వేలల్లో ఫాలోవర్లు ఉన్నారు. కేవలం ఆమె ఫొటోస్ చూసి మాత్రమే అంతమంది ఫాలో అవటం హర్షకి ఎప్పుడూ ఆశ్చర్యంగానే అనిపిస్తుంది.

పది నిమిషాల్లో ఆరువందల మంది ఆ పోస్ట్‌ని షేర్ చేశారు.

గంటలో ఆ పోస్ట్ వైరల్‌గా మారింది.

సీమని ఇంప్రెస్ చేసే ప్రయత్నంలో భాగంగా ఒక ఔత్సాహికుడు 'సేవ్ నైరా' అనే ఫేస్‌బుక్ పేజ్ క్రియేట్ చేశాడు.

గంటలు గడుస్తున్నాయి.

నైరా కేస్‌కి ప్రచారం లభించిందే కానీ ఎటువంటి ఆధారమూ దొరకట్లేదు.

●●●

మర్నాడు పొద్దున్న ఏడింటికల్లా స్టింగ్ ఆపరేషన్‌కి అవసరమయ్యే పరికరాలతో అతనికి తోడుగా పాల్గొనాల్సిన ఛానల్ ప్రతినిధులు ఇంట్లో ఉన్నారు.

ఒక అమ్మాయి, ఒక అబ్బాయి.

ఆమెని ఎక్కడో చూసినట్లనిపిస్తోంది. అతన్నెప్పుడూ చూడలేదు.

ఆలోచిస్తుండగా పరిచయం చేసుకున్నారు వాళ్లు.

అతను ఆ ఛానల్‌లో కెమెరామన్. ఆమె యాంకర్.

'అందుకే ఎక్కడో చూసినట్లనిపించిందేమో' అనుకున్నాడు అక్షయ్.

జేబులో పెన్‌కి అమర్చిన చిన్న కెమెరా.

సెల్‌ఫోన్‌కి కూడా చిన్న కెమెరా అమర్చారు.

అన్నివైపుల నుంచీ వ్యూ కవర్ అయ్యేలా ఎక్కడెక్కడ కెమెరాలు ఉంచాలో వాళ్ళిద్దరూ చర్చించుకుంటుండగా మధ్యలోకి దూకి చెప్పటం మొదలెట్టిందామె.

'మన దేశంలో బడుగు, బలహీనవర్గాల వారెందరో ఉన్నారు. వాళ్ళందరికీ మేలుచేయటమే ఈ స్టింగ్ ఆపరేషన్ల లక్ష్యం. ముఖ్యంగా గనక ఈ హైదరాబాద్ సిటీనే తీసుకుంటే ఛానల్ తరపున మేము చేస్తున్న స్టింగ్ ఆపరేషన్లతో ఎంతోమంది జీవన ప్రమాణం మెరుగుపడింది. ఈ కెమెరాని గనక మనం చూస్తే దీన్ని పద్దెనిమిదవ శతాబ్దంలో..'

"ఛీ, ఆపు.." పళ్ళు పటపటా కొరుకుతూ అరిచాడు కెమెరామన్.

బిత్తరపోయి చూస్తున్నాడు అక్షయ్.

"తిండికి లేక చస్తుంటే స్టింగ్ ఆపరేషన్ల వల్ల బడుగు, బలహీనవర్గాలకి లాభం అంటావేంటి? అసలు కెమెరా ఎప్పుడు కనిపెట్టారనే విషయం ఈయనకి చెప్పటం, ఇప్పుడు అవసరమా?' కెమెరా ఆన్‌చేశాక ఎటూ నువ్వే మాట్లాడతావుగా. ఆఫ్‌లో ఉన్నప్పుడన్నా నన్ను మాట్లాడనివ్వవా?" ఉగ్రావతారం ఎత్తాడు.

మూతి మూడు వంకర్లు తిప్పి వెనక్కి తప్పుకుందామె.

ఇప్పుడు వీళ్ళిద్దరినీ తీసుకుని తను వెళ్తే మొత్తం రసాభాస అవుతుందేమో అని భయం వేసింది అక్షయ్‌కి.

అతడిని యూఎస్ నుంచి వచ్చిన తన ఫ్రెండ్‌గా పరిచయం చేయాలని ప్లాన్ చేశారు.

ఆమె అక్కడే కాస్త దూరాన రోడ్‌మీద ఉన్న వ్యాన్‌లో కూర్చుని ఉంటుంది.

వెంటనే టెలీకాస్ట్ చేస్తే అది రన్ చేసేవాళ్ళు అప్రమత్తమయ్యే ప్రమాదం ఉంది కాబట్టి అరగంట గ్యాప్ తర్వాత ప్రత్యక్ష ప్రసారం చేసేలా అనుకున్నారు.

●●●

సాయంత్రం ఆరవుతుండగా మెసేజ్ వచ్చింది.

అడ్రస్ పంపాడతను.

ఎక్కడో మారుమూల ఏరియా సందుగొందుల్లోని అడ్రస్ కాదది.

అత్యంత ప్రముఖులు నివసించే బంజారా హిల్స్‌లో ఉంది.

అక్కడికి దగ్గర్లోనే ఆ ఏరియా పోలీస్‌స్టేషన్

## మనమీదేనర్రోయ్!

సరసి





కూడా ఉంది.
అంతకుముందే శ్రీకాంత్‌కి ఫోన్‌చేసి తమ ప్లాన్ మొత్తం వివరించాడు అక్షయ్.
'గుడ్. ఆ ఏరియా ఎస్ఐ నా ఫ్రెండ్. ఆ టైమ్‌కి అక్కడికి చేరుకునేలా నేను చూస్తాను. లైవ్ టెలీకాస్ట్ కావటంతో యాక్షన్ తీసుకోక తప్పదు. దానితో అతనికి పైవాళ్ళు అడ్డం పడటానికి ఉండదు' చెప్పాడు శ్రీకాంత్.
ఏడవుతుండగా ఆ ఏరియాకి చేరుకున్నారు అక్షయ్ వాళ్లు.
కాస్త దూరంలో వ్యాన్‌లో లైవ్ టెలికాస్ట్‌కి అవసరమయ్యే సామగ్రితో యాంకర్ ఆగిపోయింది.
మరో కార్‌లో అడ్రస్ వెతుక్కుంటూ ముందు కెళ్ళారు అక్షయ్, ఛానల్ ప్రతినిధి.
అదొక అపార్ట్‌మెంట్ కాంప్లెక్స్.
చాలా పోష్‌గా ఉందా ఏరియా.
కార్ దిగి గేట్ లోపలికి అడుగు పెడుతుండగా, ఎవరో షర్ట్ లాగుతున్నట్లనిపించి ఉలిక్కిపడ్డాడు అక్షయ్.
వెనక్కి చూశాడు.
కెమెరామన్ మెలికలు తిరుగుతూ నేలమీద కళ్ళ చుట్టూ నల్లటి వలయాలు.
దెబ్బలవల్ల కమిలిన గాయాలు కనబడుతున్నాయి వాళ్ళ ఒంటిమీద. వాళ్ళలో నైరా లేనందుకు సంతోషించాలో, బాధపడాలో అర్థం కాలేదు.
బేరం మొదలెట్టాడు అక్షయ్.
ఎంతకీ తెగట్లేదు... ఏదో ఒక లొసుగు పట్టుకుని కొనసాగిస్తున్నాడు.
కాసేపటికి ప్రత్యక్ష ప్రసారం మొదలైంది అరగంట లాగ్‌లో.
పది నిమిషాలకే ఆ భార్యాభర్తలకి ఫోన్స్ రావటం మొదలయ్యాయి.
కాసేపు వాళ్ళు ఫోన్ ఎత్తకుండా మాటల్లో పెట్టినా ఎక్కువసేపు సాధ్యపడలేదు.
ఫోన్ పెడుతూ అన్నాడు వాళ్ళలో మగతను సీరియస్‌గా.
'బయటికి నడవండి. ఏం మాట్లాడుతున్నారు? మా పిల్లలు నిద్రపోయే టైమ్ అయింది'.
"ఛా!" తలుపు తోసుకుని లోపలికొచ్చాడు ఇన్‌స్పెక్టర్, ఇద్దరు పోలీసులతో.
"మొత్తం లైవ్ టెలీకాస్ట్ అయింది. మిమ్మల్ని




బొటనవేలితో రాస్తూ చెప్పాడు.
"నాకు ఇంగ్లీష్ రాదు. నేను అమెరికా నుంచి వచ్చానంటే నమ్మరేమో!"
ఒళ్ళు మండిపోయింది అక్షయ్‌కి.
ఆ విషయమేదో ముందే ఏడ్చి చావొచ్చుగా.
'నేను మేనేజ్ చేస్తాను. నువ్వు మాట్లాడకుండా నోరు మూసుకుని ఉండు.'
'తిడుతూ తీసుకెళ్తే నేను రాను' రివర్స్ అవబోయాడతను.
సీరియస్‌గా చూశాడు అక్షయ్.
మాట్లాడకుండా అతని వెనుకే నడిచాడు కెమెరామన్.
సినిమాల్లో చూసినట్లు, కథల్లో చదివినట్లు మురికిగా లేదా అపార్ట్‌మెంట్.
నీట్‌గా, ఆర్గనైజ్డ్‌గా ఉంది. ఇద్దరు వ్యక్తులు ఉన్నారు ఆ ఇంట్లో. మామూలు దంపతుల్లాగే కనబడుతున్నారు. తనతో వచ్చినతడిని తన యు.ఎస్. ఫ్రెండ్‌గా చెప్పాడు అక్షయ్.
ముగ్గురు పిల్లల్నీ వీళ్ళ ముందుకు వదిలారు.
అమాయకంగా ఉన్నాయి వాళ్ళ మొహాలు. భయంగా చూస్తున్నారు.
నిద్రకి జోగుతున్నారు.
దేవుడు కూడా రక్షించలేడు" ఈడ్చుకెళ్ళారు వాళ్ళని.
పిల్లల్ని కూర్చోబెట్టి ప్రశ్నలడగటం మొదలెట్టాడు ఇన్‌స్పెక్టర్.
"మిమ్మల్ని ఎవరైనా కొట్టారా?"
మాట్లాడటం లేదు వాళ్ళు. మనుషుల్నీ, మగవాళ్ళనీ చూస్తేనే వణికిపోతున్నారు. దగ్గరగా ముగ్గురూ అతుక్కుని కూర్చున్నారు.
'తినటానికి కానీ, బాత్‌రూమ్‌కి వెళ్ళటానికి గానీ, నిద్ర పోవటానికి కానీ మీరు ఎవరినైనా అడిగి పర్మిషన్ తీసుకుంటారా?'
'మీరుండే గదికి తాళం వేసి ఉంటుందా?'
'బయటికి ఆడుకోవటానికి పంపిస్తారా?'
'ఎక్కడ నుంచి వచ్చారు? మీ అమ్మా, నాన్నల పేర్లేమిటి?'
ఒక్కదానికి కూడా సమాధానం లేదు. రాళ్ళలా బిగుసుకుపోయి భయంగా చూస్తున్నారు వాళ్ళు.
లైవ్ టెలీకాస్ట్ మధ్యలో కామెంటరీ మొదలెట్టింది యాంకర్.
'చూశారు కదా... చిన్నపిల్లలు ఎంతలా భయపడిపోయారో! ఈ ఏరియాలో చుట్టుపక్కల ఉన్న పోష్ బిల్డింగ్స్‌నీ, ఈ పోలీస్‌స్టేషన్‌నీ చూస్తే దీని వెనుక ఎంతపెద్ద ప్రముఖులు ఉండి ఉంటారో అర్థంచేసుకోవచ్చు'.
'ఇప్పుడే వచ్చిన వార్త. ఈ రాకెట్ వెనుక మన హోమ్ మినిస్టర్ హస్తం ఉందని ప్రతిపక్షనేత సంచలనాత్మక వ్యాఖ్యలు చేశారు. ముందు ముందు ఈ కేసు ఎన్ని మలుపులు తిరగనుందో చూడాలి'.
ఖంగుతిన్నారు ప్రతిపక్షనేత, హోమ్ మినిస్టర్.
"నేనెక్కడ అన్నాను?" అయోమయంగా బుర్ర గోక్కున్నాడు ప్రతిపక్షనేత.
"నాకేమి సంబంధం. ప్రతిదీ నా మీద తోస్తారు?" జుట్టు పీక్కున్నాడు హోమ్ మినిస్టర్.
అప్పటికే మినిస్ట్రీ కోసం కాచుక్కూర్చున్న తోటి నాయకుల నుంచి, ముఖ్యమంత్రి నుంచి విపరీతమైన ఒత్తిడి మొదలయింది హోమ్ మినిస్టర్‌కి.
రెండు రోజుల్లో ఆ రాకెట్ నడిపేవారి చెరలో ఉన్న మరో ముప్ఫయి మంది పిల్లల్ని విడిపించారు పోలీసులు.
స్టింగ్ ఆపరేషన్ తెలివిగా నిర్వహించిన అక్షయ్, నైరాకోసమే పరిశోధన మొదలు పెట్టినందున, నైరా కేస్‌కి మీడియా విస్తృత ప్రచారం కల్పించింది.
అక్షయ్ సాఫ్ట్‌వేర్ రంగానికి చెందిన వాడవటంతో ప్రతి సాఫ్ట్‌వేర్ ఉద్యోగి అతన్ని తన వాడిగా ఫీలవసాగారు. సోషల్‌మీడియాలో సంచనలంగా మారింది నైరా కిడ్నాప్ ఉదంతం!

●●●

రెండు రోజుల తర్వాత శ్రీకాంత్ నుంచి తెలుసుకున్న కొన్ని నిజాలతో అతని మనసు వికలమయింది.
వాళ్ళలో కొంతమంది పిల్లల్ని తల్లిదండ్రులే అమ్మేశారట.
కొంతమందికి భయంకరమైన జబ్బులు సోకటంతో తిప్పిపంపేశారట తల్లిదండ్రులు. కొద్దిమంది మాత్రం ఎక్కడనుంచీ వచ్చారో, వాళ్ళ తల్లిదండ్రులెవరో తెలీలేదట. సగానికి పైగా రక్షించబడిన వాళ్ళు, తిరిగి గవర్నమెంట్ హోమ్‌లకే చేర్చబడ్డారు.
అతి కొద్దిమంది మాత్రమే తమవాళ్ళ వద్దకు చేరుకున్నారు. అయితే వాళ్ళలో ఎంతమంది మళ్ళీ మనుషుల్ని నమ్మి, మామూలుగా ఉండగలుగుతారో చెప్పలేమన్నారట చైల్డ్ సైకియాట్రిస్టులు.
ఆరోజు ఎందుకో అక్షయ్‌కి చాలా దిగులుగా అనిపిస్తోంది.
దాదాపు పది రోజులవుతోంది నైరాని కిడ్నాప్ చేసి.
కనీసం ఫోన్ అయినా రాదేమిటి?
పోలీసులు కూడా పెద్దగా ప్రయత్నిస్తున్నట్టు అనిపించటం లేదు.
సడన్‌గా తలుపు దగ్గర పెద్ద శబ్దమైంది.
అదిరిపడ్డాడతను.
తలుపుమీదికి ఏదో విసిరిన శబ్దం. తలుపు తెరుచుకుంది, బరువు వల్ల. పరిగెత్తుకెళ్ళి చూశాడు.
ఏదో పెద్ద మూట... దానిమీద స్లిప్ లాంటిది ఉంది.
మనిషిని చంపి మూటలో చుట్టిపడేయటం లాంటి న్యూస్‌లు, సినిమాల్లో సన్నివేశాలన్నీ అతని కళ్ళముందు ఫ్లాష్ అవుతున్నాయి.
వణుకుతున్న చేతులతో మూటను సమీపించాడు.
అప్పుడే అతని ఫోన్ మోగటం మొదలైంది.

***(ఇంకా వుంది)***

# పట్టపగలే చీకటి!

భూగోళ చరిత్రలో మరో అద్భుతానికి రంగం సిద్ధం అవుతోంది. ఇప్పటివరకు ఎన్నో గ్రహణాలు చూశాం. కానీ ఈసారి రాబోయే సంపూర్ణ సూర్య గ్రహణం ఆషామాషీ కాదు. రెండు నిమిషాలసేపు సూర్యుడు పూర్తిగా అదృశ్యం కాబోతున్నాడట! ఈ అద్భుత దృశ్యం 2017 ఆగస్టు 21వ తేదీన అమెరికా ఖండంలో సంభవించబోతోంది. మిట్టమధ్యాహ్నం చిమ్మ చీకటి కమ్ముకోనున్నదట. పట్టపగలు, మిట్టమధ్యాహ్నం చిమ్మ చీకటి మానవ సమాజానికి ఒక గొప్ప అనుభూతి!! శాస్త్రవేత్తలకు ఆ రోజు ఇక పండగే పండగ!

1991 జూలై 11న హవాయ్ వాసులు ఎంజాయ్ చేసిన తర్వాత ఈ టోటల్ సోలార్ ఎక్లిప్స్ 38 ఏళ్ళలో మళ్ళీ ఇదే. 1979 ఫిబ్రవరి 26 నాటి సూర్యగ్రహణాన్ని వాతావరణ అనుకూలతవల్ల ప్రజలు చూడలేకపోయారు.

సూర్యుడు-భూమి మధ్యలోకి చంద్రుడు రావడం... ఈ ముగ్గురు ఒకే సరళరేఖలో ఉండటం సూర్య గ్రహణం. అలా కాకుండా సూర్యుడు - చంద్రుడు



మధ్యలోకి భూమి రావడం... ఈ మూడూ ఒకే సరళ రేఖలోకి రావడం చంద్రగ్రహణం. కానీ నిజానికి చంద్రగ్రహణాలకంటే సంపూర్ణ సూర్యగ్రహణాలే ఎక్కువగా సంభవిస్తాయి. కానీ మనం చూడగలిగేది ఎక్కువ చంద్రగ్రహణాలే.

ఈ ఏడాది ఆగస్టు 21న అంతరిక్ష అద్భుతం తిలకించేందుకు వందలాదిమంది శాస్త్రవేత్తలు, రోదసీ ఔత్సాహికులు సన్నద్ధమవుతున్నారు. దీనికి సంబంధించిన రకరకాల విషయాలు, ముందు జాగ్రత్త కబుర్లు సంచలనం సృష్టిస్తున్నాయి. మిట్టమధ్యాహ్నం రెండు నిమిషాలసేపు చిమ్మ చీకటి ఆవరించుకోనున్నది. ఆ రోజు వాతావరణం కనుక బాగా అనుకూలిస్తే చూసి ఎంజాయ్ చేయడానికి ఇంకా ఎంతో బాగుంటుందంటున్నారు. ఈ టోటల్ సోలార్ ఎక్లిప్స్‌ని సౌత్ కరోలినా ప్రజలు ఎంతోబాగా ఎంజాయ్ చేయగలుగుతారట. దీనిని చరిత్రలో బెస్ట్ స్కై ఈవెంట్‌గా పేర్కొంటున్నారు.

దీని తర్వాత 2024 ఏప్రిల్ 8న మూడు నుండి నాలుగు నిమిషాలసేపు, తిరిగి 2044 ఆగస్టు 23న, ఆ తర్వాత వరుసగా 2045, 2052, 2078లలో కూడా ఇదే తరహాలో సూర్యుడు పట్టపగలు అదృశ్యమై పోతాడట.






**ఒయాసిస్**

**(అపరాధ పరిశోధనా నవల)**

**రచయిత:** శ్రీధర

పేజీలు: 175

**కాపీలకు:** వేద ప్రచురణలు, 8-53 గౌతమ్ నగర్, దిల్‌షుక్ నగర్, హైదరాబాద్ - 500060

జీవితం ఎప్పుడూ విలువైనదే! ఆవేశంలో చేసే తప్పులకి మూల్యం చెల్లించుకోక తప్పదు అనే చిన్న కోణాన్ని అర్థం చేసుకుంటే నేరాలు జరగవని, ఈ నవల్లో చెప్ప కనే చెప్పారు రచయిత శ్రీధర. ఎన్నో మలుపులతో, మరెన్నో కోణాలతో, చివరివరకూ హంతకుడు ఎవరో తెలియకుండా నవల సాగిన తీరు ఎంతో థ్రిల్లింగ్‌గా, ఆసక్తికరంగా ఉంది. ఆ రకంగా చూస్తే రచయిత దీన్ని డిటెక్టివ్ నవలగా తీర్చిదిద్దటంలో విజయం సాధించారనే చెప్పవచ్చు.

**అనూహ్య పెళ్ళి** **(నవల)**

**రచయిత:** సలీం

**పేజీలు:** 256, **వెల:** 150/-

**ప్రతులకు:** విశాలాంధ్ర బుక్‌హౌస్- అన్ని బ్రాంచీలు, నవోదయ బుక్‌హౌస్, కాచిగూడ, హైదరాబాద్.

సలీం, ఫ్లాట్‌నెం. 306, జె.బి. అపార్ట్‌మెంట్స్, దోమలగూడ, హైదరాబాద్.

సమాజంలోని సమస్యలను తనదైన శైలిలో ఆవిష్కరిస్తూ పాఠకులపై తనదైన ముద్రవేసిన రచయిత సలీం ఓ సున్నితమైన అంశాన్ని నవలకు ఇతివృత్తంగా మలచుకున్నారు. కథాగమనంలో ఎక్కడా ఆగకుండా, ఆద్యంతం చిన్న చిన్న అంశాలను కూడా హైలైట్ చేస్తూ సాగించారు నవలని.



ప్రేమకు కులాలు, మతాలు అడ్డురావు. కాని పెళ్ళికి ఆ రెండూ చూస్తారు. కుల మతాల అడ్డుగోడలని కాదని పెళ్ళి చేసుకున్నవారి జీవితంలో ఎదురయ్యే కష్టనష్టాలు... పిల్లల పేర్ల దగ్గర నుంచి పెళ్ళిదాకా తలెత్తే ఇబ్బందులు... సమాజంలో కులమతాల అంశం ఏవిధంగా తన ప్రభావాన్ని చూపిస్తూ, పాతుకుపోయి ఉందో... ఇత్యాది అంశాల సమాహారమే 'అనూహ్య పెళ్ళి'. పాఠకుడి మనస్సుని స్పృశిస్తూ, ఆలోచింపచేస్తూ సాగే నవల అనడంలో సందేహం లేదు.



**నిండునూరేళ్లు** **(నవల)**

**రచయిత:** సింహప్రసాద్

**పేజీలు:** 200

**వెల:** 140/-

**ప్రతులకు:** శ్రీశ్రీ ప్రచురణలు 401, మయూరి ఎస్టేట్స్, మిగ్- 11/650, కెపీహెచ్‌బీ, హైదరాబాద్ - 500085.

సెల్: 98490 61668

మరియు అన్ని ప్రధాన పుస్తక కేంద్రాలు.

పంట పండకపోయినా ఆత్మహత్య, ఉద్యోగ బాధ్యతల్లో ఒత్తిడి పెరిగినా ఆత్మహత్య, ప్రేమ విఫలమైనా ఆత్మహత్య... ఆధునిక సమాజం ఎటుపోతోంది? ఇలాంటి సున్నిత అంశాలను ప్రస్తావిస్తూ తనదైన శైలిలో నవలను నడిపించారు రచయిత సింహప్రసాద్. తనకోసమే కాక ఎదుటివారికోసం కూడా కొంత సమయాన్ని కేటాయించాలని చెప్పకనే చెబుతున్నారు. నవల ప్రారంభమే అనూహ్యంగా ఓ ఫోన్ మెసేజ్‌తో ప్రారంభమవటం... పాఠకుల్లో ఉత్సుకత కలిగిస్తుంది. ఒక ప్రేమ జంట భవిష్యత్తు కోసం పడే ఆరాటం ఈ నవల్లో కనిపిస్తుంది. ఆద్యంతం సస్పెన్స్‌తో సాగే నవల ఇది.

**అనగనగా ఒక రోజు** **(నవలిక)**

**రచయిత్రి:** గంటి భానుమతి

**పేజీలు:** 95

**ధర:** 100/-

**ప్రతులకు:** గంటి భానుమతి, మల్లాపూర్, హైదరాబాద్- 599 076.

**ఫోన్:** 040- 27151439

**సెల్:** 8897 643 009 మరియు

అన్ని ప్రముఖ పుస్తక దుకాణాలు

ఇద్దరు కలిసి బతకాలంటే ప్రేమ, అభిమానం ఉంటే సరిపోదు... ఒకరిని ఒకరు అర్థం చేసుకోగలగాలి. ఒకరికోసం ఒకరు



అన్నట్టుగా ఉండాలి. ఇదే అంశాన్ని తీసుకుని ఓ మినీ నవలగా తీర్చిదిద్దారు గంటి భానుమతి. తనదైన ఆలోచనాత్మక వివరణతో ఢిల్లీ నేపథ్యంలో కేవలం మూడంటే మూడే పాత్రల చుట్టూ నవలను ఆసక్తికరంగా మలిచారు. పాఠకులను చివరిదాకా ఆగకుండా చదివిస్తుందనడంలో సందేహం లేదు.

**- లక్ష్మీ నర్మద**

# సౌభాగ్య చక్రం

ఫిబ్రవరి 1 నుంచి
ఫిబ్రవరి 7 వరకు

శ్రీ బిజుమళ్ళ బిందుమాధవశర్మ



## మేషం (మార్చి 21 - ఏప్రిల్ 20 మధ్య పుట్టినవారు)

పెట్టుబడులు, సమావేశాలు, ప్రేమానుబంధాలు, వేడుకలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధ, గురువారాల్లో ఆర్థిక విషయాల్లో సన్నిహితుల సహకారం లభిస్తుంది. బృందకార్యక్రమాల్లో పాల్గొంటారు. స్నేహానుబంధాలు బలపడతాయి. 3, 4 తేదీల్లో పెట్టుబడుల్లో ఆచితూచి వ్యవహరించాలి. వేడుకల్లో ఖర్చులు అంచనాలు మించుతాయి. రుణప్రయత్నాలు ఫలిస్తాయి. 5, 6, 7 తేదీల్లో సోదరీసోదరుల విషయాల్లో శుభపరిణామాలు సంభవం. విలువైన పత్రాలు అందుకుంటారు. కొత్త పరిచయాలు ఏర్పడతాయి. స్టేషనరీ, బోధన, రవాణా, మీడియారంగాల వారికి శుభప్రదం.



## వృషభం (ఏప్రిల్ 21 - మే 21 మధ్య పుట్టినవారు)

పెట్టుబడులు, కొత్త ప్రాజెక్టులు, వేడుకలు, చర్చలు, విద్యా విషయాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురువారాల్లో సినీ, రాజకీయ రంగాల వారికి శుభప్రదం. వృత్తి, వ్యాపారాలకు సంబంధించి కీలక సమాచారం అందుకుంటారు. ఇంటర్వ్యూలలో విజయం సాధిస్తారు. 3, 4 తేదీల్లో పెద్దల వైఖరి మనస్తాపం కలిగిస్తుంది. పైఅధికారుల నుంచి మాటపడాల్సి వస్తుంది. లక్ష్య సాధనకు అధికంగా శ్రమించాలి. 5, 6, 7 తేదీల్లో వృత్తి, వ్యాపారాల్లో ప్రోత్సాహకరం. అదనపు ఆదాయం సమకూర్చుకుంటారు. ఆర్థిక విషయాల్లో పెద్దల సహకారం అందుకుంటారు.



## మిథునం (మే 22 - జూన్ 21 మధ్య పుట్టినవారు)

ఉన్నత విద్య, ప్రణాళికలు, దూరప్రయాణాలు, ఆర్థిక వ్యూహాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురువారాల్లో బంధుమిత్రులతో ఉల్లాసంగా గడుపుతారు. ప్రదర్శనలు, వేడుకల్లో పాల్గొంటారు. ఆర్థికపరమైన వ్యూహాలు ఫలిస్తాయి 3, 4 తేదీల్లో సినీ, రాజకీయ రంగాల వారికి చిక్కులు ఎదురయ్యే అవకాశం ఉంది. ఒక సమాచారం కలవరపెడుతుంది. సమావేశాలు ఫలిస్తాయి. 5, 6, 7 తేదీల్లో ప్రణాళికాబద్ధంగా వ్యవహరించి లక్ష్యాలు సాధిస్తారు. వ్యూహాత్మకంగా వ్యవహరించి లక్ష్యాలు సాధిస్తారు. ఉన్నత విద్య, విదేశీ వ్యవహారాలకు అనుకూలం. రవాణా, బోధన రంగాలవారికి ప్రోత్సాహకరం.



## కర్కాటకం (జూన్ 22 - జులై 22 మధ్య పుట్టినవారు)

పెట్టుబడులు, సంస్మరణలు, బ్యాంకులు, అర్థిక సంస్థలతో పనులు, ఆరోగ్యంపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురువారాల్లో పెద్దల ఆరోగ్యంపై శ్రద్ధ చూపుతారు. గత అనుభవంతో ఆర్థిక లక్ష్యాలు సాధిస్తారు. సంస్మరణల్లో పాల్గొంటారు. 3, 4 తేదీల్లో ఆర్థిక వ్యవహారాల్లో ఆచితూచి వ్యవహరించాలి. రుణప్రయత్నాలు ఫలించకపోవచ్చు. ఖర్చులు అధికం. విలువైన వస్తువులు కొనుగోలు చేస్తారు. 5, 6, 7 తేదీల్లో విరాళాలు, చందాలకు వెచ్చిస్తారు. పన్నులు, బీమా వ్యవహారాలకు అనుకూలం. చిన్నారులు, ప్రియతములకు సంబంధించి రహస్య సమాచారం తెలుసుకుంటారు.



## సింహం (జులై 23 - ఆగస్టు 23 మధ్య పుట్టినవారు)

పెట్టుబడులు, సమావేశాలు, వేడుకలు, జనసంబంధాలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధ, గురువారాల్లో వేడుకలు, సమావేశాల్లో కీలక పాత్ర పోషిస్తారు. కొత్తపరిచయాలు ఏర్పడతాయి. ప్రియతములతో ప్రయాణాలు ఉల్లాసం కలిగిస్తాయి. 3, 4 తేదీల్లో పెద్దలు, పైఅధికారుల వైఖరి మనస్తాపం కలిగిస్తుంది. గౌరవానికి భంగం కలిగే సంఘటనలు జరుగుతాయి. సమావేశాల్లో కీలక పాత్ర పోషిస్తారు. 5, 6, 7 తేదీల్లో బంధుమిత్రులతో ఉల్లాసంగా గడుపుతారు. ఆర్థిక పరిస్థితి ప్రోత్సాహకరం. ఒక సమాచారం ఆనందం కలిగిస్తుంది. స్పెక్యులేషన్లు లాభిస్తాయి.



## కన్య (ఆగస్టు 24 - సెప్టెంబర్ 22 మధ్య పుట్టినవారు)

ఆరోగ్యం, కొత్తపనుల ప్రారంభం, వృత్తిపరమైన వ్యూహాలు, సమావేశాలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధ, గురువారాల్లో ఆరోగ్యం పట్ల శ్రద్ధ చూపిస్తారు. రుణప్రయత్నాలు ఫలిస్తాయి. బీమా, గ్రాట్యుటీ, పన్నుల వ్యవహారాలకు అనుకూలం. 3, 4 తేదీల్లో వృత్తి, వ్యాపారాల్లో అంచనాలు తప్పే అవకాశం ఉంది. సన్నిహితుల ఆరోగ్యం కలవరపెడుతుంది. ఉద్యోగపరమైన సమావేశాలపై దృష్టి సారిస్తారు. 5, 6, 7 తేదీల్లో ప్రముఖులను కలుసుకుంటారు. వృత్తి, వ్యాపారాల్లో ప్రోత్సాహకరంగా ఉంటుంది. పెద్దల ఆరోగ్యం మెరుగవుతుంది. పరిశ్రమలు, వ్యవసాయ రంగాల వారికి శుభప్రదం.



## తుల (సెప్టెంబర్ 23 - అక్టోబర్ 23 మధ్య పుట్టినవారు)

సమావేశాలు, వేడుకలు, ప్రేమానుబంధాలు, పెట్టుబడులపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురువారాల్లో శ్రీవారు, శ్రీమతి విషయాల్లో శుభపరిణామాలు సంభవం. ఆర్థిక పరిస్థితి ప్రోత్సాహకరంగా ఉంటుంది. స్పెక్యులేషన్లు లాభిస్తాయి. 3, 4 తేదీల్లో పెట్టుబడుల్లో ఆచితూచి వ్యవహరించాలి. ప్రియతముల ఆరోగ్యం కలవరపెడుతుంది. ఖర్చులు అధికం. 5, 6, 7 తేదీల్లో ప్రియతములతో వేడుకల్లో పాల్గొంటారు. ఉన్నత విద్యా విషయాలు, ప్రయాణాలకు అనుకూలం. ప్రేమానుబంధాలు బలపడతాయి. సందేశాలు, మెయిల్స్ ఉత్సాహం కలిగిస్తాయి.



## వృశ్చికం (అక్టోబర్ 24 - నవంబర్ 22 మధ్య పుట్టినవారు)

బదిలీలు, వృత్తి, వ్యాపారాలు, గృహరుణాలు, వేడుకలకు ఈ వారం అనుకూలం. బుధ, గురువారాల్లో బదిలీ ప్రయత్నాలు ఫలిస్తాయి. సీటు, స్థలమార్పు కోసం చేసే ప్రయత్నాలకు అనుకూలం. మెడికల్, హోటల్, రిటైల్ రంగాల వారికి ప్రోత్సాహకరం. 3, 4 తేదీల్లో శ్రీవారు, శ్రీమతి వైఖరి మనస్తాపం కలిగిస్తుంది. సమావేశాల్లో మాటపడాల్సి వస్తుంది. వేడుకల్లో అసౌకర్యం కలిగే అవకాశం ఉంది. 5, 6, 7 తేదీల్లో అడ్వాన్సులు, రుణాలు అందుకుంటారు. ఆర్థిక విషయాల్లో గత అనుభవంతో లక్ష్యాలు సాధిస్తారు. సంస్మరణల్లో పాల్గొంటారు. కుటుంబ సభ్యుల సహకారంతో ఆర్థికపరమైన లక్ష్యాలు సాధిస్తారు.



## ధనుస్సు (నవంబర్ 23 - డిసెంబర్ 21 మధ్య పుట్టినవారు)

ప్రయాణాలు, సమావేశాలు, పెట్టుబడులు, విద్యా విషయాలు, ఇంటర్వ్యూలకు ఈ వారం ప్రాధాన్యం ఇస్తారు. బుధ, గురువారాల్లో విద్యార్థులకు శుభప్రదం. ప్రియతములతో సంభాషణలు ఫలిస్తాయి. సోదరీసోదరుల విషయాల్లో శుభపరిణామాలు సంభవం. 3, 4 తేదీల్లో వృత్తి, వ్యాపారాలకు సంబంధించిన ఒక సమాచారం కలవరపెడుతుంది. సన్నిహితుల ఆరోగ్యం పట్ల శ్రద్ధ చూపాలి. 5, 6, 7 తేదీల్లో వివాహ నిర్ణయాలకు అనుకూలం. భాగస్వామి విషయంలో శుభపరిణామాలు సంభవం. చర్చలు, సమావేశాల్లో కీలక పాత్ర పోషిస్తారు. సత్ఫలితాలు సాధిస్తారు.



## మకరం (డిసెంబర్ 22 - జనవరి 20 మధ్య పుట్టినవారు)

రుణాలు, పొదుపు పథకాలు, ఇంక్రిమెంట్లు, బోనస్‌లపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధ, గురువారాల్లో రియల్ ఎస్టేట్ రంగంలోని వారికి ఆర్థికంగా ప్రోత్సాహకరం. ఇంటికోసం విలువైన వస్తువులు సమకూర్చుకుంటారు. 3,4 తేదీల్లో చిన్నారులు, ప్రియతములకోసం ఖర్చులు అధికం. పెట్టుబడులు, పొదుపు పథకాల్లో జాగ్రత్త అవసరం. విలువైన వస్తువులు కొనుగోలు చేస్తారు. 5, 6, 7 తేదీల్లో వృత్తి, వ్యాపారాల్లో ప్రోత్సాహకరంగా ఉంటుంది. అదనపు ఆదాయం కోసం చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి. వైద్య, పరిశ్రమలు, నిత్యావసరాల రంగాల వారికి ఆర్థికంగా ప్రోత్సాహకరం.



## కుంభం (జనవరి 21 - ఫిబ్రవరి 18 మధ్య పుట్టినవారు)

విద్య, వేడుకలు, సమావేశాలు, ప్రయాణాలు, ఆర్థిక నిర్ణయాలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధ, గురువారాల్లో విద్యార్థులకు శుభప్రదం. కాంట్రాక్టులు, అగ్రిమెంట్లు, చర్చలకు అనుకూలం. రిప్రజెంటేటివ్‌లు, ఏజెంట్లకు శుభప్రదం. 3, 4 తేదీల్లో కుటుంబ వ్యవహారాలు మనస్తాపం కలిగిస్తాయి. రియల్ ఎస్టేట్, నిర్మాణరంగాల వారికి చిక్కులు ఎదురయ్యే అవకాశం ఉంది. మార్పులకు అనుకూల సమయం కాదు. 5, 6, 7 తేదీల్లో ప్రేమానుబంధాలు బలపడతాయి. సృజనాత్మకంగా వ్యవహరించి లక్ష్యాలు సాధిస్తారు. కొత్త ఆలోచనలు స్ఫురిస్తాయి. ఆర్థిక పరిస్థితి ప్రోత్సాహకరం.



## మీనం (ఫిబ్రవరి 19 - మార్చి 20 మధ్య పుట్టినవారు)

దీర్ఘకాలిక పెట్టుబడులు, ప్రయాణాలు, వేడుకలు, సమావేశాలు, సంస్మరణలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధ, గురువారాల్లో పెట్టుబడులు లాభిస్తాయి. ఉన్నత విద్య, దూరప్రయాణాలకు అవసరమైన నిధులు సర్దుబాటవుతాయి. 3, 4 తేదీల్లో ఒక సమాచారం కలవరపెడుతుంది. డ్రైవింగ్‌లో నిదానం అవసరం. వాగ్వివాదాలకు దూరంగా ఉండాలి. 5, 6, 7 తేదీల్లో రియల్ ఎస్టేట్ రంగంలోని వారికి శుభప్రదం. వాయిదా పడుతున్న పనులు ఒక కొలిక్కి వస్తాయి. దూరంలో ఉన్న కుటుంబ సభ్యుల రాకతో ఇంట్లో సందడి వాతావరణం నెలకొంటుంది.




## సహజనటికి సంతృప్తినిచ్చిన పాత్ర

సహజనటి ఎవరో గుర్తుపట్టే ఉంటారు. ఇంకెవరు? జయసుధ! ఇప్పటి వరకూ ఎన్నో సినిమాలు చేశారు, చేస్తున్నారు. తన కెరీర్‌లో ఇన్ని సినిమాలు చేసినా రెండు సినిమాలు మాత్రమే గుర్తుండిపోతాయట! ఒకటి 'ప్రేమాభిషేకం'. రెండవది 'శతమానం భవతి' సినిమానట! ఈ మధ్య కాలంలో ఇంత మంచిపాత్ర తనకు రాలేదని చెప్పుకొచ్చింది జయసుధ. ఈ సినిమా చేసినందుకు చాలా సంతృప్తిగా అనిపించిందనీ, సినిమా విజయవంతం అయినందుకు మరింత సంతోషంగా ఉందనీ అంటోంది.

## జోక్యం కాదు జాగ్రత్త!

దర్శకత్వంలో తాను జోక్యం చేసుకుంటాననీ, దర్శకులను పని చేయనివ్వనని వస్తున్న విమర్శలను నిర్మాత దిల్‌రాజు కొట్టిపడేశారు. తనది జోక్యం కాదనీ, జాగ్రత్త అనీ ఆయన సవరించారు. తన సినిమాలో ప్రతి సన్నివేశం పర్‌ఫెక్ట్‌గా రావాలని నిర్మాతగా కోరుకోవడం తప్పు కాదుగా? అని ఆయన ప్రశ్నించారు. రషెస్ చూసినప్పుడు కొన్నిసార్లు ఓ సన్నివేశాన్ని అంతకన్నా బాగా చేయవచ్చు అనిపించినప్పుడు మార్చమంటాననీ, అలా ఓ సినిమా మూడు నెలలు షూటింగ్ అయిపోయిన తరువాత చూస్తే సినిమా తనకు నచ్చలేదని, తర్వాత దాన్ని రీషూట్ చేయించానని చెప్పుకొచ్చారు. ఇదంతా సినిమా బాగా రావడానికే తప్ప అందులో తన వ్యక్తిగత ఇష్టాయిష్టాలకు తావు ఉండదని స్పష్టం చేశారు. ఆ సినిమా రీషూట్ చేయించకపోతే ఫ్లాప్ అయ్యేదని చెప్పుకొచ్చారు. అనవసరంగా తనను విమర్శించడం మానుకోవాలని హితవు పలికారు.



## రేఖ వయస్సు తగ్గిందా?

కొందరిని చూస్తే ఈ మాట అనిపించక మానదు. ముఖ్యంగా రేఖను చూస్తుంటే ఇప్పటికీ బ్యూటీక్వీన్ అనాలనిపిస్తుంది. ఆమె తోటినటి జయాబచ్చన్ ముసలిదానిలాగా కనిపిస్తుంటే రేఖ మాత్రం ఇప్పటికీ నాలుగు పదుల వయస్సు ఉన్నదానిలా కనపడుతుంది. చీర కట్టినా, డ్రెస్సు వేసినా రేఖ స్టయిలే వేరు అంటారు. మొన్నటి వరకూ ఏ కార్యక్రమంలోనైనా నిండుగా చీరలో కనిపించే రేఖ ఉన్నట్టుండి ఓ కార్యక్రమానికి జీన్స్ ప్యాంటులో దర్శనమిచ్చింది. ఆరుపదుల వయస్సులో కూడా జీన్స్‌ప్యాంటులో కుర్ర హీరోయిన్లకి పోటీ ఇచ్చే విధంగా కనిపించి కనువిందు చేసింది. ఆ కార్యక్రమంలో రేఖను చూసిన వారందరూ రేఖ వయస్సు తగ్గిందా? ఏ చిట్కాలు పాటిస్తోంది? అని చర్చించుకున్నారట!

## ఆ సినిమా వద్దనుకున్నాడట!



రాఘవేంద్రరావుగారి 'నమో వెంకటేశాయ' సినిమా గురించిన వివరాలు అప్పుడప్పుడు బయటకు వస్తున్నాయి. ఆ సినిమాలో వేంకటేశుని పాత్ర పోషించిన సౌరభ్ జైన్ ఇప్పుడో కొత్త విషయం బయటపెట్టాడు. ఉత్తరాదిన శ్రీకృష్ణుడు, రాముడు లాంటి పాత్రలు పోషించిన అనుభవం సౌరభ్‌కు ఉంది. అందుకే రాఘవేంద్రరావుగారు ఈసారి సుమన్‌కి కాకుండా సౌరభ్‌కు అవకాశం ఇచ్చారు. ఇదంతా ఒక ఎత్తయితే రాఘవేంద్రరావుగారి నుంచి ఫోను వచ్చినప్పుడు ఈ సినిమా చేయకూడదన్న నిర్ణయంతోనే ఇక్కడకు వచ్చాడట! కానీ కథ విన్న తరువాత తన నిర్ణయం మార్చుకున్నాడట! ఇక్కడకు రాకుండా ఈ పాత్రకు నో చెప్పి ఉంటే తన కెరీర్‌లో ఓ మంచి సినిమాను కోల్పోయేవాణ్ణి. ఆ బాధ జీవితాంతం వెంటాడేది అంటూ చెప్పుకొచ్చాడు. ముందు భాష ఇబ్బందిగా అనిపించినా, డైరెక్టర్ గారు ట్యూటర్‌ని పెట్టించడంతో ఈజీ అయింది అంటున్నాడు.

# ఆయనే కారణం

-శ్రియా శరన్

**ఎం**తో 'ఇష్టం'తో సినిమాల్లోకి వచ్చి...'నేనున్నా'నంటూ ప్రేక్షకులకు 'సంతోషం' అందించిన వన్నెతరగని అందం 'వాశిష్ఠీదేవి'ది. ఈ పాటికే ఆ అందాల భరిణె ఎవరో తెలిసిపోయుంటుంది. ముప్పైనాలుగు సంవత్సరాల వయస్సులో కూడా పాతికేళ్ల పడుచులా తన అందాలతో యువతను గిలిగింతలు పెట్టగలిగే శక్తి శ్రియ సొంతం. శ్రియ పని అయిపోయింది అనుకున్నప్పుడల్లా తనలో ఇంకా సత్తా తగ్గలేదని ఎప్పటి కప్పుడు నిరూపించుకుంటూనే ఉంది. ఇప్పుడు మరోసారి 'గౌతమిపుత్ర'లో తన అందాల సునామీతో తెలుగు ప్రేక్షకులను పులకింప చేసిన శ్రియా శరన్‌తో...

**ఇప్పటి వరకూ టచ్ చేయని పాత్ర 'గౌతమిపుత్ర శాతకర్ణి'లో చేయాలని ఎందుకనిపించింది?**

నిజమే. సినిమాల్లోకి వచ్చి ఇంత కాలం అయినా చారిత్రాత్మక సినిమాల జోలికి పోలేదు. నేను వాటికి సరిపోను అన్నది నా అనుమానం. ఈ సినిమా చేయడానికి ముఖ్య కారణం డైరెక్టర్ క్రిష్‌గారు. ఆయన తన సినిమాల్లో హీరోయిన్ల పాత్రకి ఎంత ప్రాముఖ్యం ఇస్తారో తెలుసు. అందుకే ఆయన సినిమా ఒక్కటన్నా చేయాలని అనుకునేదాన్ని. అనుకోకుండా 'గౌతమిపుత్ర శాతకర్ణి'లో వాశిష్ఠి పాత్ర నా దగ్గరకి రావడంతో మరో ఆలోచన లేకుండా ఒప్పేసుకున్నాను. ఈ సినిమా ఒప్పుకోవడానికి మరో ముఖ్య కారణం కూడా ఉంది. బ్రిటీష్ కాలానికన్నా ముందు జరిగిన చరిత్ర గురించి చాలా మందికి తెలియదు. కొన్ని కథలైతే వాడుకలోనే లేవు. అలాంటిదే గౌతమిపుత్ర శాతకర్ణి కథ. అలాంటి తెలియని కథను ఇప్పటి తరానికి తెలియజెప్ప డానికి క్రిష్ ప్రయత్నించారు. ఆయన ప్రయత్నంలో నేనూ ఒక భాగం అయినం దుకు చాలా సంతోషంగా ఉంది. ఈ సినిమా గురించి ఇప్పుడే కాదు, ముందు తరాల వారు కూడా మాట్లాడుకుంటారు. చరిత్ర తిరగరాస్తుంది అంటారే, అలాంటిది ఈ సినిమా. ఇందులోని పాత్ర చరిత్ర లోనే కాదు, నా మనస్సులో కూడా చిరస్థాయిగా నిలిచిపోతుంది. ఇప్పటి వరకూ ఎన్నో సినిమాలు చేశాను. ఇక ముందు కూడా చేస్తాను. కానీ ఇలాంటి పాత్ర మళ్లీ చేయలేను అని గట్టిగా చెప్పగలను.

**పాత్ర కోసం ఎలాంటి జాగ్రత్తలు తీసుకున్నారు?**

కథ మొత్తం ముందే వినడంతో నా పాత్ర గురించిన అవగాహన వచ్చింది. దానికి తోడు క్రిష్ గారు మరికొన్ని సూచ నలు చేశారు. వాటిని తూచా తప్పకుండా ఫాలో అయ్యాను. ముందు రోజు రాత్రి కొంత హోంవర్క్ చేసేదాన్ని.

**సీనియర్ నటి హేమమాలినితో చేయడం ఎలా ఉంది?**

ఆవిడ ఎంత ప్రొఫెషనల్ అన్నది ఈ సినిమా షూటింగ్ సమయంలో నాకు బాగా తెలి సింది. షూటింగ్‌కి పేకప్ చెప్పేసినా, బాలకృష్ణగారూ,

ఆవిడా కూర్చుని మరుసటి రోజు సన్నివేశాల గురించి డిస్కస్ చేసేవారు. నిజంగా సీనియర్లు సీనియర్లే! ఇప్పటి వారిలో అంత డెడికేషన్ కనిపించదు. వృత్తిపట్ల ఎంత అంకితభావంతో మెలగాలో ఆవిడని చూసి నేర్చుకున్నాను. అలా అని అంతకు ముందు అంకితభావం లేదు అని కాదు కానీ, మరుసటి రోజు షూటింగ్ గురించి ఆలోచించలేదు. ఇప్పుడు దాన్ని నేను అలవాటు చేసుకున్నాను.

**బాలకృష్ణతో రెండోసారి నటించినట్టున్నారు?**

'చెన్నకేశవరెడ్డి' సినిమా సమయంలో నేను బాగా చిన్నదాన్ని. ఇంకా బాగా చెప్పాలంటే ఇప్పుడున్నంత అవగాహన అప్పుడు లేదు. డైరెక్టర్ చెప్పినట్టు డ్యాన్స్ చేయడం, నటించడం, వెళ్లిపోవడం వరకే! ఆయనతో మాట్లాడేటంత చనువు ఉండేది కాదు. ఇప్పుడు నాలో మెచ్యూరిటీ బాగా వచ్చింది. కాలం మారిందే తప్ప అప్పటికీ ఇప్పటికీ ఆయనలో ఏ మార్పూ లేదు. అదే ఫ్రెండ్లీ నేచర్! ఈ సినిమాలో నాకు అవకాశం ఇవ్వడం ఆయన నాకు ఇచ్చిన గొప్ప వరం. ఇంతకన్నా ఏం చెప్పగలను?

**మెచ్యూరిటీతో పాటు అందం కూడా పెరిగినట్టుంది?**

చాలామంది ఇదే మాట అంటున్నారు. మునుపటి కన్నా ఈ సినిమాలో చాలా అందంగా కనిపించావని కాంప్లిమెంట్ ఇస్తున్నారు. అదంతా క్రిష్‌గారి గొప్పతనం. వాశిష్ఠి పాత్ర ఎలా ఉండాలి? ఎంత అందంగా చూపించాలి? ఎలాంటి కాస్ట్యూమ్స్ ఉపయోగించాలి? అన్న దాని మీద క్రిష్‌గారు బాగా వర్క్ చేశారు. తన ఆలోచనలు ఎప్పటికప్పుడు మేకప్‌మెన్‌కి చెబుతూ నన్నూ, నా పాత్రను అలాగే తీర్చిదిద్దేవారు. అందుకే అంత అందంగా కనిపించగలిగాను.



**అందంగా కనిపించడంలో మీ గొప్పతనం లేదంటారు?**

అలా అని కాదు. సహజంగా అందంగా ఉంటేనే తెర మీద మరింత అందంగా కనిపిస్తాం. అందంగా. నాజూకుగా ఉండడం అనేది నా జీన్స్‌లోనే ఉంది. మా ఫ్యామిలీలో ఎవరూ అంత త్వరగా వృద్ధులుగా కనిపించరు. దాదాపు అందరూ తమ వయసు కన్నా పది పదిహేను సంవత్సరాలు చిన్నగానే కనిపిస్తారు, అదీ మేకప్ లేకుండా. వారి పోలికలే నాకూ వచ్చాయి. ముఖంలో వయస్సు అంతగా కనిపించదు. దీనికి ఒక కారణం ఉంది. ఎప్పుడూ సంతోషంగా ఉండడం. సమస్యలు అందరికీ ఉంటాయి. కొందరు వాటి గురించి అనవసరంగా ఎక్కువగా ఆలోచించి హైరానా పడిపోతుంటారు. దాని ప్రభావం వారి ముఖంలో స్పష్టంగా కనిపిస్తుంది. మా మదర్ ఒక్కటే చెబుతారు. సమస్య ఎంత జటిలమైనదైనా సరే కొద్దిసేపు దాని గురించి ఆలోచించవద్దంటుంది. ఆ టైములో ఏదైనా మంచి కామిక్ బుక్ చదవడమో లేదా జోక్స్ చదువుకోమంటుంది. ఈ రెండూ కుదరకపోతే ఓ పది నిమిషాలు బెస్ట్ ఫ్రెండ్‌తో మాట్లాడు అంటుంది. దీని వల్ల మైండ్ కొద్దిగా డైవర్ట్ అవడమే కాదు రీఫ్రెష్ అవుతుంది కూడా. అంతవరకూ పెద్దగా కనిపించిన సమస్య చిన్నదిగా కనిపిస్తుంది. నాకూ బోలెడన్ని సమస్యలు ఎదురవుతూ ఉంటాయి. వాటి పరిష్కారంలో నేను పాటించే సూత్రం ఇదే! సమస్య పరిష్కారంతో పాటు నా అందాన్ని అలా కాపాడుకుంటూ వస్తున్నాను.

ఎట్టి పరిస్థితిలోనూ ఎక్కడున్నా యోగా చేయడం మానను. దీనితో మానసిక ప్రశాంతత లభిస్తుంది.

**ఇన్ని సంవత్సరాలుగా హీరోయిన్‌గా కొనసాగుతున్నారు కదా? ఎలా అనిపించింది?**

ఈ ప్రశ్న భారతీయ సినిమా రంగంలో మాత్రమే వినిపిస్తుంది. హాలీవుడ్‌లో వినపడదు. నటించడానికి వయస్సుతో పనిలేదు అన్నది నా అభిప్రాయం. ఇక్కడ ఒక విషయం చెప్పాలి. చాలా చిన్న వయస్సులో అంటే పదిహేడేళ్ళకే



సినిమా రంగానికి వచ్చాను. దాంతో నేను చాలా సంవత్సరాలుగా హీరోయిన్‌గా కొనసాగుతున్న అభిప్రాయం కలుగుతోంది. మంచి పాత్రలు వస్తే నటించడానికి వయస్సుతో సంబంధం లేదు. ఈ విషయంలో నాకు ఆదర్శం అమితాబ్‌గారే! ఈ వయస్సులో కూడా ఆయన మంచి మంచి పాత్రలు చేస్తున్నారు. ఇప్పుడు నాకు 34 సంవత్సరాలు. ఇంకో 30 సంవత్సరాల వరకూ నటిస్తూనే ఉంటాను.

**గౌతమిపుత్ర శాతకర్ణి తరువాత సినిమాలు ఒప్పుకున్నట్టు లేదు?**

నాకు సినిమాలు లేవు అన్న సమస్య ఎప్పుడూ లేదు. ఈ సినిమా కన్నా ముందు కూడా తెలుగులో చేస్తూనే ఉన్నాను. ఈ సినిమాతో ఇప్పుడు నాకంటూ ఓ ఇమేజ్ వచ్చింది. వచ్చిన ప్రతి అవకాశాన్ని ఒప్పుకుని ఆ ఇమేజ్ పోగొట్టుకోను. నాకు వచ్చిన పేరు పోకుండా ఉండే మంచి అవకాశం వస్తే తప్పకుండా చేస్తాను.

**అంటే మళ్లీ చారిత్రాత్మక సినిమానే చేస్తారా?**

నా మాటలకు అర్థం అది కాదు. ఏ సినిమా అయినా శ్రియ బాగా చేసింది అన్న పేరు రావాలి. అంతే! ఇంత వరకూ వేటికీ ఓకే చెప్పలేదు.

**బాలీవుడ్‌లో చేస్తున్నారా?**

రెండు సినిమాలు ఒప్పుకున్నాను.

**పెళ్ళెప్పుడు?**

ఆ సమయం వస్తే ఎవరు ఆపినా ఆగదు. సమయం వచ్చినప్పుడు చెబుతాను. ప్రస్తుతానికి ఆ ఆలోచన లేదు.

-చిన్ని

ఇంటర్వ్యూ



**ఆ నాటి సినీ స్వర్ణయుగంలోని గొప్ప నటులతో తెలుగుతెరను పంచుకున్న అదృష్టశాలి, బహుభాషా నటుడు చిట్టిబాబు. తన నవ్వులతో తెలుగు ప్రేక్షకులను మెప్పించి మురిపిస్తూ 700 చిత్రాలకు చేరువ అవుతున్న హాస్యనటుడు. 56 సంవత్సరాల సినీ ప్రస్థానంలో తండ్రులు, కొడుకులు, మనవళ్ళు... మూడు తరాలవారితో నటించారు. ఆ దేవుడు భూమ్మీద ప్రతి మనిషికీ ఒక్కొక్క వేషం ఇచ్చాడు, మన వేషం పర్మినెంట్‌కాదు, దీన్ని న్యాయబద్ధంగా పూర్తి చెయ్యాలి అంటున్న చిట్టిబాబు ఇంటర్వ్యూ ఈ వారం....**

# ఆ దేవుడిచ్చిన ఈ వేషం పర్మినెంట్ కాదు

## - చిట్టిబాబు

తూర్పుగోదావరిజిల్లా, అమలాపురం, కూచిమంచి అగ్రహారంవీధిలో జన్మించాను. మా నాన్నగారు పుణ్యమూర్తుల ఉమామహేశ్వరరావు. అమ్మ వెంకట రమణమ్మ.

మేం తొమ్మండుగురం సంతానం. నలుగురు అన్నదమ్ములు, ఐదుగురు అక్కచెల్లెళ్ళు. మా అన్నయ్య రాజబాబు. తెలుగు ప్రజలకు సుపరిచితుడైన ప్రముఖ హాస్యనటుడు. నేను రెండోవాణ్ణి. మా తమ్ముడు బాబీ. నాలుగోవాడు అనంత్. అతను కూడా నటుడే. ఇప్పటికి 150 చిత్రాల్లో నటించాడు.

నా అసలు పేరు పుణ్యమూర్తుల సూర్య నారాయణమూర్తి. మా మేనత్త దివంగతురాలయ్యాక నేను పుట్టడంతో నన్ను అందరూ ఆమె పేరుతో చిట్టీ చిట్టీ అని పిలిచేవారు. చివరకు ఆ పేరుతోనే చిట్టిబాబుగా మిగిలాను.

నాన్నగారు ప్రభుత్వ ఉద్యోగి కావడంతో ధవళేశ్వరం, రామచంద్రాపురం, కపిలేశ్వరపురం, గంగారం... ఇలా పలుచోట్ల చదువుకున్నాను. కాకినాడలో ఐటిఐ ఎలక్ట్రికల్ ట్రేడ్ చేసి 1962-63లలో అప్రెంటీస్‌గా రాజమండ్రి ఎలక్ట్రిసిటీ బోర్డ్‌లో చేరాను.

### బెస్ట్ కమెడియన్

ఉద్యోగ ప్రయత్నాల్లో భాగంగా సికింద్రాబాద్‌లో మా బావ భోగరాజు పట్టాభిగారింటికి చేరుకున్నాను. ఆయన కాంట్రాక్టరు. చిన్న వయసులో ఉద్యోగం ఎందుకు? మేం చదివిస్తాం అని అక్కయ్య, బావ చెప్పడంతో పగటిపూట ఉద్యోగం, నారాయణగూడ నైట్ కాలేజీలో పి.యు.సి చేశాను. కాలేజీలోనే పినిశెట్టిగారు రచించిన 'ఆడది' నాటికలో నేను చేసిన పాత్రకు బెస్ట్ కమెడియన్ బహుమతి లభించింది. సినీనటుణ్ణి కావడానికి అదే నాకు నాంది. తర్వాత పి.డబ్ల్యు.డి. మింట్ కాంపౌండ్‌లో ఉద్యోగం చేస్తూ 1967-70లో భద్రుకా నైట్ కాలేజీలో బీకాం చదివిన మూడేళ్ళలో సాంస్కృతిక కార్యక్రమాల్లో బెస్ట్ కమెడియన్‌గా పేరు తెచ్చుకున్నాను. నా నటనకు కాలేజీ స్వర్ణ పతకం బహుకరించింది.

### ఎక్స్‌టెంపోర్‌లో బెస్ట్ అవార్డులు

కాలేజీ రోజుల్లో మరో విశేషం కూడా ఉంది. శాండిల్యగారి ఆధ్వర్యంలో 'సెవెన్‌స్టార్ సిండికేట్' అసోసియేషన్‌వారు ఎక్స్‌టెంపోర్ పోటీలు నిర్వహించేవారు. పదినిమిషాల ముందు ఒక కథ చెప్పి దానికి అనుగుణంగా మనం ప్రిపేరై స్టేజీ మీద యాక్షన్ చెయ్యాలి. హైదరాబాద్ రవీంద్ర భారతిలో జరిగే ఈ కార్యక్రమాల్లో నేను బెస్ట్ ఆర్టిస్ట్‌గా వచ్చేవాణ్ణి. ఇందులో మహ్మద్‌బీన్ తుగ్లక్, తిక్కశంకరయ్య డ్రామాలు టి.ఆర్.కృష్ణగారి ఆధ్వర్యంలో ఎన్నో వందల కార్యక్రమాలు చేశాను. సినీనటుడయ్యేందుకు ఇవన్నీ నాకు పునాదిరాళ్ళయ్యాయి.

### చేజారిన సిసింద్రీ చిట్టిబాబు

బీకాంలో ఉన్నప్పుడు ఒక ప్రైవేటు ఆడిటోరియంలో 'మొద్దబ్బాయ్' నాటిక వేశాం. రవీంద్రా ప్రొడక్షన్స్ నిర్మాత తమ్మారెడ్డి కృష్ణమూర్తిగారు ఆ నాటిక చూశారు. పదిరోజుల తర్వాత నన్ను పిలిచారు. నిన్ను హీరోగా పెట్టి 'సిసింద్రీ చిట్టిబాబు' సినిమా తీద్దాం అనుకుంటున్నాను అన్నారు. బీకాం పూర్తికాలేదు, సున్నితంగా వద్దని చెప్పేశాను. దాంతో మా అన్నయ్య రాజబాబుగారితో చెప్పించారు. కానీ తర్వాత నా వయసు ఎక్కువ అవుతుందేమో, ఇంకా చిన్నపిల్లాణ్ణి పెట్టి తియ్యాలని కథా రచయిత పినిశెట్టి, నిర్మాత ఇద్దరూ ఆలోచించుకోవడంతో ఆ చిత్రంలో నేను నటించలేదు. అలా 1970లో నా బదులు మరో నటుణ్ణి ఆ సినిమాకి ఎంపిక చేశారు.

### తొలి చిత్రం పల్లెటూరి బావ

అక్కినేని నాగేశ్వరరావుగారి 'పల్లెటూరి బావ' షూటింగ్ 1970లో సారథి స్టూడియోలో ప్రారంభ

మైంది. హీరోయిన్ లక్ష్మి. మా అన్నయ్య రాజబాబు, రమాప్రభ జోడీ. రమాప్రభ తమ్ముడు పాత్రకోసం వెతుకుతున్న సమయంలో మా అన్నయ్య నన్ను పిలిపించాడు. అలా నా సినీ కెరీర్ ప్రారంభమైంది. అదే సమయంలో అక్కినేనిగారి 'మరపురాని మనిషి' షూటింగ్ కూడా ప్రారంభమైంది. ఆ చిత్ర దర్శకుడు తాతినేని రామారావుగారు అందులో రాజబాబు కొడుకువేషం ఇచ్చారు. మంజుల, ఎన్టీఆర్, గుమ్మడి, శ్రీదేవి అందులో నటించారు. కె.వి.మహదేవన్ అద్భుత సంగీతం సమకూర్చిన ఈ చిత్రం 1973లో విడుదలైంది. ఆ రోజుల్లో ఎలాంటి చిత్రమైనా 50 రోజులు పైనే ఆడేది. ప్రేక్షకులు ఆ విధంగా ఆదరించేవారు. దర్శకులు కూడా సినిమా ఆ స్థాయిలోనే తీసేవారు.

### మద్రాసు అద్దె ఇంట్లో 29 ఏళ్ళు కాపురం

సినిమాల్లో నటిస్తూనే ఉద్యోగ ప్రయత్నాలు చేసుకునేవాణ్ణి. బ్యాంక్ ఎగ్జామ్ పాసైనాగానీ, రికమెండేషన్ లేకపోవడంతో ఉద్యోగం రాలేదు. దాంతో మద్రాసుకు మకాం మార్చేశాను. అన్నయ్య రాజబాబు దగ్గర ఆరు నెలలు ఉన్నాను. 1973లో కోడంబాకం లిబర్టీ థియేటర్ దగ్గర సింగిల్ బెడ్రూమ్ ఫ్లాట్ తీసుకుని బ్రహ్మచారిగా నా సినీ జీవనయాత్ర ప్రారంభించాను. నా వివాహం కూడా ఆ ఇంట్లో ఉండగానే జరిగింది. అదే ఇంట్లో మాకు పాప పుట్టింది. టెన్త్ వరకు మా పాప చదువుకున్నదీ ఆ ఇంట్లోనే. ఒక మహానగరంలో ఆ విధంగా 29 సంవత్సరాలు ఒకే ఇంట్లో అద్దెకు ఉండటం గొప్ప విషయం, ఇంటిగలవారి మంచితనం. మరో విశేషం ఏమిటంటే 2002 వరకు ఆ ఇంట్లో ఉండటమేకాదు, అక్కడ ఉండగానే 500 చిత్రాలు పూర్తిచేశాను.

### మూడు తరాల నటులతో....

2002లో హైదరాబాద్ వచ్చాక ఇప్పటివరకు 184 సినిమాల్లో నటించాను. ఆవిధంగా ఇప్పటివరకు మొత్తం 684 చిత్రాల్లో నటించాను. గాజుల కిష్టయ్య, బంగారు కలలు, విజయ, కలియుగ పాండవులు, ఇదా ప్రపంచం, పిచ్చిపంతులు, బాల గోపాలుడు, అపూర్వ సహోదరులు, అనురాగ దేవత... ఇలా ఎన్నో చిత్రాలు నాకు పేరు తెచ్చాయి. ఎన్టీఆర్., ఏఎన్నార్., ఎస్.వి.రంగారావు గార్లతో నటించాను. హాస్యానికి మారుపేరైన రేలంగిగారు, అల్లురామలింగయ్యగారు, అన్నయ్య రాజబాబు... ఇలా ఆ తరం వారితో కలిసి నటించాను. అలా నా జీవితానికి ధన్యత చేకూరింది. గర్వంగా కూడా ఉంది. అదీకాకుండా ఆనాటికీ ఈనాటికీ ఎవర్‌గ్రీన్ మహానటుడు అమితాబ్ బచ్చన్‌గారు నటించిన 'జాన్ జానీ జనార్దన్' హిందీ చిత్రంలో నేను నటించడం కూడా నాకు ఒక గొప్ప గర్వకారణం. జీవితంలో నేను మరచిపోలేని ఒక తీపిగుర్తు. ఇలా ఇప్పటివరకు నా 56 సంవత్సరాల సినీ కెరీర్‌లో మహానటుడు ఎన్.టి. రామారావుగారు, ఆయన తనయుడు బాలకృష్ణ, మనుమడు జూనియర్ ఎన్టీఆర్‌లతో నటించాను. అదేవిధంగా అక్కినేని నాగేశ్వరరావుగారు, ఆయన తనయుడు నాగార్జున, మనుమడు అఖిల్‌తో నటించడం నాకు గర్వకారణం.




### కమల్‌హాసన్‌తో

దేశం గర్వించదగిన మహానటుడు కమల్ హాసన్. ఒకరాదా ఇద్దరు కృష్ణులు చిత్రంలో మూడు రోజులపాటు ఆయనకు డైరెక్షన్ చేసే అదృష్టం నాకు కలిగింది. అది నిజంగా గర్వపడేలా చేశాను.

### 82 పెళ్ళిళ్ళు, దానధర్మాలు చేసిన రాజబాబు

సృష్టిలో ప్రతిజీవీ పుడుతుంది. బతికినంత కాలం బతకదు. కానీ పోయాక బతకాలి. అలా బతికేవాడే మనిషి. వాళ్ళే చిరంజీవులు. అందుకే కొందరు చిరంజీవులయ్యారు. వాళ్ళల్లో మనం ఒకళ్ళం కావాలంటే దానం, ధర్మం, పుణ్యం చేతనైనంత వరకు చేసుకుంటూ పోవాలి. జన్మ సార్థకం చేసుకోవాలి. ఇవన్నీ మా అన్నయ్య రాజబాబు మాటలే. ఎప్పటికీ మరచిపోలేను.

సినీ పరిశ్రమలో అన్నయ్యపేరు కాపాడుతూ నా సినీ ప్రయాణం కొనసాగించడం ఎంతో అదృష్టంగా భావిస్తాను. తను పడిన కష్టాలు మరొకరు పడకూడదని అన్నయ్య భావించాడు. అందుకే తన సొంత డబ్బుతో 82 పెళ్ళిళ్ళు చేశాడు. 67 మందిని చదివించి గ్రాడ్యుయేట్లను చేశాడు. రాజమండ్రిలో స్కావెంజర్స్ కాలనీ కట్టించాడు. ఆ సమీపంలోని కోరుకొండలో 'రాజబాబు జూనియర్ కాలేజీ' కట్టించాడు.

### షిరిడీసాయి ఆలయాల నిర్మాణం

నాకు వీలైనంతవరకు దానం, ధర్మం చేసుకుంటూ, ఆ షిరిడీసాయిబాబాకే జీవితాన్ని అంకితం చేద్దామని, ఆయనకు ఆలయాలు కట్టి జన్మ సార్థకం చేసుకుందామనుకుంటున్నాను. భక్తుల సహాయంతో హైదరాబాద్ కూకట్‌పల్లి భాగ్యనగరం, నిజాంపేటల్లో షిరిడీసాయి ఆలయాలు కట్టించాను. శంషాబాద్ గాంసియాగూడలో కట్టిస్తున్నాను. అవి ఉన్నంతకాలం చిట్టిబాబు కూడా సజీవంగానే ఉంటాడు.

### ఆత్మను మించిన ఆలయంలేదు

ఎన్ని బంగళాలు కట్టాం, ఎన్ని కార్లు కొన్నాం



అనేది ముఖ్యంకాదు, పుట్టినవాళ్ళంతా గిట్టక తప్పదు, చచ్చేంతవరకు చచ్చినట్టు బతకాల్సిందే. ఇదొక మాయా ప్రపంచం. ఈ మాయను దాటినవాడే ధన్యుడు. పుట్టుకను ఇచ్చిన ఆ బ్రహ్మే జీవిత నాటకం కూడా ఆడిస్తాడు. అందులో కొందరు ప్రధానమంత్రులు, ముఖ్యమంత్రులు, ఎంఎల్ఏలు, సినీనటులు, ఐపీఎస్, ఐఏఎస్‌లు అవుతారు. కొందరు సాహిత్యవేత్తలు, పారిశ్రామికవేత్తలైతే, మరి కొందరు రిక్షాకార్మికులు, ఆటోడ్రైవర్లవుతారు. వేషం పూర్తయితే ఈ లోకానికి గుడ్‌బై చెప్పక తప్పదు. మనిషికి ఈ వేషం పర్మినెంట్ కాదు. అందుకే దేవుడిచ్చిన వేషాన్ని న్యాయబద్ధంగా చేశామో లేదో ఆత్మ పరిశీలన చేసుకోవాలి.

దేవాలయాలు, పుణ్యక్షేత్రాలు ఎన్ని ఉన్నప్పటికీ ఆత్మను మించిన దేవాలయం మరోటి లేదు. దానికి న్యాయం చెయ్యాలి. అంతకు మించిన మరో గొప్ప విషయం ఏదీలేదు.

### కుటుంబం

1979లో నా వివాహం జరిగింది. నా భార్య పేరు శోభారాణి. మా అమ్మాయి నీలిమాదీప్తి. వివాహిత. అల్లుడు రాజగోపాల్. నాకు ఇద్దరు మనవలు. సుశోభిత్, సుశీల్. వాళ్ళంతా అమెరికాలో ఉంటున్నారు. అవకాశం వచ్చినప్పుడు మంచి వేషాలు చేస్తాను. ఉన్నంతలో దానధర్మాలు చేసుకుంటూ కీర్తి సంపాదించుకుంటున్నాను.

### త్వరలో రెండు చిత్రాలు

రెండు చిత్రాలు నిర్మించాలని అనుకుంటున్నాను. ఒకటి 'షిరిడీసాయిబాబా ధర్మక్షేత్రం', మరోటి 'వెర్రి వెంగళప్ప' (నామొగుడు అందగాడు). వీటిని ఎలాగైనా నిర్మించాలనేది నా చిరకాల వాంఛ. త్వరలోనే ఈ చిత్రాల నిర్మాణం కార్యరూపం దాలుస్తుందని ఆశిస్తున్నాను.

-కె.హరనాథ్
సెల్: 97035 42598

# ఇవన్నీ నిజాలే!

**వందేళ్ళుగా వెలుగుతున్న బల్బు!**

A కాలిఫోర్నియాలో అలమెడా కౌంటీలోని నగరం లివర్‌మోర్. ఈ నగరంలో 1901 నుండి ఇప్పటివరకు ఒక బల్బు వెలుగుతూనే ఉంది. ప్రపంచంలో అతి పురాతనమైన లైట్ బల్బ్ ఇది. మాస్టర్ మైండ్ ఎలక్ట్రీషియన్ Adolphe A. Chaillet ఈ బల్బును డిజైన్ చేశారు. లివర్‌మోర్ లైట్‌క్లబ్ సెంటెన్నల్ కమిటీ దీనిని సంరక్షిస్తోంది.

•••

A అమెరికాలో సుమారు 200 రకాల పుచ్చకాయలు పండుతాయి.

•••

A న్యూమెక్సికో స్టేట్‌లో గ్రాడ్యుయేషన్ తరగతులు 1873లో ప్రారంభమైనప్పుడు ఒకేఒక్క విద్యార్థి ఉండేవాడు. కానీ తీరా గ్రాడ్యుయేషన్ పూర్తయ్యే సమయానికి అతణ్ణి ఎవరో కాల్చి చంపారు.

•••

A 2008లో జరిపిన ఒక సర్వేలో 58 శాతం బ్రిటిష్ యువత షెర్లాక్ హోమ్స్ నిజంగా సజీవంగా ఉన్నాడనుకున్నారు. మరో 20 శాతం మంది విన్‌స్టన్ చర్చిల్‌ను సజీవుడని భావించలేదట.

•••

A ఒకటి, రెండు, మూడు, నాలుగు, ఐదు....ఇలా వెయ్యివరకు అంకెలు లెక్కబెట్టండి. ఇంగ్లీషులో స్పెల్లింగ్స్ రాస్తూ ఉండండి. కానీ మీకు వెయ్యి అంకెకు చేరేవరకు ఆ స్పెల్లింగ్‌లో 'ఏ' అక్షరం రాదు!

•••

A లియోనార్డో డావిన్సీ మరణానంతరం ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన మోనాలిసా చిత్రాన్ని ఫ్రాన్స్‌కు చెందిన కింగ్ ఫ్రాన్సిస్-1 తన బాత్‌రూమ్‌లో వేలాడదీసి ఉంచాడు.

•••

A అమెరికాలో చేపలు పట్టేపని, ఎయిర్‌లైన్స్ పైలెట్ ఉద్యోగాలే అత్యంత ప్రమాదకరమైనవి!

•••

A వైట్‌హౌస్‌లో క్రిస్మస్ ట్రీ పెట్టుకున్న మొట్టమొదటి అమెరికా అధ్యక్షుడు ఫ్రాంక్లిన్ పియర్స్.

•••

A ఒక కాంతి కిరణం సూర్యుడి మధ్యభాగం నుండి ఉపరితలానికి ప్రయాణించాలంటే 40 వేల సంవత్సరాల సమయం పడుతుంది.

•••

A ప్రపంచంలో ఏటా 311 మిలియన్ టన్నుల ప్లాస్టిక్ ఉత్పత్తి అవుతోంది.

•••

A బ్రిటిష్ సామ్రాజ్యకాలంలో అంటే 136 ఏళ్ళ క్రితం గ్రాడ్యుయేషన్ పట్టాపుచ్చుకున్న తొలి భారతీయ మహిళలుగా చంద్రముఖిబసు, కాదంబినీ గంగూలీ చరిత్రపుటల్లో నిలిచిపోయారు.

•••

A హిందీ నవలా సాహిత్య సామ్రాట్‌గా చరిత్రలో స్థానం పొందిన ప్రేమ్‌చంద్ మొదటిభార్య గయ్యాళి. తర్వాత ఆయన బాల వితంతువును పెళ్ళి చేసుకున్నారు.

-చిన్నారి

# సుధామ పదగారడి-299

సెల్: 98492 97958

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| ■ | ■ | 1 | | | 2 | | ■ | ■ |
| 3 | ■ | | ■ | ■ | | ■ | ■ | 4 |
| 5 | 6 | | ■ | 7 | | 8 | | |
| ■ | | ■ | 9 | ■ | ■ | | ■ | |
| 10 | 11 | 11 | | ■ | 12 | | 13 | ■ |
| | ■ | 15 | ■ | ■ | | ■ | | ■ |
| 14 | | | 15 | | ■ | 16 | ■ | 17 |
| ■ | ■ | ■ | | ■ | ■ | | ■ | |
| ■ | ■ | 18 | | | | | ■ | ■ |

## ఆధారాలు

**అడ్డం**

1. అల్లసాని పెద్దనగారి ప్రబంధము (5)
5. తెలంగాణ జాగృతి స్థాపకురాలు (3)
7. రామరాజభూషణుడు రాసిన దీనికి పిల్ల వి చాలా వచ్చాయి (5)
10. గిరిక తల్లి, కోలాహలుడి భార్య (4)
12. సాటిలేనిది, నైరుతి దిక్కున ఆడ ఏనుగు (4)
14. దశరథునికి కైక, కృష్ణునికి సత్యభామ (5)
16. వర్షబిందువు (3)
18. వాల్మీకి మహాకావ్యం (5)

**నిలువు**

1. వస్త్రపుమడుపు, నడుముకూ పడుతుంది (3)
2. తలక్రిందయిన ఓ వక్కపొడి (3)
3. ప్రియము కానిది (2)
4. సినిమారంగం (4)
6. సంసారం మీద ఇది కలిగితేనే కొందరు సన్యాసులవుతారు (3)
8. రోడ్డురోలర్‌తో భూమిని ఇది చేయచ్చు (3)
9. భ్రమ (2)
10. 'కళాపూర్ణోదయము'లో ఓ ప్రధాన స్త్రీపాత్ర (4)
11. మళ్ళీ (3)
12. మహాసాధ్వి అనసూయ భర్త (2)
13. వాడి (3)
15. హార రహిత భాగాహారమా! (3)
16. బహుకాలము (3)
17. టేబుల్ ముందు వేసుకునేది, కూర్చునేది (2)

### పదగారడి-298 సమాధానాలు

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| ■ | గ | ణ | తం | త్ర | ది | న | ము | ■ |
| మ | ది | ■ | క్రి | ■ | ట | ■ | ని | జం |
| ది | ■ | జ | ■ | ఎ | వృ | రు | ■ | తు |
| ర | ■ | గ | ■ | త్త | ■ | జా | ■ | వు |
| ■ | కా | మె | ష | ■ | ఆ | గ్ర | హం | ■ |
| ప్ర | ■ | మా | ■ | శో | ■ | ష్టు | ■ | ప |
| ధా | ■ | య | మ | కం | ■ | డు | ■ | లా |
| ని | త్యం | ■ | హ | ■ | వ | ■ | మై | కం |
| ■ | ■ | హా | ర్ది | కో | త్స | వం | ■ | ■ |

Printed and Published by VEMURI RADHAKRISHNA, Managing Director, on behalf of Aamoda Publications Pvt. Ltd., Plot No.76, Aswani Layout, Huda Heights, Jubilee Hills, Hyderabad-500 033. Ph.(040) 23558233/44, Fax No.23558288. Printed at Aamoda Press, R.S.No.191/3, Ward No.43, Donka Road, Patamata, Vijayawada 520 010, Reg.No.: APTEL/2004/12594. Editor: A.N.JAGANNADHA SARMA

